# భారతి

సాహిత్య మాసపత్రిక

సంపాదకుడు

శివలెంక శంభుప్రసా

జూలై 1955

సంపుటము 32 : సంచిక 7

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూలై 1955



త్రివర్ణ చిత్రము: 'కైసేత'—చిత్రకారిణి: కుమారి శ్యామాకౌండిన్య




అందరికీ మంచిది
ఎందుకంటే అది శుద్ధమైనది

డాల్డా తయారుచేయబడునపుడు చేతితో తాకబడదు మరియు దానిని శుద్ధముగాను, తాజాగాను ఉంచుటకు గాలిచొరని సీలు డబ్బాలలో నింపబడును.

అందరికీ మంచిది
ఎందుకంటే అది పుష్టికరమైనది

అతి శ్రేష్ఠమైన కూరగాయల నూనెలే డాల్డాను తయారుచేయుటకు ఉపయోగించబడుతవి — అది ఆరోగ్యాన్ని కలిగించు విటమినులు 'ఎ' మరియు 'డి'లనుకూడ కలిగియున్నది.

డాల్డా వనస్పతి బిడ్డలకు ఎదుగుటకు, శక్తికి అవసరమగు తాజా క్రొవ్వుపదార్థాలను యిస్తుంది. వంటనుగూర్చి ఉచిత సలహాకొరకు, ది డాల్డా అడ్వైసరీ సర్వీస్, ఇండియా హౌస్ (జి.పి.ఒ.కి ఎదురుగా), బొంబాయి 1కి వ్రాయండి.

భారతదేశంలో అన్నిచోట్లా ½ పౌను; 1 పౌను; 2 పౌన్లు; 5 పౌన్లు మరియు 10 పౌన్లు డబ్బాలలో దొరుకును.

# డాల్డా వనస్పతి

వంటకు దివ్యమైనది.
ఖర్చు తక్కువ




HVM. 235-X52 TL

# ప్రాణదీపము

దాశరథి

అయిదు రేకుల దీపకళికను
ఆర్పజూచెద రెవ్వరు ?
తారకా నవనైలబింబపు
లారనిచ్చునె బ్రతుకుదివ్వెను !

2

విచ్చుచున్నది దీపకళికా
విరళ దళములు కోర్కెలట్టుల;
విహగమై నవదీప కీలిక
విహారణముగావించె దిక్కుల.

ముక్కు, దీపాంకురము ముద్దిడ
రమ్య మందానిల కుమారా !
నర నరమ్ముల కాంతిలహరిక
నర్తనము గావింపగా——

4

గగన నీల శిలావినిర్మిత
కాంతిసౌధ శిఖాగ్రసీమల
పుష్పమై చైతన్య నేత్రము
పుల్కుపుల్కున చూడగా.

విశ్వమంతయు తత్ప్రదీప
ప్రియ శిఖాగ్నిజ్వలించు చున్నది;
తచ్ఛిఖా కోష్ణత్వమే మన
తరతరమ్ముల బ్రతుకు చరితము.

6

మబ్బులై మన గ్రుడ్డి వాంఛలు
మలిన మొనరించును మనస్సును;
ఉరుములుగ ఉల్కాపతనముగ
ఉరుకు నెత్తుటి తప్పలు !

ఈ అఖండాజాండమందున
ఇంత చిన్న వికారి దీపము
ఎంతగా కాంతిల్లుచున్నదొ
ఎరుగుదుమా జగమా!

8

గగనములు పడిపోయి, సాగర
గణము పాతాళమున కింకిన
గాని ఈ ప్రాణప్రదీపిక
కాంతి తగ్గదు; సత్యము.

# రెండు గీతాలు

శ్రీ వి. సింగరాచార్య

## ౧

నీదు పాదపీఠ మిచట
నీ పదాళి చెలగు నచట
పతితులు పేద లనాథలు
బ్రతుకు బండి లాగు చోట.

ఏను నీకు నతి సేయగ
నెంతగ ప్రయతించిన ప్రభు!
అంటదు నా నతి నీపా
దాంచల మట నెటనో యుండె—
పతితులు పేద లనాథలు
బ్రతుకు బండి లాగు చోట.

దురహంకారుల వినతులు
చొరగలేవు కాబోలును
నిరుపేదల వేసములో
నీవు మసలుచుండు వీట—
పతితులు పేద లనాథలు
బ్రతుకు బండి లాగుచోట.

నా మానస మేనాటికి
స్వామి చొరగజాలదేమొ!
తోడులేని వారికి చే
దోడై నీవలరు చోట—
పతితులు పేద లనాథలు
బ్రతుకు బండి లాగుచోట.

## ౨

మూఢమతీ! నీ మూపున
నీవె యెటుల నూరేగెదు?
బిచ్చగాడ! నీవు నిన్నె
బిచ్చమెత్తి ఏమి గొనెదు?
సర్వభారములు వహించు
స్వామి పాద సీమను నీ
సర్వ భార మర్పణమ్ము
సలిపి మనుము నిశ్చింతగ
మూఢమతీ!...

నీ మోహము-తన యూపిరి
తో ముట్టిన తిరువళికను
ఆర్పివేయు నోయి తాన
ఆ క్షణమ్మె వెరపు లేక
మూఢమతీ!..

మోహమలిన కరముల గొన
బోలదోయి నీ వరములు;
స్వచ్ఛమైన ప్రేమ లతా
సుమములె చిర శుభకరములు
మూఢమతీ!..

* రవీంద్రుని 'గీతాంజలి' నుండి.

# పతితుడు

శ్రీ కంచి వాసుదేవరావు

## పాత్రలు

మధుసూదనరావు, నిర్మలాదేవి, శేఖర్, మూర్తి, గోపీ

### మొదటి రంగము

* * మధుసూదనరావు పడకకుర్చీలో కూర్చుని పేపరువంక చూస్తూ వుంటాడు. అప్పుడప్పుడు, తలనెత్తి పక్కకి ఎవరికోసమో చూస్తుంటాడు. నిర్మల ఒక ట్రేలో రెండు కప్పులు కాఫీ పెట్టుకుని ప్రవేశిస్తుంది.

మధుసూదనరావు : అమ్మయ్య వచ్చావా!... పేపరు చూడ్డానికి కష్టపడుతున్నా. మనస్సంతా దేవిగారిచ్చే కాఫీమీదనే! యేంటీవాళ ఎనిమిదయి పోయింది?

నిర్మల : (కాఫీకప్పులు బల్లమీదపెట్టి) ఇవాళ గొల్ల వచ్చేటప్పటికి ఆలస్యమయింది. ఆలస్యమయినా చక్కని నీళ్లపాలే. కనుక అట్టే మనసు పెట్టుకుంటే మిగిలేది ఆశాభంగమే (అని నవ్వి) అయితే శేఖరు ఏడీ?

మధు : (కాఫీ కప్పును అందుకుని) మళ్లా పెట్టెనంతా దిమ్మరిస్తున్నాడు. ఏం పారవేసుకున్నాడో.

నిర్మల : పారవేసుకోడు. ఎక్కడో పెట్టి మర్చిపోతాడు. వారానికి రెండుసార్లు ఆ పెట్టె సర్దుతాడు. ఏంలాభం? మర్నాటికల్లా అది మామూలు.

మధు : (కాఫీ త్రాగేసి, కప్పు బల్లమీద పెడుతూ) అతను ఎన్నిసార్లు సర్దినా ఆ పెట్టెలో చూస్తే సమస్త క్రిమికీటకాది జంతుజాలం నివాసం చేస్తున్నట్టు వుంటుంది ... (తెలివిగా మాట్లాడినట్లు నిర్మలవంక చూసి ఓ నవ్వునవ్వుతాడు.)

నిర్మల : (తనూ నవ్వుతూ) పరిహాసానికేం వచ్చేలెండి. అతన్ని పిలవండి కాఫీ చల్లారిపోతోంది.

మధు : ఏం సంగనాచివి? ... మీ బావని నేను పిలవాలా? అతన్ని పిలవడానికి బిడియమా!... పాపం! — శేఖర్!... తర్వాత సర్దుకుందుగానిలే! రా! కాఫీతీసుకో చల్లారిపోతోంది.

శేఖ : (లోపలికి వస్తూ చేతి గడియారంవంక చూసుకుని అబ్బో అప్పుడే ఎనిమిది దాటిందే!... (కుర్చీలో కూర్చుని కాఫీకప్పు అందుకుంటాడు).

నిర్మల : చల్లారిపోయిందేమో!... వెచ్చబెట్టనా?...

శేఖ : అక్కర్లేదు ... వేడిగానే వుంది ... కాఫీ కప్పు అందుకుని గబగబా తాగేస్తాడు.

మధు : ఏమిటి శేఖర్ వెదుకుతున్నావు?

శేఖ : ఏముంది? ఓ స్నేహితుడు వ్రాసిన వుత్తరం. దానికి జవాబు వ్రాయాలి. ఆ వుత్తరం ఎక్కడ పెట్టానో మర్చిపోయాను. దాన్ని పట్టుకునే టప్పటికి తాతలు దిగి వచ్చారు. ఇప్పుడు ఆ పెట్టెనంతా సర్దేప్పటికి తల ప్రాణం తోకకి వచ్చింది.

నిర్మల : ఏమిటో అంత జర్దారుగా జవాబు యివ్వవల్సిన వుత్తరం. (అని చిలిపిగా నవ్వుతుంది)

మధు : (కొంటెతనంగా) నిర్మల భయమంతా అదేదో ప్రేమలేఖేమోనని. (నవ్వుతాడు)

నిర్మల : మధ్యా నాకు దేనికో భయం ?

శేఖ : ప్రేమలేఖా కాదు, విరహగీతమూ కాదు. కేవలమూ ఓ స్నేహితుడు వ్రాసిన వుత్తరం.

నిర్మల : అయితే ఏం లాభం? ... యివాళే యింత కష్టపడీ పైపెట్టె సర్దావు ... రేపు మళ్లా మామూలే!...మళ్లీ యింకేవో కన్పించదు. (ఆలోచనగా) ఎన్నాళ్లిల్లా? నీ వస్తువులు నువ్వు సర్దుకోలేవు. సర్దువున్నవాటిని నిలుపుకోలేవు. నీ అవసరాలేవో నీకు తెలియదు. నీ గురించి శ్రద్ధవహించి, నీబాధ్యత వహించే ఒక స్త్రీ నీకు అవసరం.

శేఖ : మరో స్త్రీ ఎందుకు నిర్మా!

ఆవసరాలన్నీ నీకు తెలుసు.

మధు : అదికాదు శేఖర్ ! ... నేనూ నిర్మలా, నువ్వంటే ఎంత శ్రద్ధచూపినా ఆ తీరే వేరు. నువ్వు చిన్నవాడివి...ఎంతో జీవితాన్ని అనుభవించవల్సినవాడివి. నువ్వు తిరిగి ఓ ఇంటివాడివి ఎందు కవకూడదూ?..

: (బాధగా) మధూ! బహుశా రుక్మిణి గురించి నీవు వినేవుంటావు...రుక్మిణి సంగతి నిర్మలకి బాగా తెలుసు. నా ఆశ్రద్ధ నాకు గుర్తు రాకుండా చేసేది. (జేబు రుమాలుతో మొగము తుడుచుకుని) ఆ రెండేళ్లు నేను భూలోకంలో స్వర్గం చూశాను. ...దురదృష్టవంతుడ్ని... నా స్వర్గం స్వప్నగాథ అయిపోయింది.

మధు ఊరుకో శేఖర్ ...గడచిన గాథలు తవ్వుకోవడము దేనికి?

శేఖ (ఆగకుండా) జీవితంలో నా భార్యగా వుండడానికి ఒక స్త్రీకే అధికారముంది. ఆ స్త్రీ పోయినంతమాత్రాన మరో స్త్రీ ఆ స్థానం ఆక్రమించలేదు. నేను ఎవరినయినా గౌరవించవచ్చు—కాని భార్యగా ప్రేయసిగా ఎవర్నీ ప్రేమించలేను. (ఒక్కసారిగా తగ్గిపోయి) ... అయినా నాకు యిప్పుడు వచ్చిన లోటేమిటి ?...నాకు కావల్సిన దేమిటి? నా అవసరాలు చాలా కొద్ది...మీ రిద్దరూ సర్వథా నా శ్రేయోభిలాషులు. అందుక నే ఎవ రేమనుకున్నా... నా మూలాన మీ రపనిందల పాలవుతున్నా..మీరు నన్నెంతో ఆత్మీయుడుగా ప్రేమిస్తున్నారు. ఈ జీవితము ఇల్లా గడచిపోవడంకన్న అదృష్ట మేమిటి ?

నిర్మల : ఇంత బాధపడ్తావని తెలిస్తే ఆ ప్రశంసే ఎత్తేదాన్ని కాదు క్షమించు. (కాఫీకప్పులు తీసుకుని లోపలికి వెళ్లిపోతుంది).

మధు : మరేం బాధపడకు శేఖర్!...యిక యీ ప్రసక్తి మళ్లీ తేను. నువ్వు నా ఆత్మీయుడివి ...అందుకని అప్పుడప్పుడు చనవు తీసుకుంటూ వుంటాను.

: మీ రిద్దరూ ఏదో అన్నారని నేను బాధపడడంలేదు. (సంభాషణ మార్చాలని) అయితే నిన్న నేను చెప్పిన సంగతి ఏం చేశావ్ ?

మధు : ఏమిటి? మీ ఆఫీసులో ఖాళీ అయిన టైపిస్టు పోస్టుకి నిర్మల ఎందుకు ప్రయత్నించరాదనేనా?

శేఖ : అదే—ఏమాలోచించావ్ ?...

మధు : నిర్మల షార్టుహేండూ టైపురైటింగూ పాసయిందనుకో—కాని నిర్మలకి వుద్యోగం చేయవల్సిన అవసర మేముంది?

శేఖ : అవసరమనీ కాదు—అది లేకపోతే యింత పెద్ద సంసారం గడవదనీ కాదు...అన్ని పనులూ అవసరముండే చేస్తున్నామా?... ఇంట్లో వూరికే కూర్చునేదానికన్న నెలకి ఓ ఎనభయి రూపాయిలు సంపాదించుకో కూడదూ?...ఇంతకీ నీఉద్దేశం స్త్రీ వుద్యోగం చేయకూడదనా?

మధు : అబ్బే అది కాదు. అవసరముంటే తప్పక చేయవల్సిందే! మనం వుద్యోగాలు చేస్తున్నాం చాలదూ?...ఏం సుఖపడ్తున్నాం.

యజమాని కెక్కడ కోపము వస్తుందోనన్న భయం, ఆత్మని చంపుకోవడం మనం చేస్తున్న పనే!...ఆ బెడద ఆడవాళ్లకి కూడా దేనికి? హాయిగా వున్న యింటిని దిద్దుకుని ఆ ఇంటిని స్వర్గము చేయడంకన్న స్త్రీ చేయగల మహత్తరమైన వుద్యోగం ఇంకేముంటుంది?

శేఖ ఇప్పుడీ యింటిని యిరవై నాలుగు గంటలూ సర్దవలసిన అవసర మేముంది?

మధు : ఇప్పుడంటే ఇప్పుడు కాదు. రేపటికి సంసారం పెరుగుతుంది అప్పుడు?...

శేఖ : రెండింటికీ ఎప్పుడయితే తూగదో అప్పుడే మానుకోవచ్చు.

మధు ఒకసారి ప్రవేశించడం, మానుకోవడం ఇదంతా దేనికి?...హాయిగా ఏవో పుస్తకాలు, పత్రికలు చదువుకోక.

[ప్రక్క యింటి మూర్తి ప్రవేశం]

మూర్తి అహా! ఇద్దరూ యిక్కడే వున్నారూ?... రామలక్ష్మణులు!...ఇంకా ఆఫీసుకు టైం కాలేదూ?.. ఇద్దరూ పక్క తల్లి బిడ్డల కన్నా ఎంతో అన్యోన్యంగా ఉంటారు!..

మధు ఏం యిలా వచ్చారు కూర్చోండి.

మూర్తి (కూర్చుని) అబ్బే ఏం లేదండీ! ఏమయినా పత్రిక కాని, నవల కాని తీసుకుని చదివిద్దామని...

శేఖ చదివిద్దామనే...పాపం! (అని హేళనగా నవ్వుతాడు)....

మూర్తి అంటే మీ వుద్దేశ్యం?

శేఖ మనలో మాట! ... మీరు ఫిల్మిండియా సాయంత్రం యిస్తానని చెప్పి తీసుకువెళ్లి రెండు నెలలయింది ... యింకా కాదా దాని మొహమే చూపలేదు.

మూర్తి (బుర్ర గోక్కుంటూ) ఎక్కడో వుంటుం దండీ! ఇంటికి పంపిస్తాను.

ఇంకా చదువుతూనే వున్నారు. అయినా నా పిచ్చి కాని తీసుకు వెళ్లిన ఏ పత్రిక తిరిగి యిచ్చిన పాపాన పోయారు?

మూర్తి : ఏమిటండోయి?...అంత నిష్ఠూరంగా మాట్లాడుతున్నాడు?...ముష్టి పత్రిక... అయినా యీ విషయంలో మీ జోక్యం దేనికి? నేను తీసుకువెళ్ళింది మధుసూదన రావుగారిదగ్గర. ఆయనకు లేని తొందర మీకు దేనికి?

శేఖ : అవును నాకు దేనికి తొందర?...యిప్పుడా పత్రిక ముష్టిదయిపోయిందా!...సరే మీతో ఘర్షణ దేనికి? కావాలంటే పత్రిక కొనుక్కోండి! (లోపలికి విసురుగా పోతాడు)

మూర్తి : (తెప్పరిల్లుకుని) చూశారండీ ఆయన దురుసుతనం?

మధు : ఏదో కుర్రతనంలెండి! అందరూ మనసులో మాట దాచుకోలేరు చూడండి...

మూర్తి : (అంతరార్థం గ్రహించలేక) అల్లా అని ఎంతమాటబడితే అంతమాట ఎవర్నిబడితే వారిన నేయడమేనా చెప్పండి!...మిమ్మల్ని చూసి కానీ! ... అయితే మధుసూదనరావుగారూ తెలియక అడుగుతాను. అన్యథా భావించకండి...

మధు : తెలియక అడిగేటప్పుడు అన్యథా భావించడాని కేముంటుంది? అవశ్యము కానివ్వండి. మీరూ మామంచికే చెపుతారుగా.

మూర్తి : అందుకనే చెప్పసాహసిస్తున్నా!...అంటే నావుద్దేశ్యము యిదని కాదు! ... నలుగురూ అనేమాటే నేనూ చెప్తున్నాను. మనకి మనం మంచి అనుకుంటే సరా చెప్పండి!...నలుగురూ మనగురించి ఏమనుకుంటున్నారో యోచించుకో అక్కర్లేదా? నలుగురూ విమర్శించే పని మనం చేయడం దేనికి చెప్పండి?...

మధు ఇంతకీ తమరు అసలు విషయం సెలవివ్వడంలేదు.

మూర్తి (టక్కున) శేఖరం మీ బంధువే అనుకోండి! ... అయినా ఎన్నాళ్లు యిక్కడ వుంటాడు? ఎంతయినా పరాయియిల్లు. పెళ్లి పెటాకులు లేకుండా ఎన్నాళ్ళిల్లా వుంటాడు చెప్పండి.

మధు ఎన్నాళ్లున్నా మేము అతన్ని పరాయి వాడుగా అనుకోవడం లేదు గాదండీ!

మూ_ మీరు అమాయకులు... తెల్లవన్నీ పాలను కుంటారు, అందరూ ఏమనుకుంటున్నారో ...లోపలనుంచి నిర్మల గొంతు: తొందర పడకు శేఖర్!

శేఖ : (దూకుడుగా వచ్చి) మూర్తిగారూ! అందరి తరఫునా తమరు వకాల్తనామా పుచ్చుకుని వచ్చారు. ఈ కేసులో మీ ఫీజెంత?

మూర్తి : (ఒక్కక్షణం బిత్తరపోయి—వెంటనే తెప్పరిల్లుకుని) ఇందులో నాకు ఒరిగే దేముంది? కేవలం (మధుసూదనరావు వంక చూపిస్తూ) నేను వారి శ్రేయోభిలాషిని.

శేఖ : అవును పాపం. అందుకని వారి నుద్ధరించడానికి వచ్చారు! ... నామూలాన వారికి కలిగే అపఖ్యాతి తొలగించడానికి పూనుకున్నారు! ... వారంటే నిజంగా ఎంత అభిమానమండీ?...

మూర్తి : (సహనాన్ని కోల్పోతూ) పరిహాసానికయినా సత్యం మాట్లాడారు. అసలు మీ మూలాన కదూ?

మధు : మూర్తిగారూ ఆవేశంతో మీరు అసభ్యంగా మాట్లాడుతున్నారు!

మూర్తి : నేనా అసభ్యంగా మాట్లాడేది! ... మధుసూదనరావుగారూ మీరూ నన్నిల్లా అంటే ఎల్లా!...ఇంకా శేఖరంగా రన్నారంటే అర్థం చేసుకోగలను.

శేఖ : (కోపంగా) అంటే నీ వుద్దేశ్యం?...

మూర్తి : (గట్టిగానే) గొంతు చించుకున్నంత మాత్రాన బెదిరిపోతా ననుకున్నావా?... నా వుద్దేశ్యం...ఇక్కడ మీ కన్నిరకాల సదుపాయాలు ఉన్నాయని...

శేఖ : షటప్!...రాస్కెల్!...ముందర బయటికి నడు. లేకపోతే ... (మీదికి వెళ్తాడు. మూర్తి రెండడుగులు వెనక్కి వేస్తాడు. 'ఆగు శేఖర్' అంటూ మధుసూదనరావు లేచి శేఖరాన్ని వారిస్తాడు.)

మూర్తి : ఏం చేస్తావేం?...

శేఖ (ఆవేశంతో రొప్పుతూ) పిచ్చిగా వాగితే ఏదయినా చేస్తాను.

మూర్తి : ఆ చేసే మొహమే! ... బయిటికి రా!.... ఎవరు ఎవర్ని ఏం చేస్తారో తెలుస్తుంది... మధుసూదనరావుగారూ ఆలోచించుకోండి (బయటికి వెళ్తాడు).

శేఖ : (రొప్పుతూ) కుర్చీలో కూలబడతాడు.

మధు : (అతని వీపు నిమురుతూ) పిచ్చి శేఖర్!... ఎందుకంత ఆవేశం?...

నిర్మల : (ప్రవేశిస్తూ) వెళ్లాడూ!...ఎప్పుడూ ఏదో అనందే వెళ్లడు. ఎవరి బ్రతుకు వారిని బ్రతకనివ్వడు కాబోలు.

(ఆవేశం పూర్తిగా దిగ్లారదు) రానిస్తుంటే సరి.

మధు : (నింపాదిగా!...) ఎందుకు అతనన్న మాటలకి మీరు యింత యిదవుతారు?

శేఖ : అంటే నీ ఉద్దేశం?

నిర్మల : అతనన్న మాటలకి మీకు ఏమీ బాధపడరా?

మధు : పడను. ఎవరో ఏదో అన్నారని మనం బాధపడటం దేనికి? ...అందరి మనసులూ ఒకే ఉన్నతి స్థాయిలో వుండవు ... వారు ఆ విధంగా తప్ప మరో విధంగా ఆలోచించ లేరు. వారిని చూచి జాలిపడాలిగాని ... వాళ్లతోపాటు మనమూ సభ్యత మరిచి పోవడ మేం భావ్యం?

శేఖ : నీఅంత సహనం నాకు లేదుసుమా!

మధు : సరే ఇక అది పోనియ్యండి...యివాళ సినిమా ప్రోగ్రాం...సాయంత్రం అందరూ రెడీగా వుండండి.

: సినిమాకా?

నిర్మల : యివాళేనా?

మధు : అవును యివాళే. సుసాక్షాహోదన్న పిక్చరు, యివాళిటితో ఆఖరు. శేఖర్ టిక్కెట్లు కట్టి పెట్టి ఆరింటికే యింటో భోజనం చేయించు కోవాలి. నిర్మలా నువ్వూ అన్ని పనులూ తెములుచ్చుకొని రెడీగా వుండాలి.

: ఓ! కే! (అంటూ వెళ్తాడు)

నిర్మల : మనిషికి సినిమాలంటే ఏం సరదా!...

మధు : అవును నిర్మలా!...నిజం చెప్పావు! ... చదవడానికి ఓ పుస్తకం, గీయడానికి ఓ బొమ్మ...చూడ్డానికి ఓ సినిమా...షికారు చేయడానికి ప్రశాంతమయిన పున్నమరేయి. యివి వుంటే నాకికేం అక్కర్లేదు...

నిర్మల : అవును యివివుంటే నేను అక్కర్లేదుగా!...

మధు : ఇవన్నీ ఓయెత్తూ!...నీవో ఎత్తూ!...నీవు లేనినాడు నేనూ వుండను.

## రెండవ రంగము

** హాస్పిటలులో ఓ గది...బెడ్ మీద మధుసూదనరావు పడుకొని వుంటాడు. కళ్ళకి మొగానికి కట్లు కట్టి వుంటాయి...ఆ మంచంపైన '21'టి నంబరు వుంటుంది. నిర్మల ప్రక్కనే కూర్చుని వుంటుంది. జుట్టంతా రేగిపోయి వుంటుంది. మొగమంతా వాచివుంటుంది... చూస్తే బాగా ఏడ్చినట్లు వుంటుంది. మాట చాలా బడలికగా వుంటుంది

మధు (మూలుగుతూ!) నిర్మలా! నిర్మలా!

నిర్మల ఇక్కడే వున్నాను! ఏం కావాలి?

మధు ఇక్కడే వున్నావా (జాలిగా) నిర్మలా నన్ను విడిచి ఓక్షణమయినా వుండవుకదూ! ఇక నీవు లేకపోతే నా బ్రతుకే లేదు.

నిర్మల : అబ్బ! కాసేపు విశ్రాంతితీసుకోరూ!

మధు : కాసేపేం కర్మ! ... ఇక పూర్తి విశ్రాంతి.

[శేఖరం ఆదుర్దాగా లోపలికి వస్తాడు. అతనిముఖంలో ఆందోళన వ్యక్తమవుతూ వుంటుంది]

(వస్తూ) ఏం జరిగింది? ఎల్లా జరిగింది?

మధు ఎవరూ! ... శేఖరా! ...రా చూశావా నాస్థితి.

శేఖ : (మధుకి మరో ప్రక్కన కూర్చుని) ... ఎల్లా జరిగిందీ దారుణం?...

నిర్మల ఇంక ఎక్కడా వుద్యోగాలు దొరకనట్టు ఆ కెమికల్స్ ఫ్యాక్టరీలో పనిచేస్తుంటే నే ననుకున్నా...ఎప్పుడో అప్పుడు యిట్లాంటిది జరుగకపోదని.

మధు గ్రహచారము కాని !...యిదివరకు ఎన్ని సార్లు ఆ ద్రావకముతో ఎక్స్‌పరమెంట్ చేయలేదు?....ఇవాళ నా కర్మం కాలి అలా ఎక్స్‌ప్లోడ్ అయిందిగాని ... ఈ ఒక్క సంఘటనతో జీవితంలో ఎందుకూ కొరగానివాడి నయ్యాను—నా కర్మ...

(ఆతురత భయమూ కలిసిన గొంతుతో) అయితే యిక ఆ కళ్లు రావా?...డాక్టర్లు ఏమన్నారు?

మధు : ఏమంటారు? ఏదో ధైర్యం చెపుతారు! అంతకంటే ఎవరు ఏం చేయగలరు? (గాద్గదికంగా) నిర్మలా? యీ ప్రమాదంతో నా ప్రాణం పోయివుంటే బాగుండేది...కాని నేను దురదృష్టవంతుణ్ణి. జీవితమంతా నేను యిక ఒకరిమీద ఆధారపడవల్సిన నికృష్టపు బ్రతుకయిపోయింది...నిర్మలా!.. నాకు చావు రాకూడదూ!... నే నేం పాపం చేశాను?

నిర్మల (అతికష్టంమీద తనని తను సంబాళించుకుంటూ)...అబ్బ వూరుకోరూ ?

మధు : ఊరుకోమంటున్నావా? ఎల్లా అనగల్గుతున్నావా మాట ?...ఎట్లా ఏమని వూరుకోను? (బాధగా) యిక యీ ప్రపంచాన్ని నేను చూడలేను. ఒక నవల చదవలేను. ఒక సినిమా చూడలేను. వెన్నెల అందాన్ని చూసి ఆనందించలేను. నాకు మిగిలింది చీకటి ... అతి భయంకరమయిన చీకటి. పుట్టు గ్రుడ్డివాడు ఎప్పుడూ వెలుగుచూసి వుండడు కనుక వాడికి చీకటి భయముండదు. కాని ఒకసారి వెలుతురులో వున్న సౌందర్యాన్ని అనుభవించిన నేను చీకటి నెల్లా భరించగలను ?

శేఖ : (ఓదార్పుగా ధైర్యం చెప్పాలన్న వుద్దేశ్యముతో) మధూ!....నీకన్నీ తెలుసు....నేను

చెప్పగలిగినవాడిని కాదనుకో!...నీబాధని నేను పూర్తిగా అర్థం చేసుకోగలను?... కాని బాధపడి దిగులుపడి ఏం చెయ్యగలవు? భగవంతుడు నీకు చేసిన యీఅన్యాయానికి మానవుడు ఎల్లా నిష్కృతి కల్గించగలడు చెప్పు?...యీ నూతనజీవితాన్ని ఆత్మ ధైర్యంతో ఎదుర్కోవాలి.. యీ సంగ్రామంలో ధైర్యంగా ముందుకు సాగు!...

మధు : (వున్నట్టుండి వుద్రేకంగా) ఆత్మధైర్యమూ, జీవిత సంగ్రామమూ! ... పక్కన కూర్చుని ఎన్ని కబుర్లయినా చెప్పవచ్చు. అయినా నా సోదరి కాని ఎవరిదగ్గర ఏమి ఆశించగలను?

శేఖ : (సంభాషణ మార్చాలని) నిర్మలా! యీ సంగతి మీ వాళ్ళకి...యింటి అన్నగారికి తెలియపరిచారా?...

నిర్మల : (నిరుత్సాహంగా) తెలియపరిచాను.

మధు : (నిస్పృహగా) తెలియపరిచినా ఏంలాభం? వస్తారు. అయ్యో ఎంతపని జరిగిందంటూ విచారం పలుకుతారు. తర్వాత అందరూ వచ్చినదారినే పోతారు. అయినా అంత కంటే ఎవరుమటుకు ఏం చేయగలరులే!...

నిర్మల : (చేతులు నులుముకుంటూ) ఏం చేయాలో తెలియడం లేదు.

శేఖ ఇంతకీ కంపెనీవారు ఏమంటారు?...

మధు నువ్వు వట్టి పిచ్చివాడివయ్యా!... ఎవరు మటుకు నా కర్మాని కేం చేస్తారూ!... నన్నెరుగున్న వారంతా నిజంగానే నన్ను చూసి జాలిపడ్తారు...మా జనరల్ మేనే జరు మంచివాడు. నామీద సదభిప్రాయ ముంది...యీ ప్రమాదం ఆయన కంపెనీ ఆవరణలో జరిగిందికనుక నాకు కొంత నష్టపరిహార మిప్పిస్తాడు...దానితో ఆయన బాధ్యతా తీరిపోతుంది.

శేఖ : అంతకంటే ఎవరుమటుకు ఏం చేయగలరు?

మధు : మరి రేపటినుంచి నా గతి?...నా బ్రతుకు యింక ఎల్లా వెళ్ళిమారుతుంది?...యింకా ఎన్నాళ్ళో నేను బ్రతుకుతాను..యిన్నాళ్ళూ ఎవరిమీదో ప్రతిదానికీ ఆధారపడాలా!... ఇవన్నీ తలచుకుంటే నా గుండె లవిసిపోతు న్నాయి ... కాని అందరూ ధైర్యంగా వుండాలని చెపుతారు...ఆత్మ ధైర్యమూ, జీవితసంగ్రామమూ యీ చవట కబుర్లు నన్నెలా పూరడిస్తాయి?

నిర్మల : రోజులు గడవక అల్లాగే ఉంటాయా?.... మనకి దారి కన్పించనే కన్పించదా?

మధు : దారా!...యింకా నాకే దారి కన్పిస్తుంది.

నిర్మల : అల్లా అనకండి!...మీరు కావల్సినవాళ్లు మిమ్మల్ని ప్రేమించేవాళ్లు వున్నంతకాలము మీ కేలోటు జరగదు.

మధు : ఉన్నారు ... నువ్వు, శేఖరం...నా బెంగ అది కాదు...రేపటినుంచీ మన సంసారం ఎల్లా గడుస్తుంది? నా కిచ్చే నష్టపరిహారం ఎన్నాళ్లు వస్తుంది?

శేఖ : (మృదువుగా) ఆ విషయంలో బెంగ ఎందుకు చెప్పు? నేను పరాయివాడిని కాను. నా సంపాదనవల్ల మన మూడుపొట్టలూ గడవకపోతాయా?

మధు : (దెబ్బతిన్నట్టు) నీమీద ఆధారపడమనా?

శేఖ : ఏం! ఆమాత్రం అర్హత నాకు లేదా?...

మధు : కాని...జీవితమంతా నీమీద ఆధారపడి వుండమనా?...అయినా నువ్వు రేపు పెళ్ళి చేసుకుంటే?

శేఖ : నేనా!... పెళ్లా?...యీ విషయంలో నీ కింకా నాగురించి అనుమానముందా?...

మధు : పోనీ అనుమానం కాదే అనుకో! ... యీ భారం నువ్వు వహించడానికి ఏమీ బాధ పడవే అనుకో!...కాని చూసేవాళ్ళకి ఎల్లా వుంటుంది?

శేఖ : ఎవరో ఏదో అనుకుంటారని మనం భయ పడినట్లయితే అసలు నేను నీయింట్లో వుండ గలిగేవాడినా?...ఆలోచించుకో!....నువ్వు ఎల్లాగూ వకరిమీద ఆధారపడాలి!...ఆ అవ కాశము నాకు ఎందుకివ్వకూడదూ?...

మధు : వీల్లేదు! నువ్వు అభివృద్ధిలోకి రావల్సిన వాడివి. జీవితమంతా నేను నీమెడకు గుది బండగా వుండలేను—అసంభవం!

నిర్మల : దీన్ని గురించి యింత తర్కం దేనికి?... శేఖర్! మీ ఆఫీసులో లేడీ టైపిస్టు పోస్టుకి నేను ఎందుకు అప్లికేషన్ పెట్టకూడదూ?

శేఖ : (సంతోషంతో) సమయానికి గుర్తుచేశావు నిర్మలా! మధూ! అవసరమయితే స్త్రీ వుద్యోగం చేయవల్సిందే అన్నావుగదూ!

మధు :(ఒక్కసారి వులిక్కిపడి) అందుకని యిప్పుడు నా కామాట అప్పచెపుతున్నారా?....

శేఖ : లేదు. అవసరం వచ్చింది కనుక గుర్తు చేస్తున్నాను.

నిర్మల : నేను వుద్యోగం చేయడానికి అభ్యంతర మేమిటి చెప్పండి.

మధు : (నిట్టూరుస్తూ) నా అభ్యంతరం ? ... ఆ అశక్తత యీ గ్రహపాటుతోనే అంతరించింది ...నేనేం బ్రతుకు?...చివరికి భార్య సంపాదిస్తే కాని గతిలేని జన్మ.

నిర్మల : ఎందుకు బాధపడతారు?...(అనునయంగా) యిందులో మీరు న్యూనత పడడానికేముంది ? ... మీరు సుఖంగావుండడమే పెన్నిధిగా మీరే నా జీవితపు వెలుగుగా ఎల్లప్పుడూ భావించుకుంటున్నాను. నామీద ఆధారపడితే అవమానం ఏముంది చెప్పండి....

మధు : పోనీ అల్లాగే అనుకుందాం ! ... నువ్వు నీ ఉద్యోగానికి పోతే నా గతి ఏమిటి ?.... నీ రాకకోసం యీ గుడ్డివాడ ఎదురుచూస్తూ వుండాలన్నమాట...అదేగా నీ ఉద్దేశం?...

నిర్మల : (ఆలోచించి) ఇంట్లో వున్నంత కాలం నేను మీకేమీ లోటురానివ్వను ... నేను బయటికి వెళ్ళినప్పుడు మీ కాసరాగా వుండడానికి ఓ నౌకరుకుర్రవాణ్ణి పెట్టుకుందాము.

: అసలు యీ వుద్దేశ్యం నీకు నచ్చితే అవసరమయిన ఏర్పాట్లు చేసుకోవచ్చు. మధూ!... అసలు నీ అభ్యంతర మేమిటి?

మధు : (విసుగ్గా) అభ్యంతర మేం లేదయ్యా! మహానుభావా! చివరికి నీ పట్టే నెగ్గిందిగా! (వెంటనే తగ్గిపోయి) నిర్మలా! ఆలోచించేందు కేముంది? సరే అలాగే కానియ్యండి ...అప్లికేషన్ పడేయించు.

శేఖ : (రిస్టువాచివంక చూసుకుని) అబ్బా ఎనిమిదింబావయింది మధూ ! బజారునుంచి నీకేదయినా తీసుకురమ్మంటావా?

మధు : నాకా!...ఏం తెస్తావ్? నా సంగతికేం? మీకు తిండితిప్పలు అక్కర్లేదా!...మీరు వెళ్ళిరండి...

నిర్మల : నాకేం అక్కర్లేదు. తిండి తినడంలాగానే వుంది రోజు.

మధు : అల్లా అంటే ఎలా? యిక నీవు బాగుంటేనే నేను బాగుండేది. ఇక నీవు అన్నం తింటేనే నేను తినడం.

: ఇప్పుడింక వంటాగింటా ఏమిటి ? కారియరు తెస్తాను ? మధూ ! డాక్టర్లు ఏం తీసుకోమన్నారు? వచ్చేటప్పుడు తెస్తాను.

మధు : కొంచెం టెంపరేచరు వుంది...కావల్సింది హాస్పిటల్ వాళ్ళే యిస్తారు. పోనీ ఒకటి రెండు బత్తాయిపళ్ళు తెచ్చిపెట్టు...తిరిగి వచ్చాక నువ్వూ నిర్మలా కలసి వెళ్దురుగాని.

: అల్లాగే వస్తా!...(వెళ్తాడు).

మధు :నిర్మలా!...నేనేమయినా కటువుగా మాట్లాడానా?...నే నన్న మాటలు మీ కెవరికయినా కష్టం కల్గించాయా?...

నిర్మల : ఇందులో కష్టానికేముంది? ... యిందులో మీ మనసు ఎవరికి తెలియదు?

మధు : నిద్రపడితే బాగుండును."రిప్ వానువింకిల్" ఇరవై ఏళ్ళు నిద్రపోయాడుట. అటువంటి నిద్ర నాకూ పడితే ఎంత బాగుండును ?... ఇప్పుడు నిద్రపోయినా రేపు మళ్లీ లేవాలి ! కాలం ఎల్లా గడుస్తుంది ? ...కళ్లు మూసుకుంటే ఒక్క క్షణం ఒక్క యుగంగా గడచి వెంటనే కళ్లు తెరిచివేస్తామే ?... యిప్పుడు ఒక్క నిమిషం కాదు ఒక్క గంట కాదు...ఎన్నో సంవత్సరాలు గడవాలి ! ఎల్లా ?...

నిర్మల : (ఏం మాట్లాడాలో తెలియక) అలవాటు పడిపోతారి జీవితానికి నెమ్మదిగా.

మధు : అలవాటు ! ... చేసేందుకు పనివుండదు... మనసులో జరిగేవి జరిగినవి వూహించు

కుంటూ కాలం గడపడం. అంతే! ... (వున్నట్టుండి ఏదో గుర్తుకు వచ్చినట్లు) అయితే నిర్మలా నన్నిదివరకులా ప్రేమించ గలవా ?...

నిర్మల : (దెబ్బతిన్నదానిలా) అదేమిటి అల్లా అడుగుతారు ?

మధు : కాదు నిర్మలా!...నేనా గ్రుడ్డివాడిని ... దేనికీ కొరగానివాడిని ... నీ కానందం చేకూర్చలేను...ప్రతిదానికీ నీమీద ఆధార పడి నిన్ను పీడించాలి.

నిర్మల : (గాద్గదికంగా) మీకో దణ్ణం పెడతాను. అటువంటిమాట లనకండి!...

మధు : కాదులే నిర్మలా!... అప్రయోజకుడయిన భర్తని ఏ ఆడది గౌరవిస్తుంది?...

నిర్మల : నేనూ అందరిలాంటిదాన్నేనా ?... మీ మనసు నాకు తెలుసు. నేను ప్రేమించేది పూజించేది...మీ రూపాన్ని, మీ పుర్వ్య గాన్నీ కాదు! మీ హృదయాన్ని...

మధు : (తృప్తిగా) అది నాకు తెలుసు నిర్మలా!... నువ్వు నా భార్యవి కావడమే జీవితంలో నేను చేసుకున్న మహా అదృష్టం. పాపం మీ బావ శేఖరాన్ని చూడు ... అతనూ నేనంటే ఎంత అభిమానం చూపిస్తున్నాడో ...మీ ఇద్దరి ఋణం నే నెల్లా తీర్చుకో గలనో?...

నిర్మల : కాసేపు నిద్రపోకూడదూ?...

మధు : నిద్రపోవడానికి తొందరేం వచ్చిందిలే?... ఇవాళ మనం సినిమాకి వెళ్దా మనుకు న్నాము కాదూ!....

నిర్మల : ఆ!...యిక ఒక్కటే సినిమా!...

మధు : లేని అదృష్టము నా కెలాగూ లేదు...ఇక్కడ నువ్వుకాని శేఖరంకాని చేసే పనేముంది. చాలా మంచి పిక్చరు...పోనీ మీ రిద్దరూ వెళ్ళకూడదూ?

నిర్మల (పరిహాసమో సత్యమో తెలియక) ఇప్పుడు సినిమాలే తక్కువయినాయి. మిమ్మల్ని యిలా వదిలేసి సినిమాలకే వెళ్లాలి...

మధు ఎందుకు వెళ్లకూడదూ?... నే నెల్లాగూ సుఖపడను?...ఆనందరేఖ అనేది యిక నా జీవితములో నే లేదు. అల్లా అని నీ ఆనం దాని కడ్డునిలవడము న్యాయం కాదూ? నేను సర్వదా వాంఛించేది నీ సౌఖ్యమే నిర్మలా!

నిర్మల అదే అయితే దయవుంచి ఇక మీ రేమీ మాట్లాడకండి.

[శేఖరం ప్రవేశిస్తాడు. కేరియరు క్రింద పెట్టి బత్తాయిపళ్లు కప్‌బోర్డుమీద పెట్టి పక్కన కూర్చుంటాడు.]

శేఖ పళ్లు యీ కప్‌బోర్డుమీద పెట్టాను. ఇప్పుడు తీసుకుంటావా మధూ!

మధు రాత్రి తీసుకుంటాను...సరే యిప్పటికే పొద్దుపోయినట్టుంది. ఇవాళ

శేఖ ఫోంచేసివస్తాను మధూ! రాత్రి సికేమయినా అవసరముంటుందేమో!

మధు మళ్ళీ రావడం దేనికి!...అక్కడ నిర్మల ఒక్కతే వుండదూ?

నిర్మల : పోనీ నేను వస్తాను. అతను వచ్చి దింపు తాడు మళ్ళీ నన్నిక్కడ.

మధు : అనవసరం. సరే మీ యిష్టం...

శేఖ అయితే వస్తాను ...

నిర్మల మనసు బెంగ పెట్టుకోకండి!...

మధు శేఖర్!...(శేఖర్ వెనక్కి తిరిగి ఏమిటి అంటాడు.)

మధు : రేపే నిర్మల అప్లికేషన్ తీసుకు రమ్మ... మరి ఎవరయినా పనికుర్రవాడిని చూడు.

శేఖ : తప్పకుండా!...

## మూడవ రంగము

** నిర్మల ఫ్లాస్కులో హార్లిక్సు పోసి బల్లమీద పెడుతుంది. శేఖరం ప్రవేశం:

శేఖ : నిర్మలా! నిర్మలా!..... యింకా వంట కాలేదూ? ఆఫీసుకి టైమవుతోంది.

నిర్మల ఎంత! అయిదు నిమిషాలు! ఆయన స్నానం చేస్తున్నారు. అందరమూ కలిసే భోజనం చేయవచ్చు.

శేఖ ఏం!...అంత బడలికగా వున్నావు...... అంతా రెండో ఆట సినిమామూలానే!

నిర్మల రాను రానంటే బలవంత పెట్టి తీసుకువెళ్లావు! ఎందుకు వచ్చిన సినిమాలు?...

శేఖ ఏం!...సినిమా చాలా బాగుందే!...

నిర్మల సినిమా బాగోగుల గురించి కాదు నేను చెప్పేది...(తమాయించుకుని) ఎందుకులే!

శేఖ (ప్రశ్నార్థకంగా) అయితే!...మరి?... అతను ఏదయినా అన్నాడేం. అతనేగా వెళ్ళమంది!...

నిర్మల వెళ్లొద్దని ఆయన అనలేదు......అనలేరు కూడాను. కాని వెళ్ళినందుకు బాధపడతారు! అంటే మనం చూసినందుకు కాదు. తను చూడలేనందుకు!...

శేఖ దానికి నువ్వేం చేయగలవు? నిన్న ఏమన్నాడేమిటి?

నిర్మల (నెమ్మదిగా) నిన్న మనం వచ్చిందాకా ఆయన నిద్రపోలేదు. ఏమని అడిగితే నీకేం? హాయిగా సినిమాలకీ నాటకాలకీ వెళ్తావు... యీ నల్లుల మంచంమీద నిద్రపట్టక చస్తున్నాను. ఏదయినా చదువుకుందామన్నా గుడ్డివాడినయిపోయానన్నారు.

శేఖ : అయినా యీమధ్య అతనిలో వూహించలేని మార్పులు వస్తున్నాయి.

నిర్మల అందులో ఆశ్చర్యపడడానికేముంది?... పాపం ఆయన సినిమాలు నవలలు లేనిదే ప్రపంచమే లేదనుకునేవారు.

శేఖ దానికి నువ్వేం చేస్తావు?...అయినా నీకు కోపమువస్తే వచ్చింది...యీమధ్య అతను చాలా మొరటుగా ప్రవర్తిస్తున్నాడు... అతనికోసం నువ్వెంత శ్రమపడుతున్నావు.. అది తెలుసుకున్నాడా!...ఎప్పుడూ సతాయించడం...రెండురోజులు నువ్వు లేకపోతే అతనికి తెలిసి వస్తుంది.

నిర్మల : ఆయన్నీ, ఆయన హృదయవేదననీ నువ్వు అర్థం చేసుకోలేవులే!...

[లోపల దబ్బున మనిషి పడిన చప్పుడు.]

నిర్మల : (ఆతురతగా) అయ్యో పడిపోయినట్టున్నారు. (లోపలికి పరుగెడుతుంది.... శేఖరం వెనకాలే వెళ్తాడు...ఒక్క క్షణము రంగం మీద ఎవరూ వుండరు.)

[నిర్మల మధుసూదనరావుని చెయ్యి పుచ్చుకుని తీసుకువస్తుంది. వెనకాలే శేఖరం వస్తాడు...మధుసూదనరావు తువ్వాలు కట్టుకుని వుంటాడు. మొగమంతా కాలిన మచ్చలు...జుత్తు తలమీద స్నానము చేసి తుడుచుకోవడమువల్ల రేగివుంటుంది. చలికి వణుకుతూ వుంటాడు.]

నిర్మల : ఇంతలో ఎందుకింత తొందర చెప్పండి!.. నన్ను పిలవలేకపోయారా?...

శేఖ : దెబ్బతగిలిందేమో చూడు...

మధు : (వికృతహాసం చేస్తూ) తగిలే దెబ్బ యిదివరకే తగిలింది...దానిముందు యిదొక లెఖ్ఖా!...

: (నొచ్చుకుంటూ) నేను చచ్చిపోయాననుకున్నారా! నన్నెందుకు పిలవకూడదూ?

మధు (మ్లాన వదనంతో) ఎన్నాళ్లని పిలిచేది? యింట్లో అయినా నడక అలవాటు చేసుకోపోతే ఎల్లా? (కంఠములో కఠినత్వము తెచ్చుకుని) అయినా పిలిచాను.

నిర్మల (ఆశ్చర్యముగా) పిలిచారా మీరు?

: మరి ఎవరికీ విన్పించలేదే?...

మధు (కోపముగా) అంటే నేను అబద్ధమాడాననా నీ ఉద్దేశ్యం? మీ కబుర్ల ప్రవాహంలో యీ గుడ్డాడి మాటలెల్లా వినిపిస్తాయి!

నిర్మల : ఎంత దారుణంగా మాట్లాడుతున్నారు?

మధు : (కసిగా) నిజం ఎప్పుడూ దారుణంగానే ఉంటుంది!

నిర్మల : (ఎంతో బాధగా అరుస్తూ) అబ్బా!... (వెంటనే తగ్గిపోయి) సరే ఎన్నయినా అనండి పడతాను...ముందు బట్టలు మార్చుకు

రండి...చలికి వణకి పోతున్నారు. (అని చెయ్యిపట్టుకుని లోపలికి తీసుకు వెళ్తుంది. శేఖరం అటూ యిటూ విసురుగా తిరుగుతాడు ...నిర్మల మధుసూధనరావుని విడిచి శేఖరం దగ్గరికి వస్తుంది...)

శేఖ : (నెమ్మదిగా) ఏమిటిదంతా!...

నిర్మల : (నెమ్మదిగా) అంతా కర్మ...

శేఖ : (నెమ్మదిగా) యింతకీ నిజంగా పిలిచాడా?

నిర్మల : (నెమ్మదిగా) ఏమో! మరి ... విన్పించలేదు ... అయినా యింకో సారి పిలవకూడదూ ?...పిలిచి వినపడితే రానా ?... ఎందుకు నన్నిల్లా బాధపెట్టటం ?...పిచ్చి భయాలతో ఊహలతో ఆయన హైరానా పడ్తున్నారు. నన్ను హైరాన పెడ్తున్నారు.

శేఖ : చూస్తూ పూరుకోవల్సిందే! అంతకంటే ఏం చెయ్యను? సరే ఇప్పుడే వస్తాను (బయటికి నడుస్తాడు).

నిర్మల : బట్టలుమార్చుకున్నారా, అయితే వస్తున్నా (వెళ్లి అతన్ని తీసుకువచ్చి పడక కుర్చీలో కూర్చోబెడుతుంది. పక్కకి తను కూర్చుని మొగముపైన తల పెట్టి) ఏమండీ దెబ్బ ఎక్కడ తగిలింది ? ... చూడనివ్వండి మోపుగా తగిలిందేమొ?

మధు : (నిర్మల జుత్తు నిమురుతూ ఎంతో ప్రేమగా) పెద్ద దెబ్బేం తగలలేదు నిర్మలా!...ఎందుకంత ఆత్రము! ..దీంతోనే నా ప్రాణం పోదుగా !....పిచ్చి నిర్మలా !...ఎందుకు నన్నింత ప్రేమిస్తావు!...అయితే నీ కాఫీసుకి టైము కాలేదూ?

నిర్మల : అవుతోంది. అతనూ తొందరపడ్తున్నారు. ముగ్గురం కలసి భోజనం చేద్దామా?

మధు : ముగ్గురమా!...(కంఠములో మార్దవముండా పోతుంది) వద్దు. మీరిద్దరూ భోంచెయ్యండి ......అయినా తొమ్మిదిన్నర కాకుండా అప్పుడే భోజనమేమిటి?

నిర్మల : అవుననుకోండి! కాని ఆనక ఎవరు వస్తారు?

మధు : ఏం? గోపీని ఎందుకు పెట్టుకున్నాము?... నా పని చూడ్డానికేగా!......నా యిష్టము వచ్చినప్పుడు పెట్టించుకు తింటాను.

నిర్మల : వాడు కుర్రవాడు. వాడి కెందుకు శ్రమ చెప్పండి?

మధు : ఏం? అంతా నీ యిష్టమేనా?......డబ్బు సంపాదిస్తున్నంతమాత్రాన నీ మాట వింటాననుకున్నావు కాబోలు?

నిర్మల : (అతి బాధగా) ఎందుకు నన్నిలా హింసిస్తున్నారు? పోనీ మీ యిష్టప్రకారమే కానివ్వండి.

మధు : (తగ్గి) నేనన్న మాటలకి బాధపడ్తున్నావా? అదికాదు నా వుద్దేశ్యం. (జాలిగా) నిర్మలా నన్నర్థం చేసుకోవూ?... (వున్నట్టుండి) యీ పూట ఆఫీసుకి సెలవు పెట్టలేవూ?...

: అల్లాగే— ఎందుకో చెప్పండి!

మధు : వద్దులే నిర్మలా!...వక్క పూటతో ఏమవుతుంది? నన్ను విడిచి నీవొక్క క్షణమున్నా సహించలేకుండా ఉన్నాను. నా కర్మానికి నువ్వేం చేస్తావు?

నిర్మల : మీకోసము ఏమయినా చేస్తాను. కావాలంటే యీ వుద్యోగాన్నయినా వదులుకుంటాను! ...కాని ముందు గతి?

మధు : అవును నిర్మలా!...వుద్యోగం ఎల్లా మానుకుంటావు ? (ఆగి) నిర్మలా ! (చేత్తో చెంపలు తడిమి ముఖం అందుకుని పైకి ఎత్తుతాడు.)

నిర్మల : ఏమిటి?...

మధు : ఒకప్పుడు ... యీ విధంగా నీ ప్రకాశవంతమయిన కళ్ళలోకి చూస్తూ సర్వం మరిచిపోయేవాడిని....యిక నీ కళ్ళలి చూడలేను...నీ చిరునవ్వులు చూడాలని ఎంత వుబలాటమున్నా ఏం చెయ్యగలను ?... తలుచుకున్నకొద్దీ బాధ నిర్మలా !...నా జ్ఞాపకశక్తి నశించి పోకూడదూ?...

నిర్మల : అల్లా బాధపడి ఏం ప్రయోజనం? వున్నంతలో సంతోషంగా వుండకపోతే ఎల్లా చెప్పండి?...

మధు : (బాధగా) సంతోషం!...ఇక నా జన్మలో లేదు! ఎందుకు వచ్చిన బ్రతుకు? నేను సుఖపడలేను! ... మిమ్మల్ని సుఖపెట్టలేను...

(ఏదో గుర్తుకు వచ్చినట్లు) నిర్మలా! నాలో చాలా మార్పు వచ్చిందనుకుంటున్నావు కాదూ! ... నేను చాలా అసహ్యంగా మాట్లాడుతున్నానని నాకు తెలుసు నిర్మలా! కాని ఏం చేయను?...నాలో పెల్లుబికే అసంతృప్తిని ఏదో విధంగా యింకొకరి మీద కక్కేస్తే కొంత తృప్తి! .. తర్వాత బాధపడ్తాను, ఏం లాభం ?..కష్టపడ్డ మనసు బాగుపడుతుందా?... నన్నర్థం చేసుకోవూ?...

నిర్మల : మిమ్మల్ని అర్థం చేసుకోవాలనే నా తాప త్రయం. పోనివ్వండి... ఒక విషయం అడుగుతాను మర్మం విడచి చెపుతారా!

మధు : తప్పకుండా!...ఏమిటది?

శేఖర్ అంటే మండిపడ్తున్నారు! కారణ మేమిటి?

మధు : యిదమిద్ధంగా చెప్పలేను.

నిర్మల : (బాధగా)...నా భయం మా యిద్దరిమీదా మీకేదయినా అనుమానముందా అని?

మధు : నేననే మాటలకి అల్లా అర్థము చేసుకుంటు న్నారా? మీ యిద్దరిమీదా నాకే అను మానం లేదు...ఏదో అన్న మాటలకి బాధ పడకు?...నాలో మార్పుకి నేను చెప్పిందే కారణము.

నిర్మల అమ్మయ్య! గుండెల్లో రగులుతున్న మంట చల్లారింది.

[శేఖరం ప్రవేశిస్తాడు.]

శేఖ : నిర్మలా!...యింకా ఏమిటే ఆలస్యము.

నిర్మల : నీదే ఆలస్యం! మధువంక తిరిగి ఏమండీ మీరూ రాకూడదూ?

మధు : సరలే! నేనూ వస్తాను!

శేఖ : నిర్మలా! విన్నావా !...మన మేనేజరు కూతురు పెళ్లిట చాలా హడావుడిగా చేస్తా డుట. డాన్సులు, పాటకచేరీలు, ఓ!...ఒక టేమిటి అన్నీనూ! మనందరికీ '(గాండు డిన్నర్'.

నిర్మల : (ఈ ప్రసంగముపై అయిష్టత వ్యక్త పరుస్తూ) ఎప్పుడో సంగతి యిప్పుడు జేనికి? : ఎప్పుడో అంటా వేమిటి? ఇంకా పదిహేను రోజులేగా! 'రిసెప్షన్లో' నువ్వూ నేనూ సహాయం చెయ్యాలని మేనేజరు నిన్న చెప్పలేదూ!

నిర్మల : (అసహనంగా) కానేపు పూరుకుందూ! ముందు భోజనానికి లే!...మీరు రండి!

మధు : నేను ఆనక్కే తింటా లే!

నిర్మల : (తెల్లబోయి) అదేమిటి అల్లా అంటారు?... యిప్పుడేగా లేస్తానన్నారు?

మధు : అంటే అంటాను!...ఇప్పుడు అభిప్రాయం మార్చుకున్నాను. ఈ యింట్లో నాకు సర్వ స్వాతంత్ర్యం వుంది. నువ్వు నా విషయ ములో మరేమీ బాధపడనక్కర్లేదు.

నిర్మల : సరే యిక మీ యిష్టం! ... ఫ్లాస్కులో హార్లిక్సు పోసి వుంచాను. బిస్కెట్లడబ్బా పళ్లూ అలమారులో వున్నాయి...యిప్పుడే గోపీ వస్తాడు...మీకేం కావాలన్నా గోపీ నడగండి !

మధు : అది నువ్వు చెప్పనక్కర్లేదు ... ఆ సంగతి నాకూ తెలుసు. నీ బాధ్యత తీరింది. ఇక నిరభ్యంతరంగా నిర్విచారముగా ఆఫీసుకి దయచెయ్యవచ్చు ... వెళ్లండి! మీరూ! మేనేజరూ!....ఆయన యింట్లో పెళ్లి. మీ ఎంగేజిమెంట్సు, ఎంటరుటైనుమెంట్సు... పొండి ... నా బ్రతుకు నన్ను బ్రతక నివ్వండి...

## నాలుగవ రంగము

* * పడకగది ... మంచంమీద మధు సూదనరావు పడుకుని వుంటాడు... ఆ మంచానికి రెండుగజాల దూరం లో నౌకరు కుర్రవాడు గోపీ చాప మీద పడుకునివుంటాడు. మంచానికి చాప మధ్య చిన్న స్టూలు వుంటుంది ... దానిమీద విప్పిన బిస్కెట్ల పొట్లం, బత్తాయి తొనలూ వుంటాయి...మంచానికి

మరో పక్క కిటికీ ఉంటుంది. అందులో ఫ్లాస్కు ఉంటుంది. కిటికీ ప్రక్క చిలక్కొయ్యకి బట్టలు వేళ్లాడుతూ వుంటాయి. దీపం వెలుగుతూ వుంటుంది.

మధు గోపీ!...గోపీ!...వెధవ! నిద్రపోతున్నావు కాబోలు!...అవును నిద్రపోవద్దని చెప్పడానికి నాకేం హక్కుందని?...నెల కింత జీతమిస్తున్నంత మాత్రాన్న, వేళకి అన్నం తినవద్దని నిద్రపోవద్దని ఎల్లా చెప్పగలను?....వాళ్లిద్దరూ మేనేజరు ఇంట్లో డాన్సులకి డిన్నరులకీ పోయారు. వీడేమో గొడ్డులా నిద్రపోతున్నాడు...మధ్య నా గతేం కావాలి? (బిగ్గరగా విసుగ్గా) ఒరే గోపీ!

గోపీ (వులిక్కిపడి లేచి) పిలిచారా అయ్యగారూ!

మధు టైమెంతయిందిరా?

గోపీ (బయటికి వెళ్లి తొంగిచూసి వచ్చి) తొమ్మిది దాటిందయ్యా!

మధు ఒరే వీళ్లింకా రాలేదుగా!

గోపీ వచ్చేటప్పటికి ఆలస్యమవుతుంది యివ్వాళ్టికి కిక్కడే పండుకోమన్నారు కదండీ అమ్మగారు!

మధు అంటారు! ఎందుకనరూ?...ఆలస్యం అవుతుంది! ఎందుకవదూ!...నా సంగతి ఎవరికి కావాలి?

గోపీ (ఏం జవాబు యివ్వాలో తెలియక) అమ్మగారిని పిలుచుకురమ్మంటారా?

మధు ఎక్కడికి వెళ్ళి పిలుచుకు వస్తావు? అమ్మగారూ వద్దూ అయ్యగారూ వద్దు.

[బయట తలుపు తట్టిన చప్పుడు]

మధు : ఒరే గోపీ! తలుపు తీసిరా! వాళ్లు వచ్చారేమో! గోపీ వెళ్లి మూర్తితో ప్రవేశిస్తాడు.

మూర్తి : నేనేనండి!...మూర్తిని. ఎల్లా వుంటున్నారు?

మధు : వుంటున్నా...చావు రాకుండా బ్రతుకు కాకుండా! ఒరే గోపీ కుర్చీ తెచ్చివెయ్యి కూర్చుంటారు.

మూర్తి : అక్కర్లే ఎందుకండీ! వెళ్లిపోతాను. శేఖరం ఏడీ?...నిర్మల ఏదీ?...వాళ్ల కబుర్లతో ఎప్పుడూ సందడిగా వుండేది.

మధు వాళ్ళు ఆఫీసు మేనేజరు యింట్లో పార్టీట. వెళ్లారు...యింతకీ ఎందుకు వచ్చారో... (గోపీ కుర్చీ తెచ్చి వేస్తాడు.)

మూర్తి వెళ్ళికి వెళ్లారా! అప్పుడే అనుకున్నా యిల్లు యింత నిశ్శబ్దంగా వుందేమా అని. మీరిం[illegible]క్కడే. వారేమో అక్కడే బాగుంది. (అని కూర్చుంటాడు.)

మధు (అసహనంగా) ఇంతకీ ఎందుకు వచ్చారు?

మూర్తి వేరే పనేముందండి! మొన్న యిక్కడనుంచి అగథా క్రిస్టీ నవల తీసుకువెళ్ళా, అది యిచ్చిపోదామని వచ్చాను. (జేబులోంచి పుస్తకం తీసి గోపీకి యిచ్చి) గోపీ...యిది జాగ్రత్తగా శేఖరంగారికి అప్పచెప్పు. లేకపోతే ఎందుకు వచ్చిన పేచీ! (నవ్వుతూ) యీమధ్య నేను పుస్తకాలు వెంటనే యిస్తున్నానండీ!

మధు నవల ఎల్లా వుంది?...

మూర్తి అహా! ఏం నవలండి!...ఏమి సస్పెన్స్... మొదలెట్టిన తర్వాత పూర్తి చెయ్యనిదే నిద్రపోనివ్వదండి...మొన్న రాత్రి నేను పూర్తి చేసి పడుకునేటప్పటికి రెండున్నరయిందనుకోండి...మీరూ ఆ నవల చదవండండీ!

మధు నన్నవమానం చేస్తున్నారా మూర్తిగారూ?...

మూర్తి (నాలిక కరుచుకుని) అదికాదు నా ఉద్దేశ్యం...చిన్నగా చదవగాను కాని శేఖర్ బాబుగారు చదివి వినిపించారేమోనని...

మధు లేదు...వాళ్లు చదివినా...నాకు వినిపించాలని ఎక్కడుంది?.. [illegible] కనుక వాళ్ళని నవలలు చదివి [illegible] పుడితే చదివి వినిపిస్తారు. లేకపోతే లేదు. అసలు అగథా క్రిస్టీ అంటే నాకు ప్రాణం.

మూర్తి : తప్పక చదివి వినిపించమనండి...ఆ నవలని వదలకూడదు ... బల్లమీద పెట్టింది వుంది...తీసుకు వెళ్తుంటారా?...

మధు : ఇంకేవరూ చదివినట్టు లేదు...

మూర్తి : వెంటనే అన్నీ ఇచ్చేస్తున్నాను కదండీ!...

మధు : సరే మీ యిష్టం. గోపీ బల్లమీద ఫిల్మిండియా వుంటుంది .... తెచ్చి వీరికియ్యి ... (గోపీ పత్రిక తెచ్చి మూర్తికిస్తాడు).

మూర్తి : మరి నే వెళ్తానండీ!...యివాళ శాంతారామ్ పిక్చరు రిలీజయింది ... వెళ్ళాలి ... శాంతారాము అంటే నేను పడిచస్తాను.

మధు : శాంతారాము క్రొత్త పిక్చరు రిలీజయిందా! ...ఎవరూ చెప్పలేదే!...అసలు చెప్ప వలసిన అవసరమేముంది? నేను బ్రతికున్న రోజులలో శాంతారాము పిక్చరంటే తప్ప కుండా మొదటిరోజునే వెళ్ళేవాడిని... ఇప్పుడు నేను చూడలేను... చూసినా చూసే యోగ్యత కలుగుతుంది...

మూర్తి అట్లాగే వుంటుంది! అందులో యీ పిక్చర్ శాంతారామ్ ప్రెస్టేజ్ పిక్చరట. వస్తానండీ! (వెళ్తాడు).

మధు (తనలో బిగ్గరగానే) కళ్ళున్న వాళ్ళకి డాన్సులు, సినిమాలు, నాటకాలు నవలలు.. నా సంగతి ఎవరికి కావాలి? గోపీ! వెళ్ళి తలుపు వేసిరా! నౌకరసానిగా చెప్పాను దిక తాగో...

గోపీ బాబూ అమ్మగారు రెప్పుడు వస్తారో.... భోం చేస్తారా?...

మధు ఏం అక్కర్లేదు!...ఆకలి లేదు ... బయట మాదాకవళంవాడు అరుస్తున్నట్టున్నాడు... వాడికి పెట్టేయి!

గోపీ అదేమిటి అట్లా అంటారు?...

మధు నువ్వుకూడా ఎదురు చెప్పేవాడివే!..ముందు నేను చెప్పినపని చెయ్యి...

గోపీ అమ్మగారు కేకలేస్తారండీ!...

మధు అమ్మగారెవర్రా గాడిదా! ... ముందర చెప్పినపని చెయ్యక! గోపీ వెళ్తాడు... (ఒక్క క్షణము నిశ్శబ్దము .. తలుపు చప్పుడు ...గోపీ వెళ్ళి తలుపు తీస్తాడు...నిర్మల శేఖరము ప్రవేశిస్తారు. మూర్తి గోడ వేపు తిరిగి పడుకుంటాడు.)

శేఖర్ : ఇవాళ ప్రోగ్రాం అంతా చాలా బాగా జరిగింది కదూ!

నిర్మల : (ముభావంగా) అవును. గోపీ! అయ్యగారు పడుకున్నారా?

గోపీ : లేదండీ!...ఇంతాకా మూర్తిగారున్నారు

నిర్మల : మూర్తిగారు వచ్చారా?

: బల్లమీద ఫిల్మిండియా కూడా లేదుగా!...

నిర్మల : గోపీ! అయ్యగారు భోం చేశారా?

: లేదండీ! అయ్యగారికి ఆకలి లేదంట. అన్నమంతా మాదాకవళంవాడికి పెట్టేయమన్నారు.

నిర్మల : (ఆశ్చర్యంగా) పెట్టేశావేమిట్రా?

[శేఖరం ముఖం చిట్లించుకుంటూ బట్టలు మార్చుకోవడానికి లోపలికి వెళ్తాడు]

గోపీ : (తప్పు చేసినవాడిలా) నేనేం చెయ్యను అమ్మగారూ? బాబుగారు కోప్పడుతుంటే...

మధు : గోడవైపునుంచి తిరిగి మంచంమీద కూర్చుని వాడినేమీ అనకు. నేనే పెట్టేయమన్నాను.

నిర్మల : విన్నాను!...ఎందుకని?

మధు : ఆకలి లేదు కనుక!...

నిర్మల : అవును నేను బ్రతికున్నంత కాలం మీ కాకలి వేయదు.

మధు (వెటకారంగా) అంతేలే! పోనీలే! మీ డ్యాన్సులు, పాటకచేరీల సలక్షణంగా జరిగాయికదా! అంతే చాలు!...పోనీ అక్కడనుంచి ఏ రెండో ఆట సినిమాకో... బీచి షికారుకో వెళ్తే బాగుండేదిగా!

నిర్మల : అంటే మీ వుద్దేశం?...మీయిష్టప్రకారమే వెళ్ళాను, వద్దంటే వెళ్ళేదాన్నా!

మధు : ఆ! నా మాటమీద గౌరవముండి ఏడ్చింది!.. ఏదయినా అంటే నేను సంపాదిస్తున్నాను.. నా యిష్టమంటావు...

నిర్మల : ఎప్పుడయినా అట్లా అన్నానా?...

మధు : ఆ అవకాశం నీ కిస్తేగా?...అయినా నీకు వెళ్ళాలని లేకపోయినా ... శేఖరాని కుంటుంది...పాపం అతనికి నువ్వు పక్కని లేందే తోచదు!

నిర్మల : ఎంత నీచంగా మాట్లాడుతున్నారు?...

మధు : నిజం ఎప్పుడయినా నీచంగానే వుంటుంది.

నిర్మల : (కోపంగా) ఏమిటండీ! ఆ నిజం తెలియక అడుగుతాను?...(తగ్గి) మనం నెమ్మదిగా మాట్లాడుకుందాము. అతను వింటే బాధ పడ్తాడు పాపం!

మధు : (రెచ్చిపోయి) పాపంట పాపం—అతనిమీద నీకెంత అభిమానం?...అందులో వెయ్యోవంతు అభిమానమయినా నామీద వుందా!.. (కసిగా) అవునులే నామీద నీ కెందుకుంటుంది? నేను ఎందుకూ కొరగానివాణ్ణి!.. అతనా వున్నాడు రూపవంతుడు. గుడ్డివాడి సనకాల మీ రిద్దరూ ఏం నాటకాలాడినా నువ్వు పతివ్రతవే!...

నిర్మల : (ఆవేశముతో తల బాదుకుంటూ) యింతకన్నా నన్నొక్కసారి చంపేయరాదూ!..

శేఖ : (విసురుగా వచ్చి) మధూ!...నీ కిట్లాంటి అభిప్రాయాలెన్నాళ్ళనుంచీ వున్నాయి?

మధు : (తెగబడి)... ఎన్నాళ్ళనుంచి ఏమిటోయి? అసలు నీ మనసు తెలిసింది! పయోముఖ విషకుంభం. నువ్వెందుకు పెళ్ళి చేసుకోలేదో నాకిప్పుడే తెలిసింది...

శేఖ : ఆ బాగా తెల్సిందిలే (పళ్ళు కొరుకుతాడు).

నిర్మల : శేఖర్ నువ్వైనా వూరుకోరాదూ!.. నువ్వు కూడా నన్ను బాధపెట్టాలా!...

మధు : నువ్వైనా వూరుకోరాదుట! ... అక్కడికి అతను మంచివాడు నేను చెడ్డవాడిని ... అహో...ఏం లయలు?...

శేఖ : మధుసూదనరావు ... నన్ను క్షమించు ... నీలో ఏ మూలయినా యిటువంటి అభిప్రాయాలున్నాయని తెలిస్తే నేను చాలా జాగ్రత్తపడేవాడిని...మీ దంపతులు అందరివంటి వారు కాదు అనుకుని నేను మీ స్నేహంకోసం యిక్కడ వుండిపోయాను.. సరేలే...యిప్పుడవన్నీ తవ్వుకుని ఏం లాభం!...సెలవు యిప్పించు నా దారిన నేను పోతాను...

నిర్మల : వెళ్ళిపోతావా! శేఖర్...

మధు : వెళ్ళనీ!...కావాలంటే అతనితో నువ్వూ వెళ్ళు....నువ్వు మాటుకు ఎన్నాళ్ళీ గుడ్డివాడితో వేగుతావు?...

శేఖ : పరిస్థితులు అర్థమయ్యాయి నిర్మలా!... యిక ఎల్లావుండను? ... నా మూలాన మీ కాపురం నాశనమవడం నా కిష్టం లేదు. నే నెప్పటికయినా మీ శ్రేయోభిలాషి నే- మధూ! పూర్వంనీవు నామీద చూపిన వాత్సల్యాన్ని మరచిపోను! ... నా దోషం ఏదయినా వుంటే క్షమించు .... నిర్మలా యిప్పుడే నేను వెళ్ళిపోతాను ... సెలవు యిప్పించు...దయవుంచి రేపు ఎవరిచేతనయినా నా సామాను పంపించు...

నిర్మల వెళ్ళు శేఖర్!... నిన్ను అడ్డుపెట్టను!... నే నెందుకు బ్రతికివున్నాను (దుఃఖం చెరుల్లో కప్పుకుని ఏడుస్తుంది శేఖరం ఆమెని సముదాయించాలని ముందుకువచ్చి ఆమె చేతులు తీయబోతాడు...కాని వెంటనే వెనక్కి తగ్గి ఒక్క నిట్టూర్పు విడిచి ఒక్క అంగలో బయటికి నడిచిపోతాడు).

మధు : ఇక చాల్లే ఆపు ఆ ఏడుపు...

నిర్మల ఏడుస్తాను...యింకా ఏడుస్తాను ... ఎంత ఏడుస్తే అంత మీ కళ్ళు చల్లబడతాయి.

మధు : (అతి బాధగా) నాక బాగా వుంటే ఇన్ని తిప్పలు వుండేవి కావు

నిర్మల (ఏడుస్తూనే వుంటుంది)

మధు (ఆలోచనగా) ఒక మహా ప్రవాహంలో కొట్టుకు పోతున్నాను. యీ ప్రవాహవేగాన్ని ఆవేశశక్తి నాలో ఎప్పుడో నశించి పోయింది. చివరికి ఎక్కడ తేలుతానో... (చిరాగ్గా) అబ్బా!...యింకా ఏడు... బాగా ఏడు...ఎంతఏడిస్తే అంత మంచిది... "హాహాహాహా"అని వికటాట్టహాసం చేస్తాడు.

## అయిదవ రంగము

* * అంతా నాల్గవ రంగంలోలాగానే వుంటుంది. టైము ఎనిమిది అవు

తుంది. మధుసూదనరావు మంచం మీద పడుకునివుంటాడు. గోపీ అదే చాపమీద కూర్చుని ఏదో తెలుగుసినిమా పత్రిక తిరగవేస్తుంటాడు. మధ్య స్టూలు మామూలుగానే వుంటుంది

మధు గోపీ!...

గోపీ ఏం! అయ్యగారు!

మధు ఆకలిగా వుందిరా! ఇక్కడ ఏమయినా వున్నాయా....

గోపీ : నిన్న సాయంత్రం ఆర్లిక్సు, బిస్కెట్ల డబ్బా పళ్ళూ తెప్పించారండి అమ్మగారు. ఏం యిమ్మంటారండీ!

మధు ఇవన్నీ తెప్పించిందిట్రా...ఎంత అభిమానంరా దానికి నేనంటే. ఒరే రెండు బిస్కెట్లు......ఫ్లాస్కులో హార్లిక్సు ఇయ్యి.

గోపీ అల్లాగేనండి...బిస్కెట్ల పాకెట్టు తెరచి... మధుసూదనరావు కందిస్తాడు. ఆయన అవి తింటూవుంటాడు. తిన్న తర్వాత గ్లాసులో హార్లిక్సు ఫ్లాస్కునుంచి పోసి యిస్తాడు. మధు తాగేసి స్టూలుమీద గ్లాసు పెట్టి...ఒరే మీ అమ్మగారు చాలా మంచివారుకదురా!...

గోపీ అవునండి!

మధు (కుర్రతనంగా) మరి నేనో?

గోపీ మీరూనండీ!

మధు నువ్వు అబద్ధం ఆడుతున్నావు! నేను మంచివాణ్ణి కాదురా!... (బాధగా) యిదివరకు నువ్వు నన్నెరగవుకానీ! అసలు అప్పుడు నాకు కోపమనేది వుండేది కాదురా!... ఇప్పుడు ప్రతిదానికీ కోపమే!

గోపి : (ఏం చెప్పాలో తెలియక) అవునండి...

మధు ఒరే యింకా అమ్మగారు రాలేదేంరా? యింతసేపూ ఆఫీసులో ఏం చేస్తున్నారురా?

గోపి ఆలస్యంగా వస్తానన్నారు బాబూ... శేకరం...(నాలిక కరచుకుంటాడు).

మధు ఏమిటి! ఎక్కడికి వెళ్లింది? (కంఠంలో మార్దవముంతా పోతుంది).

గోపి ఏం లేదయ్యగారూ!...

మధు నిజం చెప్పు గాడిదా!...(గర్జిస్తాడు)

గోపి (భయపడి) శేకరం బాబుగారింటికి వెళ్లారండి!

మధు అతనింటికా? ఎందుకు?

గోపి తమరికి తెలియని దేముంది బాబూ!....ఆ బాబుకి వళ్ళు తెలియని జొరం గద.

మధు జ్వరమా!...నాకు తెలియదే.!...చెప్పొచ్చుగా!...అయినా ఆయనకి జ్వరమయితే యీవిడ పరిచర్య దేనికి!...ఆసుపత్రులు లేవూ!...నిన్నా ఆలస్యంగా వచ్చింది...ఏమంటే...ఆఫీసులో పని తెమలలేదంది...ఇదన్నమాట అసలు సంగతి...ఎంతెంత నాటకాలాడుతున్నారు?...అయితే ఆవిడ ఎక్కడికి వెళ్లింది నీకు తెలుసు...నాతో ఎందుకు చెప్పలేదూ...

గోపి అమ్మగారు చెప్పవద్దన్నారండీ!...

మధు చెప్పవద్దంటారు. దాపరికం దేనికో?... సరే నీకు ఎల్లా తెలుసు ఆయనకి జ్వరమని.

గోపి పళ్లూ, మందూ, జావా అమ్మగారు పంపిస్తున్నారండీ!...

మధు : వీటన్నిటికి డబ్బెవరిదిరా!

గోపీ : అమ్మగారిదేనండి!

మధు : బాగుంది! వద్దని చెప్పడానికి నాకేం అధికారముంది? .. అది సంపాదించుకుంటున్న డబ్బు దానిష్టం వచ్చినట్టు ఖర్చుచేస్తుంది. (వెటకారంగా) ఒరే వుత్తరాలు తీసుకెళ్తుంటావుకదూ !

గోపి : (అంతరార్థం గ్రహింపక) అవునండి.

మధు : (వెకిలిగా) నీలముకవర్లలో పెట్టేవా?

గోపి : (అయోమయంగా) ఆ వుత్తరాలికసలు కవర్లే వుండవండి. చిన్న కాయితాలమీద వ్రాస్తారు.

మధు : మంచిది! నా వెనుక ఎన్ని నాటకాలు జరుగుతున్నాయో... అందరూ నవ్వుతున్నారంటే నవ్వరూ... నేను వెర్రివాడినయ్యో!

[నిర్మల ప్రవేశిస్తుంది]

ర్మల : (మృదువుగా) ఇంకా ఏం తీసుకోలేదా?

మధు : హా! తీసుకుంటా! దానికి తొందరేం వచ్చిందిలే! యింతకీ తమరు ఆఫీసునుంచేనా వేంచెయ్యడం? ఎంత కష్టపడుతున్నారండీ ఆఫీసులో!

నిర్మల : (చెప్పావా! అన్నట్టు గోపివంక చూస్తుంది) వాడు అవునన్నట్టు తలవూపి తల దించేసుకుంటాడు.

మధు : (గొంతు హెచ్చించి) అయినా యీ పెత్తనాలు, అబద్ధాలు ఎప్పుడు నేర్చుకున్నావు! రెండోదికూడా నేర్చుకున్నావా?...

నిర్మల : (సహనము కోల్పోతూ) పెత్తనాలు కాదు శేఖరానికి వారం రోజులనుంచీ వళ్లు తెలియని జ్వరము అందుకని వెళ్లాను.

మధు : మంచిపని చేశావు! నువ్వు పరిచర్య చెయ్యక పోతే అతనికి జ్వరం ఎల్లా తగ్గుతుంది? అసలు అతని ప్రక్క కూర్చుండి నువ్వు కబుర్లు చెబుతుంటే అతని జ్వరం తగ్గిపోతుంది!...అందుకు వచ్చిన జ్వరమేగా...

నిర్మల (కోపంగా) మీ ఉద్దేశ్యం?...

మధు అయితే నిజం దాయడం దేనికో?...

నిర్మల దాపరికమా!...ఒక్కరోజయినా ... సుఖపడదామని...

మధు అహా! నా మూలాన సుఖం ఎరుగన్నావా?.

తప్పకుండా!...

మధు అవును! నా మూలానే నీకీ తిప్పలు. పోనీ వాడితోనే వూరేగు...యీ నరకం తప్పుతుంది...

నిర్మల (పళ్లు కొరుకుతూ) మానవత్వమనేది లేదు.

మధు ఏమిటి వాగుతున్నావ్?...ఏదో సంపాదిస్తున్నంత మాత్రాన...నీ యిష్టం వచ్చినట్టు వాగుతున్నావు జాగ్రత్త!

నిర్మల : (అతని ముందు కూర్చుని వళ్లో తలపెట్టుకుని ఏడుస్తూ) నే నేం నేరం చేశాను చెప్పండి? . ప్రతి క్షణం నన్నిలా హింసిస్తున్నారు ... యింతకన్నా ఓసారి చంపి వేయరాదూ?...

మధు : అయిందా ధోరణి?...

నిర్మల : ఏమయిపోయిందా మార్దవం!...మనిషిలో ఎందుకీ మార్పు! ఎవరు మిమ్మల్ని అవమానిస్తున్నారు? ... యింట్లో అడుగు పెట్టాలంటేనే భయంగా వుంది... శేఖరం ఏం చేశాడు....అతనంటే ఎందుకు మీకీ కార్పణ్యం? ... వళ్లు తెలియని జ్వరంలో వున్నాడే...అతను ఎంత మంచివాడు... ఎందుకలా రాక్షసులకన్నా హీనంగా అతన్ని, నన్ను హింసిస్తున్నారు...

మధు : ఏమిటి నేను రాక్షసుణ్నా ... అంతకన్నా హీనుడినా? అతను దేవుడా! నీ కంటికి కన్పిస్తున్నానా.. ...టి కొంచెవస్తే అంత అంటావు...(ఆవేశంగా) అవును నేను రాక్షసుణ్ని...అంతకన్నా హీనుణ్ని... అదేగా నువ్వనేది? అవును!.. అలా చూపిస్తాను...(అని ఆవేశంతో గొంతు గట్టిగా పట్టుకుంటాడు.)

గోపి : అమ్మో! అయ్యగారు చంపేంకి!...

నిర్మల : చంపుతారా! ... చంపండి! ...అంతకంటే నేను కోరేది ఏమిటి?

[మధు పట్టు బిగిస్తాడు..నిర్మల పట్టు వదల్చుకోవాలని వ్యర్థప్రయత్నం చేస్తుంది.]

గోపి : అమ్మో! ... అయ్యగారు, అయ్యగారు! బాబుగారు (దగ్గరికి వస్తాడు)....

మధు : నువ్వు నోరుమూసుకో గాడిదా!...దగ్గరికి వచ్చావంటే నరికేస్తా! (అని కాలు విసురుతాడు)

గోపి : [బయటికి పరుగెడుతాడు.]

మధు : చావు!. .చావు!... నువ్వు లేకపోతే నాకు గొడవదా...

[నిర్మల చేతులు వేళ్లాడిపోతాయి...చివరిసారిగా ఓ పట్టు బిగించి...ఒక్క తోపు తోస్తాడు....నిర్మల పల్లి స్టూలుమీదనుంచి

దొర్లి గోడమీద పడిపోయి తలకి దెబ్బతగిలి రక్తం కారుతుంది ... స్టూలుమీద గ్లాసు పగిలి పప్పు అవుతుంది.]

[మూర్తి హడావిడిగా ప్రవేశిస్తాడు.]

మూర్తి : ఏమిటి కేకలు...ఏం జరిగింది ? (వచ్చి చూసి) అయ్యో! హత్య...ఎంత దారుణము!...

మధు : (ఆవేశంతో) ఎవరు నువ్వు—బయటికి నడు. నే నెవరినో తెలుసా రాక్షసుడ్ని.. అంతకంటె హీనుడిని. కదలకపోతే ఏం చేస్తానో తెలుసా! నడవ్వేం? (అని రెండడుగులు వుద్రేకంగా వేసి కిందపడ్డ స్టూలుమీద దొర్లి నిర్మలదగ్గరగా పడిపోతాడు. నిర్మల శరీరం చల్లగా తగులుతుంది)

మూర్తి : దుర్మార్గుడా! ఎంత పని చేశావు? నీ పని! నేను కానికలే....పోలీసులే కానిస్తారు... అక్కడికే వెళ్తాను. బయటకి నడుస్తాడు...

మధు : (ఉద్రేకం చల్లారిపోతుంది) నిర్మలా!... నిర్మలా!...చివరకి నా అసంతృప్తి ఎంతాకా తెచ్చింది. దానికి నువ్వే బలి అయ్యావా. (గోపి,...శేఖరంతో ప్రవేశిస్తాడు. శేఖరం చిక్కిపోయి వుంటాడు. గడ్డం మాసి జుట్టంతా రేగిపోయి వుంటుంది. మాట నీరసంగా వుంటుంది...శేఖరం నిర్మల దగ్గర కూర్చుని ... చెయ్యివేసి చూసి గట్టిగా 'నిర్మలా' అని అరుస్తాడు ... మధువంక తిరిగి .. చివరికి ఎంత పని చేశావు...? నువ్వు రాక్షసుడివి ...

మధు : అవును శేఖర్! నేను రాక్షసుడిని...అందుకనే నేను నిన్ను వెళ్ళగొట్టాను. నిర్మలని హత్య చేశాను ... ఎన్నయినా అనుపడతాను ... నిజమే నేను రాక్షసుడ్ని ... ముమ్మాటికి నేను రాక్షసుడ్ని...

: ఇకముందు నీగతి ఆలోచించావా?

మధు : గుర్తు చెయ్యకు శేఖర్ ... భవిష్యత్తు గుర్తు చేయకు...భవిష్యత్తు నెదుర్కోలేక నేనే అధఃపతితుడ నయ్యాను ... కాని ఒక్క విషయం శేఖర్!...మిమ్మల్ని ఎంత బాధ పెట్టానో...అంతకు వెయ్యిరెట్లు నేను బాధపడ్డాను. మూర్తి పోలీసులకోసము వెళ్లాడు. వాళ్ళింకా రాలేం?.... (బయట బూట్ల చప్పుడు) వెళ్తాను శేఖర్ !...నన్ను క్షమిస్తావా? వద్దు...యీ పాపిమీద అమాత్రం దయకూడా వద్దు... నేను దానికి తగను...

[తెర]

# అసభ్యత అంటే ఏమిటి

ఆల్బర్ట్ డాస్‌నాయ్

అసభ్యత అంటే ఏమిటి?—దైనందిన జీవితంలో అసభ్య సంఘటనలనేవి యేవో కొన్ని మనకు తటస్థిస్తూనే వుంటాయి. సభ్యతాసభ్యతలను గురించి దినదినం మనం మాట్లాడుకుంటూనే వుంటాం. కాని అసభ్యతఅంటే యేమిటో, దాని అవధు లేమిటో యిదమిత్థమని తేల్చినవారెవరూ లేరు. నాకు తెలిసినంత వరకూ దీన్ని గురించి సమగ్రమైన పరిశీలన ఏదీ జరిగినట్టు కనుపించదు. దీనికి అలాంటి ఖండితమైన నిర్వచనాన్ని సృష్టించటంకూడా సాధ్యంకాదనే అనిపిస్తుంది. అథవా ఎలాగో శ్రమపడి ఒక నిర్వచనాన్ని దేన్నో తయారు చేస్తామనుకోండి, అది—కనీసం ఈ తరం వాళ్ళలోనైనా – సర్వ జనాంగీకారం పొందుతుందనటానికి వీల్లేదు. సకలప్రాంతాల ప్రజల సాంఘిక పరిస్థితులకు అన్వయించేదిగా వుంటుందనటానికి వీల్లేదు. అల్లాంటప్పుడు సర్వప్రాంతాల ప్రాచీన ప్రజలసాంఘికపరిస్థితులకూ కూడా అన్వయించే నిర్వచనం కుదరటమంటే అసంభవవిషయం.

ఇవాళ మనకు అసభ్యంగా కనుపించుతున్న అనేకవిషయాలు అనాటిసాంఘిక పరిస్థితులలో నాగరకతకు, సదభిరుచికీ చిహ్నాలై వుండవచ్చు. అందాకా యెందుకు, మనతరంలోనే చూసుకుందాం; ఇక్కడ మనం యూరపియనులు అసభ్య విషయాలుగా పరిగణించేవాటిని అటు చైనీయులుకూడా అదే దృష్టితో పరిగణించుతున్నారనటానికి ఆధారాలేమైనా వున్నాయా? అలాగే మనకు సంబంధించిన కొన్ని ఆచార వ్యవహారలను అసభ్యవిషయాలుగా చైనీయులు పరిగణించితే వాళ్ల అభిప్రాయంతో మనం ఏకీభవించగలమా?

మనకుగా మనం కేవలం తుక్కురకంగా పరిగణించే పాశ్చాత్య కళా ఖండాలుకొన్ని, అరబ్, టిబెట్, హిందూదేశాలలో అత్యంతనాగరక కుటుంబులుగా పేరుమోసిన కొందరు సంపన్నుల గృహాల్లో ప్రముఖస్థానాలలో అలకరింపబడి వుండటం చూచి మనం ఆశ్చర్యపడతాం. తమ జాతీయ కళా సంప్రదాయాలవిషయంలో సునిశితమైన అభిరుచితో విమర్శించే ఆప్రజలు, యూరప్‌నుంచి దిగుమతి అయ్యే వాటిపట్ల ఏమాత్రం పట్టింపూ లేకుండా ఆదరించుతూ వుండటం ఆశ్చర్యకరం. మన క్యాలెండర్లమీదా, చాక్‌లెట్ పెట్టెలమీదా ఎలాంటి పింజారీబొమ్మలు వేసి ఎగుమతి చేస్తున్నామ్. మహాత్తరపథాల నందుకున్న ఆసియా దేశపు కళా సంప్రదాయాల ముఖ్య అర్థంపర్థం లేని నకిలి నవ్వువినా యితర యోగ్యతేమీ లేని అలాంటి మన నాటుచిత్రాలకు ఆయాదేశాలలో ఆదరణ లభించుతూ వుండటం ఆశ్చర్యకరంగానే వుంటుంది.

అలాంటి అవ్యక్తపు పనులు చెయ్యనని మన యూరపియనులలో కొందరు గొప్పలు చెప్పుకోవటం కద్దు. నిజానికి మనవాళ్లలో ఈ విషయంలో తగు జాగ్రత్త వున్నమాట వాస్తవమే. విజాతీయ కళా సంప్రదాయాలను పరిశీలించవలసి వచ్చినపుడు మనం నిశితమైన విచక్షణాదృష్టిని వినియోగించుతాం. ఔత్సుక్యానికి కళ్లాలు తగిలించి అత్యంతమైన ఓర్పుతో పరిశీలించి వాటిలోని ఉత్తమ సంప్రదాయాలను మాత్రమే గ్రహించటానికి ప్రయత్నించుతాం. చైనీయులు హైందవ కళా సంప్రదాయాలను పరిశీలించేటప్పుడుగాని, హైందవులు చీనా సంప్రదాయాలను అవగతం చేసుకునేటప్పుడుగాని, ఆ రెండు దేశాలవారూ మనయూరపియన్ సంప్రదాయాలను అభివ్యక్తం చేసుకునేటప్పుడుగాని మనలాంటి నిశిత దృష్టితో చూడరు. అయితే ఒకటివుంది. అవన్నీ ఉత్తమ తరగతి కళాఖండాలుగా పేర్కొనటానికి వీలులేకపోయినా, అటు జపాన్ చైనా దేశాలనుంచి వచ్చిపడే మామూలు రకం, దంతపు బొమ్మలన్నా, లక్కబొమ్మలన్నా, రంగు రంగుల పింగాణీ సామానులన్నా యిక్కడి మన మధ్య తరగతి జనమంతా విరగబడతారు. కాని ఎంత తీసికట్టుగా లెక్క వేసినా, అవి, కళాప్రతిభ విషయంలో, ఇక్కడ తయారయే మన బజారు సరకులను తలదన్నే

వుంటాయి. చిత్రమేమిటంటే, మనం తయారు చేసే ఇలాంటి నాటురకానికి కూడా, ఆ చైనా జపాన్ దేశాల మారుమూల ప్రాంతాలలో కూడా ప్రజాదరణ వుంది. అలాంటిది అలాంటి మారుమూల గ్రామాలలోకూడా ఆదరణ పొందుతూ వుండటం చూచి లోటివంటివాడు చకితుడైనాడు. ఒక్క విషయం అంగీకరించి తీరాలి. ప్రాచ్యదేశాలు మన కళా సంప్రదాయాలను ఆదరించినంత ఉదారబుద్ధితో మనం వాళ్ల సంప్రదాయాలను ఆదరించం. గత శతాబ్దంపొడుగునా, ఇక్కడి మన పరిశ్రమలలో తయారుచేసి ఆసియా ఆఫ్రికా దేశాల నెత్తిన గుమ్మరించినలాంటి కళాబాహ్యములైన నాటురకం సరకులను, యితర ప్రపంచంలోని ఏ దేశమూ ఎప్పుడూ సృష్టించలేదు.

## 2

ఇదంతా ఇలావున్నా—ఇక్కడి మన యూరపియన్ ప్రజల అవధికి సంబంధించినంతవరకే ననుకున్నా—"అసభ్యత" అనే పదం వాడినప్పుడు అదేమిటో మనకు కొంత గ్రాహ్యమవుతూనే వుంటుంది. దాని సమగ్రావధులేమిటో మనకు అర్థంకాకపోతే పోవచ్చు. అసభ్యత ఏదైనా తటస్థమైనప్పుడు అది మనలో ఏహ్యభావాన్ని లేదా జుగుప్సను, రెచ్చగొట్టడం మనకు ప్రత్యక్షానుభవమే. దీన్ని కాదనే వీలు లేదు. అసభ్యత అనేక రకాలు; హృదయానికి సంబంధించి కొంత, మనస్సుకు సంబంధించిన కొంత, అభిరుచికి సంబంధించిన కొంత. ఇలాగే ఒక ప్రత్యేక యుగానికి సంబంధించిన అసభ్యతవుంటుంది. ఉదాహరణకు "ఈనాటి అసభ్య విషయాలలో" అంటాం. మానవుని అంతరాంతరాలనుంచి పెగల్చుకువచ్చే అసభ్యత వుంటుంది. ఇప్పుడు మనం యోజించవలసింది ఒక్కటే. అసభ్యత అనేది ఇన్ని రకాలుగా కనుపించుచున్నదిగదా—వాటి కన్నిటికీ కారణభూతమైన సమానధర్మమేదైనా వున్నదా? వుంటే అది యిదమిత్థమని నిరూపించటానికి మనకున్న సాధన సంపత్తి యేమిటి?

వచన రచనలో వాల్తేరుకు నిర్దుష్టమైన అభిరుచి వుంది. కాని భావన విషయంలో రూసో కంటే అసభ్యపంథా తొక్కాడు. కాని రూసో మాత్రమేమి తక్కువతిన్నాడా వ్యక్తిగతజీవితంలో ఎంతో నాటురకంగా ప్రవర్తించి ఈ లోటును భర్తీ చేసుకున్నాడు! 16 వ శతాబ్ది చిత్రకళలో ఎంత అః వున్నదో మనకు తెలుసు. 15 శతాబ్ది కళా విన్యాసంలోనే దాని ఛాయలు మనకు దృగ్గోచర మవుతాయి. కాని 19 వ శతాబ్దికి వచ్చేసరికి, ఆ శతాబ్ది కళా విన్యాసంలో కనుపించే అసభ్యతకు 16 వ శతాబ్ది దానికీ ఎక్కడా సంబంధం వున్నట్టు కనుపించదు. అసలు ఈ రెండూ ఒకే సంప్రదాయానికి సంబంధించినవి కావేమోనన్నంత భేదం కనుపించుతుంది. వాటికన్ మ్యూజియంలోకి వెళ్లి 15 వ శతాబ్దంనుంచి ఆయా శతాబ్దాల చిత్రాలు వరసను చూచుకుంటువస్తాం; వర్తమానశతాబ్ది చిత్రాలున్న గ్యాలరీలోకి అడుగు బెట్టేసరికి మనకు హఠాత్తుగా విభ్రాంతి కలుగుతుంది. ఏదో మరొక జగత్తులోకి వచ్చేసి నట్టనిపించుతుంది. అంతదాకా అక్కర్లేదు; అత్యంత సుందరంగా అలంకరించివున్న ఏదో ఒక యింట్లోకి అడుగు బెడతాం. దుస్తుల విషయంలోనూ, కుర్చీలూ, బల్లలూ వగైరా యితర గృహాలంకరణల విషయంలోనూ ఆ యింటి యజమానులకు నిర్దుష్టమైన అభిరుచి వున్నట్టు మనకు గోచరించుతుంది; మెచ్చుకుంటూ వుంటాం; ఇంతలోనే, ఇన్నిటినడుమా ఏమూలనో ఒకమూల క్షంతవ్యంకూడా కాని అసభ్యతను వ్యక్తంచేసే ఏ చిత్రమో మనకంట బడుతుంది. అలా తటస్థించినప్పుడు, ఒక వ్యక్తియొక్క అభిరుచి ఒక రంగంలో అంత ఉన్నతస్థాయిలో వుండి మరో రంగంలోకి వచ్చేసరికి 'యింత అధోగతిలో వుండటమేమిటో?' అని మనకు మనకే ఆశ్చర్యమేస్తుంది.

అసభ్యత అంటే, స్థూలంగా, మనమేమి నిర్వచనం చెయ్యవచ్చు? దాన్ని కేవలం బేలతనమనిగాని, మోటతనమనిగాని, తలనొప్పి నినాదాలనిగాని, పాతబాణీని పట్టుకు ప్రాకులాడటమనిగాని, అరసికత అనిగాని, సరసత లేకపోవటమని గాని అనటానికి వీల్లేదు. కాకపోతే వీటన్నిటిలోనూ అసభ్యతఅనేదివుంటుంది. ముఖ్యంగా సరసత లేనప్పుడు దాని ప్రభావం పడగవిప్పి కనుపించుతుంది. పోనీ దీన్ని అనాగరకత అందామా అంటే అలానూ వీల్లేదు. అలా అంటే దాని అవధులను పరిమితం చేయటం అవుతుంది. రూబెన్స్* నాగరికత అంటే కంటగించుకున్నాడు. నాగరికత అంటే తనకున్న జుగుప్సనంతా తన చిత్రాలలో

* ఫ్లాండర్స్ దేశపు చిత్రకారుడు.

వెళ్లిగక్కాడు. అలా వెళ్లగక్కడంలో వ్యక్తిగతంగా తనలోవున్న అసభ్య స్వభావాన్నంతా కూడా ఆ చిత్రాలలో వ్యక్తం చేశాడు. ఆ చిత్రాలే ఉత్తమ కళాఖండాలుగా అభినందించబడినై. అవే అతనికి కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించిపెట్టినై. అతని చిత్రాలలో అలాంటిది లేనివికూడా కొన్ని వున్నయ్. కాని, వాటిలో అతని ప్రతిభ యేమీ కనుపించదు. దీన్నిబట్టిచూస్తే అతని ప్రతిభకంతకూ అతనిలోవున్న ఈ అసభ్య స్వభావమే జీవమని తోస్తుంది. ఒక్క అతని విషయమే కాదు; అరాచకపంథాలో సాగే కళాసంప్రదాయాల కన్నిటికీ ఇదే జీవం. దీన్నిబట్టి, 'మానవుని సృజనశక్తితో అవినాభావసంబంధం కలిగి, ఆరోగ్యకరమైన ఒక రకం అసభ్యత వుంటుందని మనం గ్రహించగలుగుతున్నాం. రాబెలె 1, ఫ్రాంజ్ హాల్స్ 2, బాల్‌జాక్ ఈ ముగ్గురిలోనూ మనకు పొడసూపేది ఈ రకమైన అసభ్యతే. వాళ్ల ప్రతిభ పైకొని ఉజ్వలావధికి లేచినపుడు సరస సంప్రదాయాది అవధులనన్నిటినీ ఛిన్నాభిన్నం చేసుకుంటూ ముందుకు తూగిపోతుంది. ఇది ఒక్క ప్రతిభావంతుల విషయమే ననుకోనక్కరలేదు. ఏ తెలివితక్కువవాడైనా కూడా వున్నట్టుండి ఏదో అసభ్య విషయాన్ని యెత్తిచూపవచ్చు ఏదో అసభ్యంగా ప్రవర్తించవచ్చు. టివన్నిటినీ మనం పట్టించుకోము. మళేం జరగనట్టు కప్పుకుపోతాం. ఇప్పుడు మనం అసభ్యతనుగురించి చర్చించుతున్నామంటే ఇలాంటి అనాయకులకు సంబంధించిన క్షంతవ్యమైన అసభ్యతనుగురించికాదు. క్షంతవ్యం కాని అసభ్యతను గురించే మనం ఆలోచించుతున్నాం.

ఒక మనిషినిగురించి. చూట్టానేటప్పుడు 'ఫరవాలేదు మంచివాడే' అంటామనుకోండి. దాన్లో చెప్పుకోదగ్గ విశేషమేమీలేదు. కాని 'వాడు వట్టి అసభ్యం మనిషి' అన్నామనుకోండి, దానికి చాలా అర్థం వుంటుంది. అసభ్యతతో పాటు ఆ వ్యక్తికి దురుసుతనాన్ని కూడా ఆపాదించుతున్నాం. కారణమేమిటంటే అలా అసభ్యతను వ్యక్తీకరించటంలో ఆత్మీయమైన ప్రయత్నం వుంటుంది. తన ధోరణిని తాను నిల్వరించుకోవాలనే అహం వుంటుంది. ఆత్మవిశ్వాసం వుంటుంది. (విమర్శనాత్మకమైన దాడినుంచి) తన్ను తాను రక్షించుకునే ధీమా వుంటుంది. అలా అసభ్యతను వ్యక్తీకరించటానికి భాషే కావాలనేది లేదు; ఒకచూపు చాలు; ఒక శిరఃకంపనం చాలు. ఇంకా అహం ప్రతిమించినప్పుడు ఈ బాహ్యచిహ్నాలేమీ కూడా అక్కర్లేదు. ప్రపంచం లెక్కేవిటనే అహంలో అచంచలమైన మౌనముద్ర ఒకటిచాలు.

## 3

ఈ అసభ్యతాసమస్య నాకు తొలితొల్త ప్రతిమించి కనుపించింది వలస పరిపాలనవున్న దేశాలలో. నల్లజాతివాళ్లమధ్య మెలగవలసివచ్చేసరికి తెల్లవాడిలోవున్న అసభ్యస్వభావం యిట్టే బయటబడిపోతుంది. ఈ విషయంలో నీగ్రో, తెల్లవాడికంటే, ఎన్నోరెట్లు మేలనిపిస్తాడు. విచిత్రమేమిటంటే తాను అసభ్యంగా సంచరిస్తున్నాననే సంగతి ఆ తెల్లవాడికి అవగతమవుతూ కూడా వుంటుంది. ఒక డాక్టరు నాకు కొన్ని ఫోటోలు చూపించాడు. అవి తాను అరణ్యప్రాంతంలో పర్యటిస్తున్నప్పుడు తీసినవి. ముందు నీగ్రోల ఫోటోలు చాలా చూపాడు. అవన్నీ రోడ్డున పోతూవున్నప్పుడూ, నీగ్రోగూడెములకు వెళ్లినప్పుడు తీసినవి. వాళ్లంతా సహజంగా వున్నప్పుడు తీసిన 'స్నాప్‌షాట్స్' [illegible] చూపించిన అనంతరం మరో ఫోటో తీసి "ఇదిగో ఇప్పుడు చూడండి!" అన్నాడు డాక్టర్, అదో ఫోటో పెట్టి. "ఇంగ్లీషువాడి హుందాతనం ఎంతో యిప్పుడు తెలుస్తుంది." అన్నాడు. [illegible] ఆ ఫోటోలో తనూ, తన భార్యా తాము చాలా గొప్పవాళ్లమనే నకిలీపోజులో మొహాలు బిక్కించి పెద్ద మిగ్గెక్కి నిల్చున్నారు. నీగ్రో నౌకర్లు కొందరు (వాహకులు) చేతులు కట్టుకుని చుట్టూ నిల్చున్నారు. ఆ యిద్దరు ఆంగ్లేయుల మొఖాల్లోనూ ఏదో అనిర్వచనీయమైన అసభ్యత కొట్టొచ్చినట్టు కనుపించి జుగుప్సను కలిగించుతోంది. ఇది వాళ్లు వ్యక్తిగతంగా పెంపొందించుకున్న స్వభావం అనటానికి వీల్లేదు. ఎందుచేతనంటే వాళ్లు సద్వంశంలో పుట్టినవాళ్లూ సత్సంప్రదాయంలో పెరిగినవాళ్లూ కూడా. మరి యికయిదేమిటంటే యూరపియన్‌జాతిలో తరతరాలూ వస్తున్న కుష్ఠువ్యాధిలాంటి స్వభావం. ఈ విషయాన్ని ఎత్తిచూపి ఆయనకు కళ్లుమోతులినం తెప్పించాను. అదే వాదంగా కొంకిపాడిచినట్టు పొడిచి

1. ఫ్రెంచి వ్యంగ్యరచయిత. 2. డచ్ చిత్రకారుడు.

రెచ్చగొట్టాను. చివరికి చిరాకెత్తి 'అవును, ఏంజేస్తాం, నాగరికులం కావటంవల్ల పట్టిన దురదృష్టం' "నీగ్రోలలో ఈ అసభ్యత లేదంటే, జంతువులలో మోస్తరుగానే వాళ్లలో కూడా ఆసత్తా లేదు." అన్నాడు.

నిజానికి అసభ్యత అనేది మానవునికి సంబంధించిందే. కాని నాగరికతయొక్క ఏదో ఒక స్థాయినిబట్టి యిలాంటిది పుడుతుందని చెప్పటానికివీల్లేదు. కాంగో ప్రాంతంలోనే కొన్ని నాగరికజాతులున్నాయ్. ఉదాహరణకు అరబ్బీ, హామైట్, వాటూస్యిన్ జాతులవాళ్లున్నారు. అవన్నీ గొప్ప నాగరికతను అలవరచుకొన్న జాతులే కాని వాళ్లలో ఇలాంటిది కనుపించదు. అటు మళ్లీ బాంటూస్ తెగవాళ్లున్నారు, ఇంకా అనాగరికులైన ఆటవిక జాతులున్నాయ్. వాళ్ళల్లో కూడా ఇలాంటిది లేదు. వాళ్లల్లో క్రూరత్వంవుంటే వుండవచ్చుగాని తరతరాల దీర్ఘవ్యాధిగా సంక్రమించే యీ అసభ్యతాజాడ్యంమాత్రం కనుపించదు.

దీనికి ఆ వలస డాక్టరే ఒక కారణం చెప్పాడు: 'వాళ్లల్లో ఆధ్యాత్మిక చింతన చావలేదు. అది చావటం వల్ల కలిగిన ప్రేతకళే మనలోని ఈ వికార స్వరూపమంతా'

నేనుమాత్రం, ఇదంతా, వ్యక్తిత్వానికి, లేదా, అహంకారానికి సంబంధించిందనుకుంటాను. అహంకార రాహిత్యమే పైజాతులలో కనుపించే ఆరోగ్య స్థితి. ఈ వలసలలో వుండే రంగుజాతుల్లో సహజమైన ఒక వోర్పు, నిరాడంబరత కనుపించుతుంది. తరతరాలుగా వస్తున్న సంప్రదాయ జీవితంలో వ్యక్తిత్వం లయించిపోతుంది. అందుచేత ఆ వ్యక్తుల ముఖాల్లో ఆ జాతియొక్క ఉజ్వలతేజమే అనిర్వాచ్యమై వెలుగొందుతూవుంటుంది. ఆఫ్రికా నీగ్రోల ముఖాలలో ఒకదానికొకటి పెద్ద తేడా కనుపించదు. ఏ ముఖం చూచినా చెప్పుకోదగిన ప్రత్యేకతకూడా యేమీ వుండదు. కాని అల్పబుద్ధి స్వరూపమైన అహంకారం కారణంగానూ, అజ్ఞానం కారణంగానూ పెంపొందే దురభిమాన చిహ్నాలు మాత్రం వాళ్ళ ముఖాల్లో కనుపించవు. పరాజితబుద్ధివల్లనూ, దెబ్బతిన్న అహంకారంవల్లనూ పుట్టుకొచ్చే కుళ్లుమోతు కన్ను వాళ్లలో వుండదు. తెలివిగలవాళ్ళం మనకేమని మొద్దుబారి వకానంగా కూర్చోవటంకూడా వుండదు. వాళ్లలో మొరటుతనం వుంటే వుండవచ్చుగాని పోచుకోలుతనం మాత్రం వుండదు. వాళ్ల ముఖాల్లోనే కాదు, వాళ్ళ నడకలోనూ వాళ్ళ స్వభావంలోనూకూడా యీరకమైన జబ్బు లేమీ కనుపించవు.

ఇవన్నీ నా వ్యక్తిగత అభిప్రాయాలనీ, ఇదంతా వివాదాస్పదమైనవిషయమని ఎవరైనా ఆక్షేపణచేస్తే చేయవచ్చు. కాని ఇది వాస్తవస్థితి. పశ్చిమ దేశాల చిత్రకారులువెళ్ళి వాళ్ళకు గురుత్వంవహించి మన 'వాస్తవిక సంప్రదాయపు' మొరటుతనాన్నంతా వాళ్లకు ప్రబోధించక పూర్వమూ, మన పరిశ్రమలు తయారుచేసిన నాటుసరుకులు అక్కడ వ్యాపించక పూర్వమూ, కాంగోప్రాంతంలోని నీగ్రో చిత్రకారుల చిత్రలేఖనంలోగాని, వాళ్ల చేతిపనుల విన్యాసంలోగాని ఎక్కడా అసభ్యత అనేది రేఖామాత్రంగానైనా కనుపించేదిగాదు. మనం వాళ్ళ అభిరుచుల్ని అధోగతికి పట్టించాం.

## 4

ఈ విషయాన్ని యింకా పూర్తిగా అవగాహన చేసుకోవాలంటే, అనాదిసిద్ధమైన ఆదిమమానవుని కళావిన్యాసంలో అసభ్యత అనేది ఏకోశానా కనుపించకపోవటం, అలాంటిదానికి ఆనాడు అవకాశం కూడా లేకపోవటం మనం గుర్తించాలి. ఆదిమజాతులకు సంబంధించిన పురావస్తు ప్రదర్శనశాలలలోకి వెళ్ళి చూస్తే మనకీవిషయం విస్పష్టంగా అర్థమౌతుంది. వాటిలో అభూతకల్పన కన్పించవచ్చు. జుగుప్సావహమైన నగ్నత కనుపించవచ్చు — కాని అసభ్యత మాత్రం వుండదు. నాగరికతల పరిణామంలో ఒక దశకు వచ్చేసరికి యీ అసభ్యత పొటమరించుతుంది.

పైన వివరించిన విషయాలన్నీ అవగాహన చేసుకున్న తరువాత మనం తెగించి ఒక నిర్ణయానికి రావచ్చు:

'మానవ పురోగమనంలో 'ఉపజ్ఞ' (కార్యకారణ జ్ఞానం—*Rationalism*) ఎప్పుడు ఆవిర్భవించిందో దానితోపాటు దాని స్వభావాలలో ఒకటిగా "అసభ్యత" కూడా అవతరించింది'.

ఆధ్యాత్మికాన్వేషణలో ప్రయుక్తమయ్యే ఈ ఉపజ్ఞకు అసభ్యతా దోషం వుండదు. కాని దాని ప్రయోగంవల్ల కలిగే తీవ్ర ఘట్టనలో అంతంతమాత్రం వాడి'యెవడి మనస్సయినా శంకావలయితమైన సుశి గుణ్ణంలోకి ప్రవహించి లౌకికజ్ఞానాన్ని ప్రభవింప జేసుకుంటుంది. కళా రంగంలో ఈ లౌకికజ్ఞానం 'వాస్తవికత పెంపొందాల' నే భీషణమైన నిరంకుశ నినాదానికి కారణభూతమౌతుంది. తాత్వికరంగంలో ఇది ప్రతి సాధారణ వ్యక్తికీ స్వేచ్ఛనిస్తుంది.

అసభ్యతా లేశం యేమీలేని మానవసృజనను వినా యితర్రతా దేన్నీ అంగీకరించేది లేదని పట్టుబడితే మనం చాలా దూరం వెనక్కు అడుగు మానవునివరకూ నడవవలసి వస్తుంది. దైవిక ప్రేరణ ఏకైక కారణంగా అతను సృజించినవాటిని మాత్రమే అంగీకరించవలసి వస్తుంది.

దైవిక, ఇంద్రజాలిక శక్తులకు, అనేక అభూత మార్గాలకు యిచ్చుకుపోయే స్వభావమున్నా అసభ్యతా దోషాన్ని మాత్రం అంటనివ్వవు. కాని వీటితో ఒక బాధవుంది. కార్యకారణ యోజనాత్మకమైన తార్కిక దృక్పథానికి (ఉపజ్ఞకు) కూడా తావు లేకుండా చేస్తాయి. దీన్నిబట్టి ఒకటి తేలుతోంది. మానవుని ఉపజ్ఞతోపాటు దాని సహజ స్వభావంగా అసభ్యతకూడా ప్రభవించింది. మరోవిధంగా చెప్పాలంటే ఉపజ్ఞాజీవిగా మానవుడు ఎప్పుడు పరిణామం చెందాడో ఆనాడే అసభ్యతకు కూడా అంకురారోపణ జరిగింది.

అనాది గ్రీకు కళారంగం అసభ్యతాకళంకితం కాలేదు. మళ్ళీ క్రీ. పూ. 3, 4 శతాబ్దాల కళారంగం అందుకు భిన్నంగా వుంది. అతి ప్రాచీనమైన ఎట్రూస్కన్ కళా సంప్రదాయం రోమక సామ్రాజ్యదినాల బిజాన్టైన్ సంప్రదాయంగా రూపొందే పరిణామ దశలో వాస్తవిక ధోరణిని ఆధారం చేసుకుని అసభ్యత మీను మిగిలి పెరిగింది.

ఫ్రెంచి సంప్రదాయంలో 15 శతాబ్దిలో పాటమరించిన ఈ అసభ్యత 19 వ శతాబ్ది నాటికి పరమ దైవతంగా పరిణమించి పీఠమెక్కి కూర్చుంది. అనంతరం దానిపట్ల వచ్చిన తీవ్రమైన విముఖభావం కారణంగా, కళారంగం యావత్తూ ఒక్కసారిగా ఔపయుక్తిక ధోరణిలోకి అజ్ఞేయ ధోరణిలోకి తిరోగమించింది. కలవరంగా ఇలా ఒక్క ఉరుకున తిరోగమించటంలో కళకు ఉండే శోభ యావత్తూ నశించిపోయింది. దీంతో ప్రజాసామాన్యానికంతకూ పతనావస్థ సంఘటించింది.

తనంతనా, వాస్తవికతకు అసభ్యస్వభావం లేకపోవచ్చు కాని అసభ్యత ప్రభవించటానికి పెంపొందటానికి కావలసిన వాతావరణాన్ని అది ఉత్పన్నం చేస్తుంది. 19 వ శతాబ్ది కళారంగానికి పట్టిన అధోగతి కంతకూ వాస్తవికతే కారణం.

ఈ సమస్యకు వున్న చిక్కంతా ఇక్కడే వుంది. వాస్తవికత అసభ్యతకు దోహదకారి. కాని శాస్త్రీయ పరిజ్ఞానమూ ఉపజ్ఞా ఇవి రెండూ వాస్తవికతమీద ఆధారపడి వున్నయ్. యూరప్‌లో 'రినైసెన్సు' ఉద్యమోదయం లగాయితు చిత్రరచన వాస్తవికతను పెంపొందించుకోవటానికి తీవ్రమైన ప్రయత్నం చేసింది. దాంతో లేనిపోని బాధ్యతలను నెత్తికెత్తుకుని వాస్తవికసూత్రాల బరువు క్రింద క్రుంగిపోయింది. కాని సౌందర్యోపాసనలోనూ, కరుణరస వ్యంజనలోనూ కళాకారుడు ఇతఃపూర్వం ఎన్నడూ అందుకోని శిఖరాలను అందుకున్నాడు. ఉదాహరణకు అలౌకికావేశ ప్రేరితులైన, గాథిక్ రోమన్ కళాకారు లెవ్వరికీ సాధ్యంకాని మోహనలేను మైకలాంజిలో సాధించాడు. కాని మైకలాంజిలో శిల్పాలను చార్ట్రిస్, మొసెయిక్ల శిల్పాలతో పోల్చిచూస్తే, సహజ సౌందర్యోన్మీలనంలో ప్రతిభావిశేషం ఎంత పెరిగిందో శిల్ప సాంకేతిక ప్రమాణం అంత దిగజారిపోయినట్టు మనకు అవగతమవుతుంది. మరోవిధంగా చెప్పాలంటే వ్యుత్పన్నత పెరిగి శిల్పం నశించింది. ఈ పరిణామ ద్వంద్వానికి రెంబ్రాంట్-చిత్రాలు కచ్చితమైన ఉదాహరణలు. వీటిలో కళాకారుని వ్యక్తిత్వం పెరిగి శిల్పప్రాభవాన్ని విచ్ఛిన్నంచేయటం అర్థమవుతుంది. మానవ మేథాపరిణామ శాస్త్రసత్యాలనూ, ఊహాతీతమైన వాస్తవికప్రకృతియొక్క ఒడియతనూ రెంబ్రాంటులా వ్యక్తంచేసినవారు మరొకరెవరూ లేరు. కాని వాన్ వేడన్, వాన్‌హాక్ చిత్రాలతో ఇతని చిత్రాలనుపోల్చి చూస్తే, ఆ చిత్రరచనకుపట్టిన ఈతిబాధ యేమిటో మనకు అర్థమవుతుంది. ఆ భౌతికవాద మానసికశాస్త్ర

ముల దురాక్రమణ కారణంగా, శిల్పవిన్యాసంలో స్వచ్ఛందమైన సాంకేతికౌన్నత్యం నశించి ఆ కళ అసభ్యతాప్రాంగణాన అడుగుపెట్టింది.

కళారంగంలో ఒక్కసారి ఇది ప్రారంభమైన తరువాత దాన్ని అధోగతికి దిగజారిపోకుండా కాపాడగలిగేవాడు ఎవ్వడూ లేడు. ఈ ఆంతరంగిక సంఘర్షణ 19 శతాబ్దంలో పరిణామదశకు వచ్చి కళాకారులను అటు అధినాస్తవికులుగానూ, ఇటు సాంకేతికవాదులైన అభూతకాల్పనికులుగానూ రెండు విభిన్నవర్గాలుగా చీల్చివేసింది.

౨

సాంస్కృతిక ప్రతిభా దరిద్రులైన ప్రజాస్వామికవాదులూ, ధనికవర్గాలూ, బహుళ ప్రజావాసం కోసం నిర్మించుతున్న ఈ నవీనప్రపంచం ఎలాంటిది? ఆ ప్రపంచంలో కళ దైనందిన జీవితంలోని ఒక చిన్ని ఘట్టానికి ప్రతిబింబమై వుండాలి; ఆ అవధులను దాటి పైకి లేవకూడదు; "అద్భుతమైన వాస్తవిక వ్యక్తీకరణ"గా వుండాలి! కాముకమైన యింద్రియ సంక్షోభావేశం వినా యితర భావావేశాలేవీ పనికిరావు. అలౌకికసౌందర్యాన్ని లాగేసి దాని పీఠంమీద అధికారికపటాటోపమూర్తిని వ్యంజనచేసి ప్రతిష్ఠించాలి. అలాంటి ప్రపంచంలో రాజకీయం 'సాంఘికభద్రత'గానూ, వర్గపగుల పాచికలాటగానూ దిగజారుతుంది. ప్రభుత్వం అనే పదానికి పరిరక్షించు అనే అర్థం మాసిపోయి, పరిపాలించు అనే అర్థం మిగులుతుంది. ఇక మతం గతేమిటంటే, నైతికసూత్రాలను ప్రబోధించే ఆరోగ్యశాస్త్రంగా తయారై, పోలీసు శాఖకు మద్దతుగా (దొంగతనాలు వగైరా) నేరాలు చెయ్యకుండా జనాన్ని అదుపులో పెట్టడానికి ఉపకరిస్తుంది.

ఇక ఆధ్యాత్మికరంగంలో అసభ్యత, 'అన్నీ మనకు తెలుసు'ననే అహంకారంలో ఆవిర్భవిస్తుంది. లౌకికజ్ఞానావధిని మించిన సత్యమేదీ లేదనే వాదాన్ని పురస్కరించుకుని ప్రభవించుతుంది.

'నీవు తెలిసిందే పరమసత్యం కాదు; నీవు నిర్ణయాధికారాన్ని చేపట్టకూడదు (*Shou shalt not Judge*)—ఇది ఆధ్యాత్మికౌన్నత్యపు ప్రప్రథమాదేశం. కాని నిర్ణయాధికారాన్ని చేపట్టి సత్యాన్ని మనం మనస్థాయికి దిగజారుస్తున్నాం. ఈ నిర్ణయాధికారాన్ని విసర్జించి ప్రపన్నులం కాగలిగితే సత్యస్వరూపంయొక్క అనంతమైన మహత్తు మనకు గోచరమవుతుంది. నిర్ణయాధికారాన్ని విసర్జించాలి. కాని, యోజన మానవుని సహజస్వభావం కావటంచేత ఇది సులభసాధ్యం కాదు. కనీసం ఒకటి చెయ్యాలి; మన అభిప్రాయమే పరమప్రమాణమనే మొండిబాణీ అవలంబించకుండా అవసరమైనప్పుడల్లా ఎడనెడా మనభావాలను మార్చుకోగలిగే [illegible] స్వభావాన్ని పెంపొందించుకోవాలి. తొందరపడి ఒకొక్కనిర్ణయానికి వచ్చి, అనంతరం వాటిలోని అవ్యక్తతను గుర్తించి సిగ్గొచ్చి బుగ్గ కఱచుకున్న ఘట్టాలు మన జీవితాల్లో ఎన్నెన్నిలేవు. ఒకొక్క మూఢవిశ్వాసంనుంచి బయటపడటానికి మనం ఎంతెంత తన్నుకోవలసివస్తుంది. అసభ్యస్వభావం గల వ్యక్తికి ఇలాంటి సిగ్గుశరాలుండవు. పైగా వ్యక్తిగతములైన తన తప్పుడు సిద్ధాంతాలను దౌర్జన్యయుతమైన అహంకారంతో యితరులమీద వేసి రుద్దటానికి ప్రయత్నించుతాడు. తన సిద్ధాంతం ఎప్పుడూ తప్పుకావటానికి వీల్లేదనే దురహంకారాన్ని పెంచుకుని సిద్ధాంతీకరణాధికారాన్ని తనకు తానుగా చేపట్టి అప్రతిద్వంద్వంగా వ్యవహరించుతూ వుంటాడు. పైగా ఇలాంటి వాడి యోజనలో వుండే మరో దౌర్భాగ్యమేమిటంటే తన అభిప్రాయాన్ని పరాస్తంచేసే సంఘటన ఏదైనా ప్రత్యక్షంగా ఎదుట కనుపించినా లెక్కచేయడు; దాన్నంతా అజ్ఞానంక్రింద తేలికగా కొట్టిపారేసి తనకు వీలుగా వుండే అభిప్రాయాన్నే సిద్ధాంతీకరించుతాడు.

ఈ విధంగా, తన నైతిక వైజ్ఞానిక సౌఖ్యాలను లౌకికజ్ఞానమనే యీ కంచుకోటలో భద్రపరచి సురక్షితంగా కాపాడుతూ వుంటాడు.

లౌకికజ్ఞానమనే ఈ అల్పపరిజ్ఞానానికి సర్వజ్ఞతాహంకారం జత కలసినప్పుడు, మానసికంగా ఉండే అసభ్యస్వభావానికి స్థిరరూప మేర్పడి అసభ్యత ద్యోతమానం అవుతుంది. ఆ కారణంగా వ్యక్తిస్వాతంత్ర్యం అనేది పెంపొందిన కొద్దీ, ప్రతి సాధారణ వ్యక్తికీ నిర్ణయాధికారం లభించినకొద్దీ అసభ్యత పెరుగుతోంది. నేడు సర్వజన స్వాతంత్ర్యం సిద్ధించింది. ఏ ఓ ఫేక్టరీలోనో పనిచేసే ఏ సామాన్య

కార్మికుడైనా, నైతికంగా, వైజ్ఞానికంగా స్వతంత్రుడు. అతను ఏవిషయాన్నిగురించైనా, ఏ విధంగానైనా ప్రవచింపవచ్చు; వ్యక్తిగతమైన తన అభిప్రాయానికి భిన్నమైన ఏ మహోన్నత భావాన్నయినా అంగీకరించకుండా కొట్టిపారెయ్యవచ్చు. ఏమీ వాద నే తేడా లేకుండా సర్వమానవులకూ ఒకే స్థాయి రాజకీయ చైతన్యం వుంటుందనే ధోరణిలో ప్రజాస్వామిక వ్యవస్థలు సర్వులకు ఇలాంటి నిర్ణయాధికారాన్ని ప్రసాదించినాయి. వ్యక్తి శాస్త్రీయ విజ్ఞానానికి, సాంకేతిక విజ్ఞానానికీ కొంత దాసుడయి వ్యవహరించవలసిన అవసరం యేర్పడిన మాట నిజమే. కాని విజ్ఞానాన్ని విపుల వ్యాప్తంగా ప్రజా బాహుళ్యానికి అందజేయాలని తాపత్రయపడే వారి పుణ్యమా అని ఎలాంటిఅజ్ఞానికైనా తాను సక్రమంగా నే యోజించ గల్గుననే ధీమా యేర్పడగల అవధికి మిడిమిడి జ్ఞానాన్నీ, తెలిసీ తెలియని అభిప్రాయాలనూ అందించారు.

## 6

ఇదంతా వెర్రిధోరణివాదంగా కనుపించవచ్చు. కాని ఒక్కటిమాత్రం సత్యం. ఆధ్యాత్మికరంగంలో అసభ్యత అనేది యెక్కడ కనుపించినా దానికి అజ్ఞానమే మూలకారణం.

18 శతాబ్ది కళారంగంలో వచ్చిన అవాంఛనీయములైన మొండి ధోరణుల కన్నిటికి కారణం అలౌకిక సత్యంయొక్క అస్తిత్వాన్ని అంగీకరించకపోవటమే నని మొదటే చెప్పాము. 'భాషాభేషజాన్ని సంస్కరించితే, మానవజాతిని భిన్నవర్గాలుగా విడదీస్తున్న మతభేదాల పీడలన్నీ విరగడౌతా' యన్నాడు, కొండర్ సే*. ఈ అభిప్రాయాన్నే 19 వ శతాబ్ది భౌతికశాస్త్రవేత్తలంతా దొరక పుచ్చుకున్నారు.

శాస్త్రీయ విజ్ఞానానికి అందని పరమసత్యమంటూ యేమీ వుండదనే దురభిప్రాయాన్ని ప్రతి సామాన్యుడికీ కలిగించారు. అలౌకికం అంటూ అసలు వుండ' దన్నారు. శాస్త్రీయ దృక్పథంతో పరిశోధనాపరంపర సాగించితే ప్రతిసమస్యనూ పరిష్కారం చేసెయ్యవచ్చు నన్నారు. దీంతో ప్రయోగాత్మకమైన పరిశోధన ఒక్కటే నిజమైన విజ్ఞానానికి మార్గం అనే భావం పెంపొందింది. శాస్త్రీయ పరిశోధనావధులకు అతీతమైన ప్రతిదాన్నీ ఉపేక్షించి త్రోసిరాజనే స్థితి వచ్చింది.

ఇంతే కాదు; గత మూడు దశాబ్దులలోనూ శాస్త్రీయవిజ్ఞానం సాంకేతిక విజ్ఞానరంగంలో (టెక్నికల్) సాధించిన విజయపరంపర మానవ జీవితాన్ని గురించి మనకున్న అభిప్రాయాలన్నిటినీ సంపూర్ణంగా మార్చివేసింది. దీంతో జీవులను కూడా యంత్రాలుగా పరిగణించే స్థితి యేర్పడ్డది. ఈ సజీవ యంత్రాలు నిజానికి చాలా ఉత్కృష్టమైనవే—కాని ఇటీవల వ్యాప్తిలోకి వచ్చిన, 'స్వయంచోదక మారణ యంత్రాల'కు మించి వీటిలో వున్న అలౌకికత మరేమీ లేదు. యంత్రాలు సజీవయంత్రాల నమూనాలో దినదినం అభివృద్ధి చెందుతున్నయ్. ఒకపక్క శిశువులాంటియంత్రాన్నే శాస్త్రవేత్తలు యథాతథంగా తయారుచేసి అక్కడ పెట్టి జీవసృష్టిలో వున్న తమాషానంతా బట్టబయలు చేసే స్థితి వస్తుందేమో ఎవరు చూచాం! మనిషికి '[illegible]', అధిగమించరాని అఘాతం వుందనే విషయాన్ని యీనాడు చాలామంది అర్థం చేసుకోలేరు. అచేతన యంత్రాలు పనిచేయటంలో యేదైనా అస్తవ్యస్తత వస్తే సాంకేతిక విద్యానిపుణులు దాన్ని మరమ్మత్తుచేసి యెలా సరిచేస్తారో అలాగే చేతనయంత్రాలలోకూడా తేడా యేదైనా కనిపించితే దాన్నికూడా సాంకేతిక నిపుణులు మరమ్మత్తుచేసి దారిన బెట్టగలరు అనే భావం జనంలో నాటుకుంది. పేగుల్లో యేదైనా జబ్బు పుడితే వైద్యుడు ఎలా బాగుచేస్తున్నాడో మానసికమైన జబ్బు ఏదైనా పుడితే మానసిక శాస్త్రవేత్త (సైకాలజిస్టు) అలా బాగుచేయగలడు. కార్బ్యురేటరు చెడిపోతే మరమ్మత్తు చేయటానికీ దీనికీ పెద్ద తేడా యేమీ లేదు—ఇదీ నేటి బజారుమనుషులందరి ధోరణీ.

ఈ వెర్రియొక్క వైపరీత్యం, మరీ అమెరికాలో చూడాలి! మానసిక చికిత్సా ఉన్మాదం అక్కడ వెర్రితలలు వేసిపోయింది.

మీరొక కవిగాని చిత్రకారుడుగాని అనుకోండి. అమెరికావాడు మీకు వేసే మొదటిప్రశ్న—'మీచేత కవిత్వం వ్రాయించుతున్న మీలోని మానసిక

* కొండర్ సే—ఫ్రెంచి వేదాంతి, గణిత శాస్త్రవేత్త. 1743—94.

వ్యాధి యేమిటి?--మీ చేత బొమ్మలు వేయించుతున్న మేధాజాడ్యం ఏమిటి?'—మీరు వెంటనే సమాధానం చెప్పలేక కొంచెం తటపటాయించి జాగుచేస్తారనుకోండి; అలా జాగుచేయటంకూడా మరోరకం వ్యాధికి లక్షణమనేస్తాడు. మీరు కొంచెం మందకొడిగా కనుపించుతారనుకోండి ఆ మానసిక శాస్త్రవేత్త అత్యంతస్నేహభావంతో మిమ్మల్ని అనునయించుతాడు! 'దయవుంచి మీ అవ్యక్త మానసంలో యేమున్నదో బయటికి వెలార్చండి' అంటూ వత్తిడి చేస్తాడు. ఎడనెడా ఈ రకం మేధావైద్యులదగ్గిరికి వెళ్ళి మానసికస్థితిని మరమ్మతు చేయించుకు వస్తూ వుండటం అమెరికాలో యిప్పుడు అదో ఫాషన్.

ఈరకంగా అంతరాత్మ మనుగడకూడా ఆరోగ్య శాస్త్రసూత్రాల అవధికి యీడ్చివేయబడి, సురుచిరమైనదాని లాలిత్యం వేధింపబడుతోంది. మేధావైద్యుడు కళ్లాలు చేత్తోబుచ్చుకుని యెటు రమ్మంటే, మన అంతరాత్మ గుఱ్ఱంలా అటు నడుస్తుంది! ఈ పొగరుబోతుగుఱ్ఱాన్ని దారికి తేవటానికి మనం యేమీ చెయ్యనక్కర్లేదు—దాన్ని మేధావైద్యుడికి వప్పగింత పెట్టేస్తే చాలు. మూడునిమిషాల్లో దాని జబ్బులన్నీ వదలగొట్టేస్తాడు; మర్నాడు ఉదయాన్నుంచీ మనం ఉల్లాసంగా వుండటానికీ, స్నేహితులతో సంతోషంగా కాలం గడపటానికీ, మనపనులు మనం చక్కగా నిర్వర్తించుకోవటానికి అవసరమైన మనస్థితినంతా ప్రసాదించేస్తాడు. ఒక్క అంతరాత్మ విషయమే కాదు. ఇక వృద్ధాప్యమునుగురించికూడా మనం యెక్కువ బెంగపడాలిసిన పని లేదు. శాస్త్ర విజ్ఞాన వేత్తలు దాని తడాఖా కూడా త్వరలోనే కనుక్కుంటారు. వైద్యశాస్త్రపరిశోధన ఇక ఒక అంగ ముందుకు వేస్తే చాలు దాన్నికూడా జయించి పారేస్తాం.

ఈనాడు మానవజాతిలోని అధికభాగంయొక్క ఊహాలు ఈ రకంగా ఉంటున్నాయి.

'ఇది ఉపజ్ఞా విజయం. ఈ ఉపజ్ఞను ఇదే విధముగా సమస్త రంగాలలోకీ—రాజకీయాలూ, స్త్రీపురుష వాంఛ, సాంఘిక వ్యవస్థ—ఒకటేమిటి మానవ జీవితానికి సంబంధించిన సమస్త రంగాలలోకీ ప్రసరింపజేసి తార్కికజ్ఞానంయొక్క సమగ్ర విజయాన్ని సాధించాలి. ఒక నూతనజగత్తును నిర్మించాలి. ఆ జగత్తులో మనకి అర్థం కానిదంటూ ఏమీ వుండదు. వుండకూడదు.

ఈ ఆత్మవిశ్వాస శిరస్త్రాణం తగిలించుకుని అమెరికావాళ్లు ఉల్లాసాన్నీ, వాత్సల్యాన్నీ, నిర్వ్యాజమైన నిరాడంబరతను అలవరచుకుని, తమ దేశాన్ని చూడవచ్చిన యూరపియన్ మిత్రులకందరికీ కూడా సమ్మోహనరూపాలలో కనుపించి ఆనందపరవశులను చేస్తున్నారు. కాని దురదృష్టవశాత్తూ ఆ శిరస్త్రాణం క్రిందనే అవివేకం వెర్రిజడలు వేసి పెరుగుతోంది. అమెరికా పత్రికల అట్టలమీద దిన దినం మనకు ప్రత్యక్షమవుతూండే సినీతారల చిరునవ్వుల్లోనూ విలాసినుల చిరునవ్వుల్లోనూ ఈ వివేకభ్రష్టత వెల్లివిరిసి కనుపించుతూ వుంటుంది.

## 7

నేను ఇది వ్రాస్తున్న యీ సమయంలో, మలయాలోనూ, ఇండొనీషియాలోనూ తీసిన కొన్ని ఛాయాచిత్రాలిప్పుడు నాముందు వున్నాయి. ఆ ముఖాల వైఖరే వేరు. యుక్తాయుక్త పరిజ్ఞానం స్థాయీభావాన్నందుకుని నిష్కల్మషులై మృదుత్వాన్ని అవధరించిన ముచ్చటలొలికే సౌందర్యమూర్తులు. వ్యగ్రభావ వైకల్య రహితమైన నిర్మలత, సంయమన సంశోభితమైన ముగ్ధమోహనత్వం, సుశిక్షితమైన వ్యక్తిత్వగరిమ. ఈ స్థాయీభావమే జపాను భారతదేశ దేవదాసీ నట్టువరాండ్ర ముఖ విన్యాసాలలో మనకు ద్యోతమానమై మనని అలౌకికానంద పరవశులను చేస్తున్నది. వీరి విషయమే కాదు దేవతారాధన నిమిత్తకమైన ప్రాచీనసంప్రదాయం ఎక్కడ మిగిలివున్నా అక్కడెల్లా ఈ అలౌకికసౌందర్యం మనకు గోచరిస్తుంది.

ఈ స్థాయీభావం మనలో నశించిపోయింది. వ్యక్తిగత సాధనల ఫలితంగా ఒకరిద్దరిలో ఎక్కడైనా రేఖగా ఇది కనుపించినా అది లెక్కలోనిది కాదు. జాతీయమైన శోభగా అది నశించిపోయింది.

ఆధ్యాత్మికమైన అసభ్యత అంటే కేవలం మూఢత్వమనే అనుకోనక్కరలేదు. కాని వాటి రెంటికీ గల పరస్పర సంబంధాన్నిగురించి యింత తీవ్రంగా ఉద్ఘాటించటానికి తగిన కారణం లేకపోలేదు. ఏమిటంటే అసభ్యతకు ఆలవాలమైన స్వాహం

కొరత మాధులలో నే ఎక్కువ ద్యోతమానంగా కనుపించుతుంది. ఇది కాపురుషుని ప్రధానలక్షణం. దానికి అదుపని కాని, సిగ్గొగ్గులని గాని వుండవు. పశుహృదయానికి ప్రతిచిహ్నం. దాన్ని ఏమాత్రం కదిలించినా అది విరుచుకుపడి ఎదటవాడిని అగౌరవపరుస్తుంది. ఈరకం మనిషి తన అవధులకు మించి దేన్నీ అవగతం చేసుకోలేడు. అలాంటిది ఏదైనా వున్నట్టు అనుమానం తగిలినా అది ఎందుకున్నదా అని ఊరికే వ్యథచెందుతాడే గాని దాన్ని అవగతం చేసుకో ప్రయత్నించడు. స్థూలరూపంలో అసభ్యతను అవగతం చేసుకోవాలంటే ఈరకం వ్యక్తి దానికి ప్రత్యక్ష స్వరూపం.

అజ్ఞానులకే కాక విజ్ఞానవేత్తలకు సంబంధించిన అసభ్యత కూడా వుంటుంది. జాగ్రత్తగా పరిశీలించితే అజ్ఞానిలో వుండే అసభ్యతకూ ఈరకం విజ్ఞానులలో వుండే అసభ్యతకూ మూలం ఒకటేనని తేలుతుంది. పైన చెప్పిన అజ్ఞానిలో కూడా కొన్ని తెలివితేటలుండవచ్చు కాని వాటిని ఆదరించే సాంఘికపరిస్థితులు లేక అణచివేయబడి అతనిలోని అసభ్యతా స్వభావాన్ని రెచ్చగొట్టి వుండవచ్చు; ఆ స్వభావం అతనికున్న కాస్త ప్రతిభనూ కూడా హత్యచేసి వుండవచ్చు.

ఇలాగే అసభ్యస్వభావం కొందరు తెలివిగల వాళ్లనుకూడా ఆవేశించి వాళ్ల మేధాశక్తిని సంకోచపరుస్తుంది. మానవవిజ్ఞానంలోని ఒక ప్రత్యేకశాఖలో కృషిచేసే పండితుడుంటాడు. అతనికి దాని అవధులనుదాటి ఆలోచించగల మనశ్శక్తి నశించుతుంది. తనశాఖకు సమగ్రమైన మానవవిజ్ఞానానికీ వున్న సంబంధమేమిటో గ్రహించలేకపోతాడు.

పై విషయాలనన్నిటినీ ఇప్పుడు సమన్వయపరచి చూసుకుందాం. అసభ్యత అనేది చారిత్రక పరిణామంగా ఉత్పన్నమైనదని చెప్పుకున్నాం. మానవునిలో ఉపజ్ఞ యేనాడు ఉదయమైందో దాంతోపాటే ఇదీ ప్రభవించిందనీ మానవుని స్వతంత్ర యోజనతోపాటే ఇదీ దినదినప్రవర్ధమానమవుతూ వ్యక్తిగతాభిప్రాయ స్వాతంత్ర్యాన్ని ఆశ్రయించుకుని పరిణామదశనందుకున్నదన్నాం. మనిషిలోనూ జాతిలోనూ వున్న అసభ్యస్వభావాన్ని పెంపొందించటానికి పైన వివరించిన వాతావరణం దోహదకారి అనేమాట నిజమే అయినా, బాహ్యరంగంలో వ్యక్తిని అసభ్యంగా వ్యవహరించేట్టు చేయటానికి ఈ వాతావరణం ఒక్కటే చాలదు. వ్యక్తిగతంగా అతనిశీలాన్ని అంటిపెట్టుకునివున్న దోసములుకూడా యేవో కొన్ని వుండాలి.

'వ్యక్తిని అసభ్యంగా ప్రవర్తింపచేసే దుర్గుణాలు ఏమిటి'ని నేను చాలామందిని అడిగాను. తడుముకోకుండా ఒకస్త్రీ 'సౌజన్యహీనత' అన్నది. నిజంగా ఇది ఎంతో ఉత్తమమైన సమాధానం.

సౌజన్యతాలేశంవున్నవాడెవడూ — అవతలవాడి మనస్థితి ఎలావున్నదో తెలుసుకోకుండా, అతను ఏమనుకుంటాడో ఆలోచించకుండా — తన అభిప్రాయాలను అవతలవాడిమీద వేసి రుద్దటానికి ప్రయత్నించడు.

మరొక రాజకీయవేత్త చెప్పిన సమాధానం: 'గౌరవమర్యాదలు తెలియకపోవటం' అని. ఇలా అనటంలో ఆయన అభిప్రాయం, శంకాప్రవృత్తి అని కాని, విప్లవస్వభావమని గాని కాదు. 'తన అవధులకు మించి ఇతరత్రా గౌరవించదగినవి వుంటాయని ఊహించలేని అజ్ఞానం' అని మాత్రమే ఆయన అభిప్రాయం. పైన వివరించిన చారిత్రక పరిణామ వాతావరణంవల్లా, వ్యక్తిలో వుండే ఈరకం దుర్గుణాలవల్లా చేతగాని తనం ప్రభవించుతుంది.

పరిశ్రమల వల్ల అసభ్యత పెరిగిందని తరచు అంటూ వుంటారు. ఒకే నాటు సమూనాలో భారీ యెత్తున చవకపారు వస్తువులు తయారుచేసి జనంమీద వేసి రుద్దటంవల్ల ప్రజల అభిరుచులు అధోగతిపాలైనాయంటారు. ఇంతేకాక హృదయమనేదానికి తావు లేకుండా పారిశ్రామికులు అమలు జరుపుతున్న అవాచకపు వాణిజ్య విధానాలవల్ల ప్రజానీకంలో అసభ్య స్వభావాలు పెరుగుతున్నాయంటున్నారు.

ఏది యేమైనా అభిరుచుల నేటి నాశనమైనమాట ముమ్మాటికీ నిజం. ఒక్క సామాన్య ప్రజా బాహుళ్యంలో నేకాదు. చర్చిలో, మధ్యతరగతి గృహాల్లో వుండే కళాఖండాల్లో, ఎక్కడబడితే అక్కడ మనకీ సత్యం బోధపడుతుంది. 'ఏ వస్తువైనా వేడార్థణా'

దుకాణంలో దగ్గిరనుంచీ గోరీల దొడ్డిలో దాకా ఎక్కడ చూచినా యీ మొండి బాణీ మనకర్థ మౌతుంది.

యూరపులోనూ అమెరికాలోనూ కూడా ఈవిధంగా పతనమైపోయిన ప్రజల అభిరుచిని సంస్కరించి, ఉన్నతిస్థాయికి తేవటానికి అనేక సంఘాలు ఏర్పడి ప్రచారం చేస్తున్నయ్. అయితే యీ ప్రచారకులు ముఖ్యంగా గమనించవలసిన విషయం ఒకటి వుంది. ఈ అధోగతికి గల బాధ్యతను యాంత్రిక భారీ ఉత్పత్తులమీద తోసి లాభం లేదు. యంత్రాలమీదకూడా సుందరమైన నమూనాలలో భారీయెత్తున ఉత్పత్తులు చేయవచ్చు. అసలు ఇలాంటి అసభ్య నమూనాలు తయారుకావటానికి మూలకారణ మేమిటి? దీనికి సమాధానం చెబితే ఈ ప్రచారకులకు చాలా నిరుత్సాహజనకంగా వుండవచ్చు. నిజానికి ఈ అసభ్యత వున్న దెక్కడ? యంత్రాలలోనా? లేదు — మానవాత్మలో! ఇక నాటురకం భారీ ఉత్పత్తులు చేస్తున్నది దానికి దోహదం చేసి పెంపొందించటం.

పూర్వం అంతా చాలా బాగుండేదనీ యిప్పుడంతా చెడిపోయిందనీ వాపోయే పంథా ఇదే ఒక నైరాశ్యవాదమని దీన్నంతా త్రోసిరాజనటం చాలా తేలికే. పూర్వంవాళ్ళల్లో వున్న అసభ్యతను మించి యిప్పుడు మనకేమీ ఇక్కడ లేదు అని భుజాలు ఎగర వేసుకుంటే ఎగరవేసుకోవచ్చు. కాని - ప్రాచీన యుగంలోనూ మధ్యయుగంలోనూ వున్న 'అసభ్య వ్యక్తు'లను గురించి మనకు ఏం తెలుసు? ఎంత తెలుసు? దాన్ని నిరూపించటానికి మనకి మిగిలివున్న తార్కాణా లేమిటి?

నిజానికి ఆనాటి వ్యక్తులనుగురించి మనకేమీ తెలియదు. కాని వారు సృజించినవిమాత్రం మిగిలి వున్నయ్. ఆ సాక్ష్యం మనకు చాలు. ఒక్క కళారంగాన్నే తీసుకుంటే ఈ సాక్ష్యం చాలకపోవచ్చు. కాని చారిత్రకపరిశోధకుల పుణ్యమా అని, ప్రాచీనులు దినదినం వాడుకునే అనేకవస్తువులుకూడ భూగర్భంనుంచి బయటపడుతున్నయ్. చరిత్ర గమనంలో ఆయా యుగాలలో తయారైన ఆయావస్తువుల నమూనాలు మనయెదుట వున్నయ్. ఏ యుగపు సభ్యత యేమిటో ఏ యుగపు అసభ్యత యేమిటో మనకు తెలిసిపోతోంది. ఈజిప్టు ప్రాచీన సభ్యత ఏమిటో మనకు దృగ్గోచరమౌతోంది. గ్రీకుల ప్రాచీనసభ్యత యేమిటో తెలుసు. వాటితో పోల్చిచూస్తే ఈనాటి పాశ్చాత్య ప్రపంచసభ్యతాస్థితి ఎంత అధోగతిలో వుందో మొహంమీద కొట్టినట్టు తెలిసిపోతోంది. ఈ పరిస్థితి యింకా బాగా బోధపడాలంటే, ద్వితీయశ్రేణి మధ్యమతరగతుల గృహాల్లోవుండే వస్తుసంచయాన్ని ఒకచోట సమీకరించి మ్యూజియంలో వుంచితే నేటి మన నాగరకతా సభ్యతల అధోగతి అంతా తేటతెల్లమౌతుంది. మన అభిరుచులు ఎంత నీచాతినీచంగా దిగజారిపోయాయో స్పష్టమౌతుంది. నిజానికి మానవచరిత్రలో ఇలాంటి దుస్థితి ఎన్నడూ సంఘటించలేదు. ఈ దుస్థితిని వ్యక్తం చెయ్యటానికే, 18 శతాబ్ది చివరిదశకు వచ్చేటప్పటికి 'అసభ్యత' అనే యీ ఘాటయిన పదాన్ని వాడవలసి వచ్చింది. అంతకు పూర్వ మెన్నడూ యీ పదం వాడవలసిన అవసరం కలుగలేదు

* 'ఎన్‌కౌంటర్' పత్రిక సౌజన్యంతో *

# దానవుడు - మానవుడు

ము ర యా

ఊరిలోని వారాతని మీరు దొరలు - కరుణతో నేలి మమ్ములఁ గావుడనఁగ
కోరమీసాల నెగదట్టి కోపగించి - ఉరక దూరుచుఁ గ్రౌర్యంబు నెరపుచుండు.

దొరకుఁ గలదు విశాలమౌ దుర్గమొకటి - ఊరనున్నట్టి కడు పేదవారి నెల్ల
రాచి రంపానఁ బెట్టుచు దాచినట్టి - ధనము ధాన్యాలరాసులే దానియందు.

దానివెన్కఁ గల దోక యుద్యానసీమ - దాడిమీ ఫలంబులఁ దలఁదాల్చియున్న
చాల మామిళ్లబరువుతో వాలియున్న - ధరణి రుహముల లెక్కింపఁ దరము కాదు.

అంచు నెందుగానని యందమైన - విరుల నలరారు పొదరిండ్లు పెక్కు గలవు
నల్లకలువలు తామరల్ వెల్లివిరియ - స్వాదు వార్వెచి ముచ్చటౌ సరసి యొకటి.

ఊరు వీడుచు నామడ దూరమేగి - చూచియునుఁ జూడకయె మున్ను గోచరించు
కోటకొమ్ములఁ దోరమై సాటిలేని - కాంతికిరణాలఁ జల్లు బంగారుతొడుగు.

మురిపమెఱుఁగని యాదొర పూవుఁదోట - కాలు వెట్టంగ నెవ్వండు గాని వెఱచు
వలనుపడదు కాకియుఁగూడ వాలనచట - కోకిలమ్మని పొంతలఁ గూయ వెఱచు.

పల్లెవీధుల నాడెడి పిల్లకారు - తోడివారితో నేనేమొ తోఁటలోని
వింతలనుఁ జెప్పుకొనికూడ వెఱపువలన - దాని దరిదాపులకు నేగఁ దలపరెపుడు.

బాల దరహాసచంద్రికాప్రభలు లేని - నవవసంత కోకిలల గానమ్ము లేని
మృగకులమ్ముల నడల సోయగము లేని - వనము వనమంత కనిపించు వ్యర్థముగను.

తోటలో వెన్నెల వెలుంగుబాటలోఁ జ - కోరముల జంట కోరికల్ దీరఁ జేరి
హాయిగా నటనటఁ దిరుగాడ లేదు - జీవకోటిలేక వనికిఁ జెలువు లేదు.

రాజులేని మహాసౌధరాజమట్లు - కవులు లేనట్టి దౌర్భాగ్యకాలమట్లు
వలపు లెన్నఁ డెఱుఁగని జీవనమువోలె - వనము వనమంత కనిపించు వ్యర్థముగను.

అడవిగాచిన వెన్నెల యంద మట్లు - అరుణకాంతిలేని తరుణి యధర మట్లు
వీనులకు విందుఁ గూర్పని గాన మట్లు - వనము వనమంత కనిపించు వ్యర్థముగను.

కనక వస్తు వాహనములు కలవు దొరకు - కలవు వెలలేని రతనాల గనుల గములు
కలరు కను సన్నల మెలంగి వలయు పనులఁ - జేసి పడిగాపుఁ గాచెడి దాస జనులు.

కలవు నాకపురీశు సౌఖ్యాలు నాకు - కలదు ధనము కుబేరుని కన్న మిన్న
ఎదురు పల్కంగ నోడుదు రెవ్వరేని - అంచు బింకానఁ దలపోయు నాతఁ డెపుడు.

తనకుఁ గల లోపమేమని తన్నుఁ దాన - అడుగు, అడుగు, నాత్మీయుల నడిగి యడిగి
లోప మేదియు లేదని లోఁదలంచు - కాని యెదియొ లేనట్లు వైక్లబ్యమందు.

చేరఁ దీయడు పిల్లల, వారి నెపుడు - పోవనీయఁడు పూఁదోట పొంతకేని
పండి యెండ నిచ్చును గాని పండ్ల నెపుడు - ఇంద మని పిల్లవానికే నీయఁ డతడు.

పశులకై నాల్గు పచ్చిక పఱక లేని - కోయనీయఁడు తోఁటలో కుటిలుఁ డతఁడు,
వలలఁ బన్నును పక్షులు వాలు నంచు - కాకి నేనియు వాలినఁ గాల్చి చంపు.

బలమును రయమ్ము గల్గిన బదిగుఱాలు - ప్రళయ మారుత వేగాన, బరువులెత్త
నరుగుచుండును బండిలో నాతఁ డెపుడు - పల్లె వీధుల పిల్లల తల్లు లడర.

నురువుఁ గ్రక్కుచు వేగానఁ బరువు లెత్తు - అశ్వమేదేని ఎన్నడే నాగెనేని
దానిఁ బట్టించి హింసించి త్రాళ్ళఁ గట్టి - బల్లెమున గ్రుచ్చి దూరానఁ బారవేయు.

మంద మద గమనమ్ముల మహిమఁ జూపి - ప్రబ్బ పొదలలోఁ డాగుచుఁ బరుగు లెత్తి
ఏటి నీరమ్ము త్రాగెడి లేడిపిల్ల - చూచి వలపన్ని యెల యించి స్రుక్కఁజేయు.

కొండలోయల విహరించి గుహాలలోన - స్వేచ్ఛమై నివసించెడి సింహములను
పెక్కు మృగములఁ దునుమాడు, పెద్దపులులఁ - బట్టి తెప్పించి బోనులపెట్టి పెంచు.

అట్టివానికి సుంత ఆహారమిడక - ఆకలిం గొన్న వాని బిట్టలయఁజేసి
బెదరు లేళ్లను బోనుల విసరికొట్టి - మనసుతీరంగ నానందమగ్నుఁ డగును.

ఎంతయు నారయన్నతని యింగిత మేరికి గోచరింప దే
కాంతమునందుఁ గూడ తన స్వాంతములోఁ గడు దుష్టయత్నముల్
సంతత మాచరింపగను సంతసమందుచు నూహ సేయు—నొ
క్కింతయు జాలిరాదతని కెంతటి పాపమునైనఁ జేయువో.

## 4

వచ్చె నెటనుండియో గాని బాలుఁ డొకడు - తెచ్చెఁ దన వెంటఁ దోడుగా ధృతిబలమ్ము
చేర్చె నొకచోటఁ బిల్లలఁ జెలిమిఁ జేసి - కోయనొప్పించె దోటలోఁ గాయలతడు.

దొరయు నూరువీడి యిపుడె తరలిపోయె - నిదియ తరుణమ్ము-మనకు జాగేలయనుచు
గుసగుసలపోవుచును వారు గుంపుగూడి - వెసవెసం జనిరంతలో భీతి విడచి.

హాయిహాయిగా తోఁటలో నాడుకొనుచు - అందిన ఫలాలఁ దినుచు నానంద మొంది
విరియఁబూఁచిన నందాల విరులఁ గోసి - ప్రోవుఁ బోసిరి వెంటఁ గొంపోదమంచు.

ముద్దుముద్దుగా దాగుడుమూఁతలాడు - ముద్దమందారములు - తెల్ల మొగలిపూలు
బొడ్డు మల్లియలును, క్రొత్త పొగడపూలు - విరిసి విప్పారి ముంచెత్తెఁ బరిమళముల.

ఆవనమ్మున శుక పికా రావములును - పూల తీవల చిత్రపూ పోకడలును
చిన్ని వారల గారాల చిలిపి తనము - వన్నె తెచ్చిన నొక వింత చెన్నుఁ దాల్చె.

ఎన్నినాళ్ళకుఁ బూఁదోఁట కింపు వచ్చె - నోయని కలస్వరమ్ములఁ గోయిలమ్మ
దూరమున నుండి గాన మాధుర్య మెసఁగ - పాడు కొంచును వేవేగ చూడవచ్చె.

తలిరుటాకుల రవి తళ త్తళల మెరపు - పాళి విరచిత శిఖి పించ మంజిమ మని
భ్రాంతి గొల్పెడి వేళ లతాంత వితతి - కన్నెరికమూఁచి యేతెంచె గంధవహుఁడు

పరిమళ సమేత శీతల పవనములును - చలువలెగఁజిమ్ము కోమలచంద్రికలును
కుహూ కుహూయని పాటల కోయిలలును - కలసి తోఁద్రోపులాడుచుఁ గదలివచ్చె.

పూల పొదరిండ్లమాటునఁ బొంచియాఁగి - పూల గుత్తులతోడ దోబూచులాడి
తోఁటబాటల మలపులఁ దూలి నిలిచి అల్లనల్లన నరుదెంచెఁ బిల్లగాలి.

సరసవన కేళికా మహోత్సాహమునకు - చారుశీతల పవన సంచారమునకు
పండు మామిళ్ళ కమ్మని వాసనలకు - వెఱ్ఱిబాగులవారయో వివశులైరి.

ఆటఁజాలించిపోదమా యనెడివారు - ప్రోగుఁజేసిన పూలను మూటఁగట్టి
అవల కేరితిఁ జేర్తుమో యనెడివారు - తోడివారల నదలింపఁదొడఁగిరంత.

అదె యిదె వచ్చె వచ్చెను నరాధము డెల్లెడధూళి రేపుచున్.
పదడు పదండు ఆవలికి, బారుడు బాలకులార వేగమై
చదుపును మిమ్ము నెల్లరను జాగిట సేయకుడంచు మాలియున్
బెదరు నెడంద బాపుచును బిట్టఱచెన్ పరుగెత్తివచ్చుచున్.

పక్షిచయమందు దంభోళి పడ్డ యట్లు - బెదరిపారిరి బాలకుల్ చెదరిపోయి
పేరు పేరున నొండొరు, బిల్చికొంచు - గోడదాటిరి చాల గగ్గోలు పడుచు.

గట్టులం ద్రెంచి యుద్ధతి గ్రామసీమ - లల్ల కల్లోలములుగాఁగ నరుగుదెంచు
పొంగిన మహా ప్రవాహ విస్ఫూర్తియడర - రభసమున నేగుదెంచెనా రాక్షసుండు.

తాడియొక్కటి వే నడయాడినట్లు - ప్రళయ దుస్సహభీకరభాసమాన
రూక్షవీక్షణ వికట స్వరూపియగుచుఁ - గదలివచ్చెను కోపవేగమున నతఁడు.

కలయఁజూచెను వనమంత క్షణములోన - నంత సుడిగాలి వలెఁ దిరుగాడె నచట
ఇందుఁజొచ్చిన దెవడురా యెవ్వడంచు - భూనభోంత సీమ మార్మ్రోగనార్చె.

స శే ష ము

సీరియల్

# జయాపజయాలు

## "శాండిల"

* గతసంచిక తరువాయి

అన్న మాట నిలుపుకున్నాడు అయ్యరు. వరహాలుకు అరుగజాల వాయిలు చీర కొనిపెట్టి, సంక్రాంతి పండుక్కి మూడు రోజులు ఆటవిడుపు ఇచ్చాడు. పచ్చని వాయిలు చీర గట్టుకుని, జార్జెటు రవికె తొడుక్కుని వీధిన వెళుతున్న వరహాల్ని చూసి అందరికీ కళ్లు కుట్టాయి. సంఘానికెంత అసూయ! పొరుగున పొగులుతున్న వాడికి తను ఇంత పెట్టదు. పెట్టకూడ దంటుంది పెరవాళ్లు. స్వతహాగా మనం సంపాదించుకు తింటూంటే గుండెల్లో నిప్పులోసుకుం టుంది. వసంతంలో సీతాకోక చిలుకలాగ ఆ కన్నె పశుచు రాజబాటన నడుస్తూంటే ఏక దుగ్ధే ఇరుగు పొరుగులకి. "గాదికింద పందికొక్కు గాదిలో తినే బతకాలి. పట్టినా మానినా చింతకొమ్మను బట్టాలి గాని ములగకొమ్మ ఏం లాభం? ఇటు అటు ఇక్కడ తన కెవరూ లేని ఆ అయ్యరు కుర్రాడుమాత్రం ఊరికే పెంచుతున్నాడా దీన్ని గువ్వపిట్టలాగ ఏ ఆశా లేకుండా? అది తెలుస్తుందిగా—కుమ్మరాడి పెళ్లాం పెళ్ళినాడు గాకపోయినా పెంకులు ఏరేనాడైనా కనబడదూ?" ఇంకా ఇలాంటివాటితోటే తలుపుల చాటున బుగ్గలు నొక్కుకున్నారు.

అలా గాలాగ నడిచి హోటలు ముందునుంచి మన్మథ బాణంలాగ దూసుకుపోయిన వరహాల్ని చూస్తూంటే, సంక్రాంతికి కట్టేసిన హోటలు హాల్లో పేకాడుతున్న పెద్దింటి యువకుల పేకముక్కలు తికమకగా పడుతున్నాయి చాపమీద. అయ్యరు ఆడడం లేదు. ఆమె దెసకు నిగిడ్చిన చూపులతో నిశ్చేష్టుడై పోయాడు. కనుమాపు మేర దాటింది వరహాలు. మొగంలో కొద్ది నిమిషాలదాకా ఆనవాలు పటలేక పోయాడు. తర్వాత తన కళ్లు తానే నమ్మలేకపో యాడు. "నీ హోటల్లో కప్పులు కడిగేదే గాదుటయ్యా! రోజూ చూస్తున్నదేగా—అలా మతి పోగొట్టుకుంటా వేం?" అని బిగ్గరగా అదలిస్తూ చౌదరీగారబ్బాయి చురుక్కు మనిపించడంతో ప్రస్తుతంలోకి వచ్చాడు అయ్యరు. చౌదరీ కుటుంబం వూళ్లో దొడ్డది. వాళ్లు పెద్దకాపులు. ఊళ్లో అందరికీ వాళ్ళంటే హడల్. పాపం! అయ్యరు కిక్కురుమనకుండా గదిలోకి జారుకున్నాడు. పట్టుబడిపోయిన దొంగలాగ బిక్కమొగ మేసి మంచంమీద వాలిపోయాడు. ఇంకా హాల్లో కుర్రకారు వరహాల్ని గురించి హాస్యంగా, రసవత్తర వ్యాఖ్యానం సాగిస్తున్నారు. "మాంచి యమకంలో వుందిరా—పిల్లంటే" ఇది షావుకారు కంఠం. "రంభ రాజవీధిన రంగురంగుల కోకగట్టుకు తళుకు తళుకుమని పిస్తూ హంసనడక సాగిస్తున్నట్లు నా కళ్లు జిగేలు మంటున్నాయంటే ఇంకా—నమ్మ" చౌదరీగారి కుమారుని వర్ణన. "ఎంత పోషణ లేకపోతేనేంరా—లేత గులాబీ చాయ కొట్టొస్తోంది గాదూ— ఊరికే అన్నార్రా "వయసు కులుకో—బాతు కులుకో" అని ఇంకా తన్ను దిగ్భ్రమ నొందించే రసభరితవ్యాఖ్యలు సాగుతూనే ఉన్నాయి. అయ్యరుకు ఇది గుండెగాల మయ్యింది. పాతికేళ్ళ మున్య ఇలాంటి దెబ్బ తగల్లేదు. వాళ్లు వరహాల్ని వర్ణిస్తున్నకొద్దీ తనలో ఈసు పూసు కుంటోంది. తనకే గనుక సామర్థ్యం వుంటే వాళ్లం దర్నీ ఆ క్షణంలో వలలాంకుడు ఉపకీచకుల్ని చేతు లతో మర్దించి చంపినట్లు పచ్చడి చేసేసేవాడు. తనకే హక్కున్న ఒక అపూర్వ వస్తువుపై వాళ్లు కన్నేసి నట్లు పళ్లు పిండుకున్నాడు.—'అయ్యరూ! బాగా

ఆలోచించుకో. నీకు మాత్రం ఆమెపై ఏమి హక్కున్నదోయి? డబ్బు ఇచ్చి చాకిరీ చేయించుకుంటున్నావు వరహాలు చేత. నీవు అనుకుంటున్నావు ఆమె "నా బానిస—దాసి" అని. భ్రమ. ఇది త్వరగా వదిలిపెట్టు. వదులుకోవూ—నీ వినాశనం తథ్యం—' వాళ్ళపై క్రోధం వరహాలంటే తనకున్న అవాంఛనీయమైన మక్కువకే మద్దతు నిచ్చింది.

సాయంత్రమయ్యింది. హాలు ఖాళీచేసి ఎక్కడి వాళ్ళక్కడకు జారుకున్నారు. ప్రతి వొక్కడి గుండెలోను అయ్యగారుకు వలెనే ఆ బాణం లోతుగా గుచ్చుకుంది. లేకపోతే అంతకూ మందమతులై, మొద్దువారిన మెదళ్ళతో జాగ్రదావస్థను వీడి తను తను సామాన్లు అక్కడే మఱచిపోతారా? అయ్యగారుకు ఒక స్పిరిట్ సిగర్లైటూ, ఒక సిగరెట్టుపెట్టి, కండువా దొరికాయి. ఔరా! పృథ్విలో యౌవ్వనంలో తన కుండే కులుకుతో, ఖుషీగా ఆడిపాడి తిరగడానికి నోచుకోలేదూ? అవాళ అలాగ ఎందరు యువకులు ఈ జబ్బు సోకబెట్టుకు క్రుంగిపోయారు? మరు నాటినుండి ఆ పనుచే కేంద్రంగా తను కార్యకలాపాలు మార్చుకోవాలని ఎంత తాపత్రయపడ్డారు! అయ్యగారుకు మాత్రం అసలు ఏమీ తోచడం లేదు. ఎక్కడచూచినా వరహాలే ప్రత్యక్షమౌతున్నట్లుంది. ప్రపంచమందంతటా వరహాలే అలుముకొని అతన్ని దహించివేస్తున్నట్లు మననపడుతున్నాడు.

రాత్రి పదిగంటలవేళ. "అయ్యగారూ" అని నిద్రపోని అయ్యగారును లేపింది వరహాలు నిద్రగాని నిద్రలోంచి. వాంఛా ప్రకోపితమై అతని దేహం కాలిపోతోంది. వీధి తలుపులు తెరువబడివున్నాయి. అతి శీతల హేమంత వాయువులు అతని అనాచ్ఛాదిత దేహాన్ని పలుదని మంచుతెరల్లో కప్పాలని ఎంత ప్రయత్నించి దాన్ని తాకి ఆవిరి యౌతున్నాయో! వరహాలు పిలుపు మహా మధురంగా వినిపించింది. నిన్నటిదాకా ఆ మధురాతి మధురమంజుల కోమల కోయిలస్వరం ఏ చీకటికోణంలో ప్రతిస్వనిస్తోందో! ఎదుటి పరిస్థితులు అసలు మారవు. వాటిలో మార్పులున్నా అవి అతి సహజమైన పరిణామాలు. మనసు వాటిని ఆకళింకొనే ధోరణీ, వాటిని తిలకించే రీతీ మనకుగా మనం మార్చుకొని విప్లవంకాని విప్లవాన్ని చేజేతులా సృష్టించుకుని ఆ అగ్నికి ఇంధనమైపోతాం. అయ్యగారూ మనవంటివాడే

"వరహాలూ!" బరువైన కంఠంతో పిలిచాడు. "ఏమండీ" అంటూ లోనికి నడిచింది. చీకటిగూడా ఆమె కళ్ళల్లో మెరుస్తోంది.

"ఇంత రాత్రివేళ ఇలా వచ్చావేం" తడబడే స్వరంతో అడిగాడు.

"కొంచెం పనుండి వచ్చాను."

"ఎందుకూ?"

"మా అయ్య ప్రొద్దున్నే ఊరికెళుతున్నాడు. ఏమన్నా పదిరూపాయలుంటే అమ్మ అడిగిరమ్మంది. జీతంలో చూసుకుందురుగాని ఉంటే ఇస్తారా."

అయ్యగారులో ఎంతటి ఆవేదన, ఆతురత, చంచలత, అస్థిరత్వం ఉన్నాయో ఆమెలో అంత నిర్వేదము, నిశ్చలత్వము స్థాయి కుదుర్చుకున్నాయి. అయ్యరు వణకుతూ ఆ చీకటిలోనే సుపరిచితమైన చొక్కా జేబులోని పర్సుదీసి ఒక్కటేవున్న పదిరూపాయల కాగితం ఆమె చేతిలో పెట్టాడు. వరహాలు చీకటిలోనే వేడిగావున్న అతని చేయి తాకి త్రుళ్ళిపడినట్లై "జ్వరమొచ్చిందాండీ!... పండుగపూటా దీపమెట్టుకోలేదూ?" అన్నది. ఆమె ఆడే ప్రతిమాటా అతనిలో ఉష్ణాన్ని క్రమంగా దింపుతున్నాయి "ఉండండి దీపం వెలిగిస్తా"నంటూ గూటి దగ్గరకు వెళ్ళబోయే ఆమెను ఆపి "వరహాలూ! ఇలా గొచ్చి కూర్చుంటావా" అంటూ ప్రార్థనాస్వరంలో అడిగాడు. వరహాలు సందేహిస్తూనే మంచంపై ప్రక్కగా వొదిగి కూర్చుని తన చేతిని అయ్యరు గుండెలమీదవుంచి "అమ్మో! ఉష్ణం ఒళ్ళు కాలిపోతోంది." ఆమె చేతిపై తన చేతినలాగేవుంచి మృదువుగా సున్నితంగా కోమలంగా తన హృదయ స్పందనాన్ని పరీక్షించే ఆమె సన్నని మునివేళ్లను తడిమాడు. "ఆచార్యులుగారిని దీసుకురానా - అయ్యో! పండుగపూటా ఎంత కష్టమూ" అని లేచింది.

"ఫర్వాలేదు. రా—ఇలావచ్చి కూర్చో. అదే తగ్గుతుంది" అన్నాడు అయ్యరు.

ఆమె ఇంకా తన వేదనను గుర్తించలేదు. కాని ఆమె గూడా ఎంతో బాధపడుతోంది. 'అయ్యో!

తన యజమానికి జ్వరం వచ్చిందే—రేపు హోటలు నడవడం ఎలాగ? ఆమెకు దిగులుకూడా జనించింది.

"వరహాలూ! ఇలా చూడు" కళ్ళు ఆమె ముఖం వైపు మళ్ళించాడు.

ఆమె కళ్లు తనలో ఉబికే కన్నీటితో అతని కళ్లను పరీక్షగా చూశాయి.

"ఒక్కమాట చెప్పనా?"

"చెప్పండి"

"ఒద్దులే" అతని గుండె వేగంగా కొట్టుకొంది. చెప్పదలచుకొన్నది వ్యక్తం చేయడానికి సాహసంలేక పోయింది.

"సంకోచించకండి. నా దగ్గిర మీకు దాపరిక మెందుకూ?" ఆమె ఎంతటి అమాయిక!

"మీ నాన్న ఊళ్లో ఉన్నాడా"

"ఇప్పుడేగా చెప్పాను ప్రొద్దున్నే చీకటితో పొరుగూరికి వెళ్లారని"

"ఏ వూరెళ్లారు?"

"మరి...మరి...ఏవూరో నాకేం తెలుసు" వరహాలు ముఖాన్ని సిగ్గు దొంతరలు క్రమ్మాయి.

"పోనీ—ఎందుకో చెబుతానా?" ఓహో! ఎంతటి మాటప్రశ్న! ఆమెను సిగ్గు ఆవహించినట్లు పసికట్టిన అయ్యారు మనస్సు కొంటెం కోసం ప్రాకులాడుతూ ప్రత్యుత్తర మిచ్చే ఆ ముఖకవళికల్ని శరపరంపరలుగా చూపులతో కెలికి వేస్తోంది.

"మరి ... నాకు పెళ్ళికొడుకుని చూడ్డానికి" అంది అనలేక అనలేక చిరునవ్వుతో. అయ్యారుకు గుండె ఆగినంత పనయింది.

"అప్పుడే ఏం తొందరొచ్చిందనీ" అసందర్భపు ప్రశ్న.

"ఇప్పటికి వారం రోజులనుంచి మా అమ్మ అయ్యా ఎముకలూ నమిలేస్తోంది. "ఈడొచ్చిన పిల్ల— ఇంట్లో బెట్టుకుని ఎలా నిద్దర పడుతోందిరి?" అని— అందుకని వెదకడానికి రేపు బయలుదేరుతున్నారు".

"అయితే నీకు పెళ్లి అయిపోతుందన్నమాట"

"ఆఁ—అప్పుడే ఏమయింది—కుదరాలి. మూడు ముళ్లూ పడాలి. అనుకోవాలి. ఇల్లు కట్టి చూడు - పెళ్లి చేసిచూడు అన్నారు"

"నా యెరిగిన ఒక సంబంధం వుంది చూడమన చూపెదూ మీ నాన్ననూ?" వింతగా సంభాషణ మళ్లించాడు. ఆమెలో ఆశాలత చిగురించింది. కళ్లు ఆప్యాయతతో మెరిశాయి.

"చక్కని కుర్రాడు. కొద్దో గొప్పో ఉన్నవాడు. ఎంతలేదన్నా పెళ్లాన్ని పోషించుకోలేక పోడు"

"ఎక్కడున్నాడమ్మా — ఈ వూరిలోనే?" సంతోషం పట్టలేని ప్రశ్న.

"ఆఁ. ఇక్కడే ఉన్నాడు. చెప్పమన్నావా"? హేళనగా అన్నాడు.

"ఊఁ. . చెప్పండి"

"ఉహూ — ఇప్పుడుగాదు. రేపు మీ నాన్నతో చెప్తాను."

"చెప్పకపోతే నా మీద ఒట్టు" బాస చేసింది వరహాలు.

"అబ్బా! ఎంతమాట! అయితే చెబుతాను, నిన్ను నాకిచ్చి పెళ్ళిచెయ్యమని మీ నాన్నను అడుగుతా" అన్నాడు అహూంతం లేస్తూ అయ్యారు.

వరహాలు సిగ్గుతో కళ్లుమూసుకొంది. ఆమెకు ఏమి మాట్లాడాలో తెలియలేదు.

"ఇంకనుంచి ఇలాంటి పరియాచికాలాడకండి. అయ్యారు గారూ! ఎవరేనా విన్నా నాకూ మీకూ మరియాదగాదు" కొంచెం కటువుగా అని లేవబోయింది.

"నిజం. మీకు అభ్యంతరం లేకపోతే నేను నిన్ను పెళ్లి చేసుకుంటా—ఇదిగో—చేతిలో చెయ్యి" అని ఆమె లాక్కుంటున్నా ఆగక వరహాల చేతిలో తన చేతి నుంచాడు అయ్యారు. వరహాలు తన చేతిని లాక్కోలేక పోయింది. కాదు అసత్యం. లాక్కోలేదు—ఇది నిజం. ఆమె తన చేతిని అతని చేతినుండి లాక్కోదలచుకోలేదు. అతన్ని వరహాలు విశ్వసించిందా? ప్రేమించిందా—గౌరవించిందా—ఏదీ లేదేమో! ఎన్నో ఏండ్లుగా స్త్రీ సహజమై తనలో ప్రసుప్తమూ ఈ అవకాశంతో పొటమరించే ఉన్మత్తభావం ఆమెను బంధించి వేసింది. శాశ్వతంగా ఆమె జీవనవిధిని రూపొందించింది ఆ క్షణం. అది మంచిదా? చెడదా? అని అడక్క-

వరహాలు అయ్యారు వలలో పడిపోయింది. ఆతని మాటలన్నీ నిజమని పూర్తిగా నమ్మింది. అతడు తన కిచ్చిన మూడువందల రూపాయలను రెండో కంటివాళ్ళెరక్కుండా దాచుకుంది. చాలా రోజుల దాకా తనకు అయ్యారుకు వున్న సంబంధం తల్లిదండ్రులకు తెలియనియ్యలేదు. జీవితంలో మిశ్రఫలాలను ఊహించగలిగే త్రాణ ఆమె కింకా కలుగలేదు. తన ప్రస్తుతపు బ్రతుకే ఆమెకు ఎంతో హాయిగా సుఖంగా వుంది. వరహాలు తన జీవితమంతటిలోనూ వర్ణింపనలవికాని కమనీయసౌఖ్యం అనుభవించిందంటే ఆ రెండుమూడు నెలల్లోనే—తర్వాత ఆమె అనుకోని భయాలు, బెంగలు, సందేహాలు ఆమెలో ఏదో అతి బలహీన స్థావరాన్ని బలాత్కారంగా లాక్కుని ఆమెను కదపడానికి ప్రయత్నిస్తున్నాయి. లోకం తననూ, అయ్యారును వింతగా చూస్తున్నందుకు కొంత అసహ్యించుకుంది. "మేం ఎలాపోతే వీళ్ళకెందుకు?" అని చీదరించుకొంది. అయ్యారు విధిగా తనను పెళ్లి చేసుకు తీరతాడు. అప్పుడేనా  కి బుద్ధిరాదూ? అనుకుంది. మనం అనుకొన్నవన్నీ వాస్తవంగా జరుగుతాయా? అనే సందేహంగూడా ఆమెకు కలుగకపోలేదు.

వరహాలు తండ్రి తిరిగి తిరిగి విసిగిపోయాడు; కాని తెగిన సంబంధం తేలేకపోయాడు. చివరికి ఏమీ లేనివాడు గూడా అంగీకరించకపోవడం అతని దౌర్భాగ్యం. కాళ్లు బలపాలుకట్టి కదలడం మానుకున్నాడు. "పోనీలే నాన్నా వృద్ధాప్యంలో నీకింత అవస్థ ఎందుకు? మన అదృష్టం బావుంటే పొరుగునే వుండేగూడెమూ బంగారంవంటి పెళ్లికొడుకు!"—అంటూ వరహాలు ఓదారుస్తూంటే తల్లిదండ్రులు నవ్వుకొని "పేదవాళ్లంటే విధి వికృతంగా తెరచుకొన్న నోటికి ప్రథమ కబళాలు" అనుకొనేటట్లు చూసేవారు పిల్లవంక. వరహాలు మాత్రం 'యథార్థం తెలిస్తే, ఇవ్వాళ గాకున్నా రేపైనా అయ్యారు తనను పెళ్లాడితే వాళ్లు విస్తుపోరా' అని మురిసిపోయేది. నెలలు దాటుతున్నాయి. రెండు, మూడు, నాలుగు...అయ్యారు అదే ఆశను చిత్రంగా పొడిగిస్తున్నాడు—అలివిలేని ఆమె సౌందర్యమధువును తనివితీరా సేవిస్తూ.

ఆనోటా ఆనోటా గుసగుసలు బయలుదేరాయి ఊళ్లో. ఈర్ష్య, అసూయలు సంఘంలో ప్రచ్ఛన్న సంగ్రామం లేవదీశాయి. యువకుల్లో మరీ తీవ్రంగా రగుల్కొంటోంది అగ్ని. అగ్గిపుల్ల గీసి ముందు ముట్టించేవాడెవడా ఈ మందుకు అని ఎదురుచూస్తున్నారు. చౌదరిగారబ్బాయి, షావుకారు, గవళ్ల సుబ్రాడు ముఖ్య పాత్రధారులు ఈ నాటకంలో. అయ్యారూ, వరహాలు ఒకనాడు సరదాగా మాట్లాడుకుంటున్న సమయంలో పై ముగ్గురూ టీ గావాలంటూ వచ్చారు. మధ్యాహ్నం నాలుగు గంటలౌతుంది. కుండలు ఖాళీచేసి కప్పులు కడిగేస్తోంది వరహాలు. అయ్యారు ఆమెతో సరాగాలాడుతున్నాడు. ఆ సమయంలో "టీ గావాలంటే వినబడ్డంలేదూ?" అని ఉరుములాగ వచ్చిన చౌదరీ కంఠం వినిపించింది. "పాలు అయిపోయాయి. లేదు టీ" అని లోపలనుంచే సమాధానమిచ్చాడు అయ్యారు. అయ్యారు ప్రత్యుత్తరం రుచించలేదు చౌదరికి. "ఇలా రా" గర్జించాడు. "ఇప్పుడు తీరుబడి లేదు"

"నువ్వు రాకపోతే మేమే లోపలికి వచ్చి తీసుకొస్తాం బయటికి"

"అంత అవసరం రాలేదు"

"చూస్తావేంరా. బయటకు ఈడ్చుకురాక?" షావుకారు హుషారిచ్చాడు గవళ్ల సుబ్రాడికి. వాడు జోరుగా లోపలికి నడిచాడు. గిన్నెలు తోముతున్న వరహాలు ఇదంతా చూస్తూనే వుంది. అయ్యారు తాను అనుకోని స్వాతంత్ర్యాన్ని గవళ్లవాడు తనపై ప్రయోగిస్తూంటే ఆశ్చర్యపడ్డాడు. అతన్ని జబ్బ పట్టుకొని వీధి హాల్లోకి ఈడ్చుకొచ్చాడు వాడు. చౌదరీ కళ్లెర్రజేసి అడుగుతున్నాడు.

"ఈ వూరెందుకొచ్చినట్టయ్యా నువ్వు?"

"పొట్టకోసం"

"అలాంటి వాడివి ఎలాగుండాలో తెలీదూ?"

"ఏం—ఎలాగున్నాను?"

"పిల్లి పాలు దాగుతూ కళ్లు మూసుకుని ఎవళ్లూ చూడ్డం లేదనుకుందిట"

"అంటే మీ వుద్దేశం?"

"నాడు గాని నాడొచ్చావు తెలుసా? తిన్నగా మసులుకో—లేకపోతే తన్నులు తినగలవు"

"ఎందుకు తినాలి? నే నేం నేరం చేశానని?" వణుకుతున్నాడు అయ్యారు. చౌదరీ ఉగ్రుడయ్యాడు.

"ఏమిటే — నేరం చెయ్యలేదూ? ఊరంతా కోడై కూస్తోంది తెలిసిందా? దాసీదైతే మాత్రం దానితో నీకు పరాశికాలేమిటే?"

"దానితో నాకేమీ సంబంధం లేదు" దొడ్లో వున్న వరహాలు ఈ మాట వింటూ నిర్ఘాంతపడింది. 'తాను చేపట్టింది ములగకొమ్మైనా — దమ్ములేని వాడన్నమాట అయ్యారు' అనుకొని హడలిపోయింది:

"సంబంధం లేదూ? ఉన్నట్టు ఋజువైతే?" గర్జించాడు చౌదరీ.

"మీరు వేసిన గుణహా భరిస్తా"

"గుణహాట — గుణహా — మహా ఘరానామనిషనీ — సరే — ఋజువైనప్పుడే చెబుతాం లే — పెద్దింటి తవు బ్రాహ్మణవు. దానికి పట్టుమని పదహారేళ్లు లేవు. రేపోమాపో పెళ్లి కావలసినపిల్ల. దాంతో నీకేమిటే -బుద్ధుండక్కర్లేదూ" కొరడా చురుకుల్లాగ చౌదరీ విసిరాడు మాటలు. అయ్యారు జవజవలాడుతూ కళ్ళు చెమ్మగిల్ల బెట్టుకుని బిత్తరగా చూశాడు.

"ఈసారి వరహాలుతో నువ్వు తిరుగుతున్నట్టయినా దానితో నీకు సంబంధం ఉన్నట్టయినా తెలిస్తే నీ వొళ్లు తోక్కదీస్తా — ఈ వూరినుంచి మకాం ఎత్తేయిస్తా. జాగ్రత్త" అని లేచాడు చౌదరీ. ఇతర మిత్రులిద్దరూ ఘనంగా బుజా లెగరేసుకుంటూ అతని వెనకాలే నడిచారు. వాళ్లని వెళ్లనిచ్చి తలుపులు బిడాయించి దొడ్లోకి వచ్చాడు కన్నీరొత్తుకుంటూ అయ్యారు. అక్కడ జామిచెట్టు నానుకుని వరహాలు దుఃఖిస్తూంది.

"ఏడుస్తున్నావేం వరహాలూ?"

"నన్నంటున్నారుగాని మీకూ ఏడుపు రావడం లేదూ?" ప్రశ్నను అయ్యారులోకి చొనిపింది వరహాలు. అయ్యారుకు ఏడుపొచ్చినంత పనీ అయి వూరుకుంది.

"అంటే నీ అభిప్రాయం?"

"నిన్నె పెళ్లి చేసుకుంటానని ఎన్నాళ్లనుంచో నాతో అంటున్నారుగా — మరి వాళ్లతో అనలేక పోయారేం?" అయ్యారుకీ ప్రశ్న ఎంత అమాయకంగా తోచినా వరహాలుమాత్రం అమాయకంగా వెయ్యలేదు

"వాళ్లతో చెప్పకుని పోరేగాలా""

"కాదు. ధైర్యంగా ఉన్నది ఒప్పుకుంటే తప్పేమిటీ?"

"వరహాలూ! నీకు బొత్తిగా ఏమీ తెలియడం లేదు—ఊరూ వాడా అనుకున్నా మరేమన్నా నా—లోకులు పలుగాకులు — మంచివాళ్లు కారు వీళ్లు."

"మంచివాళ్లు కాదని తెలుసుకున్నప్పుడే మనం ముందు జాగ్రత్తపడాలి. మీ రాడిన అబద్ధాల్ని వాళ్లు డప్పుకొట్టి చాటుతారు. ధైర్యంగా ముందుకొచ్చి 'నేను — ఒక పేదపిల్లను, పెంచి పెద్ద చేసినదాన్ని పెళ్ళి చేసుకుంటే మీకేం —' అని అడక్కూడదూ?" ఆమె అతన్ని కడిగేస్తున్నట్టు అడిగేస్తోంది.

"చెప్పాలిట — వాళ్లు మహా న్యాయమూర్తులని"

"అన్యాయమూర్తులు గనుకనే మరి ధైర్యంగా చెప్పాలి. మిమ్మల్ని వాళ్లేమన్నా కొరుక్కు తినేస్తారా? కాకపోయినా మీరు చేస్తున్నది దొంగతనమూ, లంజతనమూ కాదుగా—"

అయ్యారును లోలోపలికి చూసుకు తడుపుకొమంటున్నాయి ఈ మాటలు. కొన్నేపు తాపీగా ఆగాడు.

"ఏం — అలా చూస్తావు?" అకోకలాగ అడిగింది వరహాలు.

"ఏమిటో నాకేమీ బాగోలేదివేళ" అని పోయి మంచంమీద వాలాడు అయ్యారు. తన తతంగానికి ఇలాంటి వెనుపోటు వస్తుందని అయ్యారు కలలో కూడా అనుకోలేదు.

ఆవాళ రాత్రి వరహాలు చాలా సేపటివరకు అయ్యారుతో ఏమో ఘర్షణపడి ఇంటికొచ్చింది. ఆమె మనస్సులో ఆందోళ త్రాచుపాములాగ బుసకొట్టింది. అయ్యారు అస్థిరుడు, భయస్తుడు, అపనమ్మకస్తుడేమో కూడా అనే భావం ఆమెకు స్థిరమయ్యింది. అయితే నేం ఆ ఆందోళన కూడా జమచెయ్యకూడదనుకుంది. రేపటినుండి సంఘం తనపై దండయాత్రకు కత్తులు నూరుతుందని తెలియదు. "ఎండనున్నావు నీడకు రావమ్మా" అని మాటవరసకైనా తమ్మ తమ కుహా

బాధల్లో ఓదార్చడానికైనా సిద్ధంగా లేని సంఘానికి ఇన్నేళ్ళయ్యాక తమ ప్రసక్తి ఎందుకు రావాలి? తన సంరక్షణను ఈనాడు సంఘం ఏ దురుద్దేశ్యంతో తనకు తానే నెత్తిన బెట్టుకున్నట్టు నటిస్తోంది?" అనుకుంటోంది. కాని తనవంటి స్త్రీని కాకుల్లాగ పొడిచే స్వభావం సంఘం తనకుగా తానే పెంపొందించుకున్నదని ఆమెకేం తెలుసు?

రాత్రి రెండు ఝాములు దాటింది. మెల్లగా తల్లి చేత తలుపు తీయించుకుని చల్లని మంచినీళ్లు త్రాగి పడుకుంది వరహాలు. ఆమెకు నిద్రపట్టడం లేదు. ఆమె మనస్సులోనూ, వంట్లోను ఏదో తిరుగుతున్నట్టుంది. తన దుర్గతిగూర్చి తల్లితో రెండుమూడుసార్లు చెప్పింది గూడా. అయితే ఆమె అతివ్యాకులతను లోలోనే దిగమ్రింగుకుని ఫర్వాలేదు అని చెబుతూ వచ్చింది. ఆమె కూడా చాటునా మాటునా గ్రుడ్లనీళ్లు కుక్కుకోవడం చూసింది వరహాలు. బహుశా తనకు పెళ్ళి గాలేదని ఆమె బాధపడుతోంది అనుకొంది బిడ్డ. అంతేగాని అసలు సంగతి ఆమెకు తెలియదు.

ఇలా ఆలోచిస్తున్న వరహాలుకు ఎవరో ఇంట్లో దీపం ఆర్పేసినట్లు తెలిసింది. "ఎవరూ? దీపం ఆర్పేశారు?" అని అరచింది. మనస్సును ఆవరించే ఆత్రుతను ఇది ఇనుమడించింది. ఎవరో పురుష వ్యక్తి తన మీదికే వస్తున్నట్లు గుర్తించింది. భయంతో చటుక్కున కళ్లు మూసుకొంది.

వరహాలు కళ్లు తెరచేసరికి ఆమె మాట్లాడ్డానికి వీల్లేకుండా ఎదుటవ్యక్తి తన గొంతును బొమికెల ప్రాయంగా వున్న చేతివ్రేళ్లతో నులిమివేస్తున్నట్టు పసికట్టింది. గట్టిగా కేక పెడదామని ప్రయత్నించింది. లాభం లేక పోయింది. తన్ను హత్య చేయనుంకిస్తున్న వ్యక్తి తనకు చిరపరిచితుడే. అయితే ఆమె ప్రాణం ఈలోకాన్ని, సంఘాన్ని వదిలి వెళ్లడానికి అంగీకరించలేదు. కాళ్లు, చేతులు విలవిల తన్నుకుంటూ వరహాలు పెనగులాడ్డంవల్ల దూరంగా పడుకున్న తల్లికి మెళకువ కలిగింది. "ఎవరు?" గుడ్లు నలుపుకుంటూ ప్రశ్నించింది భీతావహయై. నువ్వు నోరెత్తకు!" వరహాలు తండ్రి కంఠం. ఆమెకు ఆ క్షణం వరకు ఆగంతుకుడనుకొంటున్న వ్యక్తినిగూర్చిన అనుమానం ధృవపరచింది. "వదలండి ఏమిటే మీరు చేస్తున్నది? పిల్లదాని పీక పిసుకుతున్నారా" బలంగా ఆ రెండు చేతుల్నీ విడదీసింది ఆ ముసలి. అతడు కొయ్యబారిపోయి కూర్చున్నాడు. కళ్ల వెంబడి నీళ్లు ధారగట్టాయి. ముగ్గురూ కటిక చీకటిలో మునిగి వున్నారు.

వరహాలు లేచింది. "ఆగావేం నాన్నా. కానియ్ నీపని. నీవు చెయ్యదలచుకొన్నది నే నెరుగుదును. ఊఁ—త్వరగా చంపెయ్. నీ దుగ్ధ తీరిపోతుంది." అన్నది ధీమాతో.

"ఆదేమిటే రాక్షసిలాగ అలాగంటున్నావ్? నీ కేదైనా పట్టుకుందా! రా—ఇలారా అంటూ తల్లి కూతురును దగ్గరకు తీసుకోడానికి ప్రయత్నించింది. "అమ్మా — న న్నెం దెయ్యమూ పట్టుకోలేదు. నాన్న నే ఏదో ఆవహించింది. సరే — ఆయన పని పూర్తి చేసుకోనియ్—అడ్డురాకు" అంది. "ఔను—నువ్విలాగ నీచంగా బ్రతికేకంటె చస్తేనే మేలు. నేను చెయ్యిచేసుకోకుండా నీవే ఈపాటికి ఆ పని చేసుకుని వుండవలసింది నా రోషం, పౌరుషం అంటుకోలేదు—నేను మాత్రం ఎలాగ పూనుకోగల్ను?" ఏమనగా రోషపడుతున్నాడు తండ్రి.

"సరే—నువ్వు చెప్పింది బాగా వుంది. అయితే చచ్చి సాధించే దేమిటనే నే నిలా అనుకున్నా ననుకోకూడదూ?" వరహాలు ధీమాతో అన్నది. "సాధిస్తుందట. లోకాన్ని ఇందరు మొగాళ్లు ఏమీ చెయ్యలేకపోయారుగాని ఒక ఆడది సాధిస్తుంది."

"ఏం—ఎందుకు సాధించకూడదు? ఎందరు మొగాళ్లో చెయ్యలేనిపని ఒక్క ఆడది ఎందుకు చెయ్యకూడదు?"

"చాల్లే—నోరు ముయ్."

"అయితే—నువ్వు చంపేముందు ఒక్కటి ఆలోచించావా? లోకమే మనపై పగబూనిందనుకో. ఇప్పుడు నావొక్క రెక్కలమీద మీరు పక్షుల్లాగ బ్రతుకుతున్నారు. నేనే గనుక పోతే మీరు ఆకలితో మలమలమాడి చావవలసిందేకాని లోకం కూడు పెట్టదు మీకు. మీరు మాడి చస్తూంటే మిమ్ము నిర్దాక్షిణ్యంగా చూస్తుంది. ఆఖరికి మీ శవాల్నిగూడా కాకులికీ, గద్దలకీ, కనాకష్టమైన పురుగులకీ ఆహుతి చేస్తుంది. నీవు నన్ను చంపేస్తే రేపటినుంచే మీ

చావు మొదలు. ఆలోచించుకో నాన్నా" ఆమె మాట్లాడే ప్రతిమాటా ములుకుల్లా వారి హృదయాల్లో గుచ్చుకుంటున్నాయి. "నిజమే. మనిషి చచ్చే దాకా తిండీ, బట్టా కావాలి. వాటి తర్వాతే ఏమైనా. అసలు తాము అన్నంకోసం పుట్టిన పురుగులు. ఆమె పోషించబట్టే ఏడాదినుండి తనూ, భార్యా కూచుని తింటున్నారు. ఇప్పుడామెపోతే తమ గతి?" ఆలోచిస్తున్నాడు.

"నాన్నా—దుఃఖించకు. నీకు పౌరుషమూ, మానాభిమానాలు తిండిపెడతాయని తోస్తే నిర్దాక్షిణ్యంగా నాపీక పిసికేసి రేపటినుండి ఆ ధర్మపన్నాల నాశ్రయించుకొని బ్రతకండి. నాకూ సంతోషమే. పోయిన తర్వాతకూడా కనీసం నీతి నియమాలకు ముగ్గురం బలిఅయ్యాం అనే తృప్తి నాకుంటుంది. ఊఁ—కానియ్" అంది. ఆమెను కావలించుకుని కన్నీటితో తడిపేద్దామని చేతులు రెండూ చాచాడు తండ్రి. అతడు నిజంగా వరహాల్ని చంపేస్తాడేమో అని భయపడింది తల్లి. "ఆగండి. మీరుచేస్తున్నది ఎంత ఘోరమో ఆలోచించారా? ఒక నేరానికి ఇద్దర్ని శిక్షిస్తారా—వరహాలు ఇప్పుడొక్కర్తేగాదు. ఆమెలో వుండి ఇంకొక ప్రాణి ఈ మురికికుంటవంటి లోకంలోకి రావాలని తపనపడుతూ గర్భవేదన ననుభవిస్తోంది. ఏమి కానున్నదో కానీండి. పరిస్థితుల్ని ధైర్యంగా ఎదుర్కుందాం. ఆయువున్నన్నాళ్లూ ఎలాగో బతుకుతాంగాని చచ్చిపోముగా" అంటూ వరహాల్ని అతిప్రేమతో కౌగలించుకుంది తండ్రికన్న ముందుగానే తల్లి. ఆ ముగ్గురూ ఒండొరుల్ని పెనవేసుకుని కన్నీళ్ళు కాల్వలుగా పారించారు.

"ఫర్వాలేదు నాన్నా—కష్టాలు వస్తుంటాయి. వచ్చాయని చచ్చిపోతామా? నీలాగే నేనూ వూహిస్తున్నాను. అయితే నీవు త్వరపడ్డావు. నేను అది మంచిదా కాదా అని తర్కించుకుంటున్నాను. కానీ—నేను కూతురును గాక కొడుకునే అయివుంటే ఇలా చేసేవాడివా నాన్నా?" ఏం ప్రశ్న ఇది! తండ్రి ఎదలో లేని చోటుచేసుకొని కుమార్తె ఎన్నడో ధైర్యం ఖాళీచేసి వెళ్లిపోయిన ఆ తావులో ఆత్మవిశ్వాసాన్ని పాదుకొల్పుతోంది. అయితే ఈ చిట్టి తల్లి లోకాన్ని తట్టుకు నిలువగలదా అనేదే మరొక సందేహం?

కొంతసేపయిన తర్వాత నాటి సంజవేళ చౌదరిగారబ్బాయి వచ్చి పిల్ల నడవడిని గూర్చి జాగ్రత్త అని హెచ్చరించాడనీ, అయ్యగారు తన బిడ్డను పాడుచేస్తున్నాడనీ, మేలుకోమనీ, పెళ్లి కావలసిన పిల్ల అనీ ఇంకా ఏమేమో చెప్పాడన్నాడు తండ్రి కూతురితో. ఎవరో తనకు తెలియకుండా తనపై కత్తి గడుతున్నారని గుర్తించింది వరహాలు. "సరే—నే నూహించినట్టే జరుగుతోంది నాన్నా. కాని దీనికోసం మీరేమీ బాధపడకండి. ఆ సంగతేదో నేను చూసుకుంటాను లెండి" అని వాళ్ళకు భరవసా ఇచ్చింది, మరుక్షణంనుంచీ లోకాని కెదురీదడానికి తన భావికార్యక్రమంగూర్చి యోచించడం ప్రారంభించింది—

వరహాలు అయ్యారును నిలవేసింది పెళ్లి విషయమై. ఏవో సాకులు చెప్పడం మొదలు పెట్టాడు. వరహాలు ముఖుకు ఖచ్చితంగా తేల్చుకోవాలని నిశ్చయించుకుంది. తనకు నెల తప్పిన సంగతి చెప్పేసింది. అది వింటూ హడలిపోయాడు అయ్యారు. "సరేలే—చూద్దాం" అన్నాడు. "నీకంటికెలా కన్పిస్తోందో—పెళ్లిగాని పిల్లను. పల్లెటూరు. పరిణామా లెలాగుంటాయో ఆలోచించు" అన్నది వరహాలు. "సరే—అన్నానుగా" అని మళ్లీ ప్రత్యుత్తరమిచ్చాడు బెదురుతూనే. ఆమెనుగూర్చి అతడేవో పెడవూహలు పెంచుకున్నట్లు అతని బలహీనతను వ్యక్తం చేసే మాటల్లో ఆమె పసికట్టింది. తనను పెళ్లి చేసుకోడానికి తాను అనుకున్నంత సుముఖంగా లేడనుకున్నట్లు తేలిపోయింది. ఆ ఊహను చేదుగా మింగింది.

సాయంత్రం ఇల్లు చేరుకోగానే ఆమెలో ఏదో వేదన అధికమయింది. లోకం తన బలహీనతను గమనించి తన్ను వంచిస్తోంది. మరి కర్తవ్యం? ఇంతటి మోసగాళ్లపై ప్రతీకారం తీసుకోడమెలాగ? అని కాస్సేపు—తాను పొందిన అవమానానికి క్రుంగుతూ కాస్సేపు రాత్రంతా బాధపడింది. అంతులేని దుఃఖం పొందింది. దరీ అంతూలేని ఊహలతో పొగిలింది. మరునాటి నుండి తాను బ్రతికేదెట్లా? అయ్యారు తనకేదో ద్రోహం చేస్తున్నాడు. అతన్ని ఏం చేస్తే పాపం వుందీ?

మరి రెండు రోజులకు మనోవ్యాధివల్ల వరహాలుకు జ్వరం తగిలింది. జ్వరంతోనే ఆమె పనిలోకి వెళ్లింది. నలతగా వున్నదని ఆమెచేత ఏపనీ చేయించలేదు అయ్యారు. తానే వెళ్లి డాక్టరును తీసుకొచ్చి రెండు ఇంజక్షనులు చేయించాడు. మూడు మందు పొట్లాలు ఇచ్చాడు. వరహాలు అయిష్టంగానే ఆ మందు సేవించింది.

పదిరోజులపాటు కుదిపి వరహాలును చిక్కబెట్టి జ్వరం వెళ్లిపోయింది. ఆ మందు వల్లనో జ్వరం, వల్లనో ఆమెకు గర్భంపోయింది. డాక్టరు, అయ్యారు తనకు ఏదో విషం యిచ్చివుంటారని వరహాలుకు అనుమానం. రెండుమూడు సార్లు డాక్టరు ఆమెను మళ్లీ చూచి "నీవు కడుపుతోవున్నట్లు చెప్పలేదేం? సరే-ఇప్పుడేమీ ప్రమాదంలేదులే" అంటూ నీరసం నుండి తేరుకోడానికి మందు మార్చాడు. ఆమె డాక్టరును నమ్మలేదు. ఇదంతా అయ్యారే చేయించాడని స్థిరీకరించుకొంది. తనలో ఉన్న నలుసు జారిపోయినందుకు ఎంతగానో దుఃఖించింది. తాను హత్యచేసినట్లు కుంచించుకుపోయింది.

"పోనీలే తల్లీ! నీవేనా బ్రతికి బట్టకట్టావు—అదే మాకు పదివేలు" అని వాపోయింది తల్లి. పదిహేను రోజులకు వరహాలు కోలుకొంది. ఆమెకు తెలియకుండా ఏవో ఇతర దుర్గుణులు తనలో మొలకలెత్తుతున్నట్లు గమనించింది.

ఒకనాడు అయ్యారు సంగతేదో ఖచ్చితంగా తేల్చుకోవాలనుకొంది వరహాలు. "నువ్వింత పిరికివాడవని కల్లోగూడా అనుకోలేదు."

"ఏం."

"నేను నీ కంటికంత భూతంలా గవుపడుతున్నానా—పోనీ. నాలో శిసువేం చేసింది నిన్ను?"

"అయిందేదో అయిపోయింది. దాని నిప్పు డెందుకు తవ్వతావు?"

"మళ్ళీ అడుగుతున్నా——నువ్వు నన్ను చంపెయ్యాలని ప్రయత్నించలేదూ? నీ కంటికంత నీచంగా కనుపిస్తున్నానా?"

"లేదు—వరహాలూ-ఊరికే అలాగ ఉద్రేకం పెంచుకుంటూ వెందుకు?"

"లేకపోతే నువ్వు డాక్టరుచేత ఆ మందు నాకెందు కిప్పించావు?"

"నీగురించి కాదు. లోకం నిన్ను ఆడిపోస్తుందని బిడ్డ కరిగిపోవడానికే ఆపని చేశా."

"ఛీ—తుచ్ఛుడా—భరించే నాకు లేకపోయిందిగాని నీ బిడ్డ నీకు బరువయ్యిందా? ఇంత నీచుడవని తెలిస్తే నిన్నాశ్రయించేదాన్ని గాదు."

"వరహాలూ! నీకు తెలియక ఆవేశంలో అలాగంటున్నావుకాని నీ మేలుకోసమే చేశాను."

"ఔను—నా మేలుకోరే పెళ్ళి వాయిదా వేశావు—ఇంకా దానికోసమే పెరిగే బిడ్డను."

"లోకం గురించి నీకేమీ తెలియదు. నువ్విలాగుంటే బ్రతుకనివ్వదు. పొడుచుకు చస్తారు."

"ఓహో! ఎంత మంచి ఆలోచన! నేనంటే అంత అభిమాన మేకిస్తే పెళ్ళి చేసేసుకోరాదూ? ఇంతకీ తప్పునాది. కలేజాలేని ఘటాన్ని బట్టుకున్నాను. అయ్యారూ! నీవు పరమ నీచుడివి. ద్రోహివి. గండాలుడవు. పిరికిపందవు. నన్ను పెళ్ళాడ్డానికి నీకు దమ్ముల్లేవు. నిజమేనా? పెళ్ళి అనేసరికి గుండెదడ పట్టుకోవడం లేదూ?" ఆమె కళ్లెర్రజేసి ప్రశ్నలు కురిపిస్తుంటే చౌదరి ఆవాళ కేకలేస్తున్నప్పటికంటె ఎన్నోరెట్లు వణుకుతున్నాడు. "ఛీ—నిన్ను పెళ్లిచేసుకునేకంటె ఎందులోనైనా పడిచస్తే మేలు" అని గిరుక్కున మళ్లిపోయింది. ఇంటికి చరచర వెళ్లిపోతున్న ఆమెలో సంఘం ఎంతటి వంచనచేసేదీ, ఎంత పిరికిదీ, దానిలో ఎంత స్వార్థం వున్నదీ, సుడిగుండాలవలె ఊహాపథంలో మెదలటం మొదలయ్యింది. అయ్యారు చేసుకుంటానన్నా వాడిని గట్టుకోవడంవంటి నీచత్వం ఇంకొకటి లేదు. ఒకటిమాత్రం ఆమె నిర్ణయించుకొంది, తాను అతని దాసిగదా అని, తనకు డబ్బున్నదని, తాను మొగవాణ్ణిగదా అని అయ్యారు తనను మోసగించి, నాశనంచేసి, సమాజంలో తాను అడుగు బెట్టగూడని ఒక బురదగుంటలో కుక్కివేశాడు. ఆమె అందులో మునిగిపోయింది. దీనికి అతనిపై పగదీర్చుకోవాలని ప్రతిజ్ఞబూనింది.

ఇంక వరహాలు తన హోటలు పనిలోకి రాదను కొన్న అయ్యారుకు మర్నాటినుండి ఆమె యథాప్రకారం హాజరుకావడం ఎంతో ఆశ్చర్యం కలిగించింది. 'అమ్మది! మనసు తిరగేసుకుంది. ఏదో ఉడుకు పట్టలేక అలాగంది కాని ఆమెకు మాత్రం గడవడం

ఎలాగ? ఆమె కేకలకు నేను అనవసరంగా జెడిసిపోయాను. ఆమె ఎంతో అభిమానవంతురాలనుకున్నాను. మామూలు రకమే నేమో వరహాలు గూడా! అభిమానం వున్న మనిషైతే మళ్లీ నా గడప తొక్కుతుందా? ఇలాగ అనేకవిధాల తనను తృప్తిపరుచుకున్నాడు. వరహాలు కలివిడిగా పనులు చేసుకుపోవడమే గాక హోటలుకు వచ్చేపోయే వాళ్లతో, తనతో, హాయిగా వేళాకోళాలాడటం చూస్తూ మరీ విస్తుపోతున్నాడు. ఈ మార్పు ఆమెలో రావడంతో హోటలుకు గిరాకీ ఎక్కువయ్యింది. కేవలం వరహాల్ని చూడ్డానికీ, ఆమె హాస్యాలు వినడానికీ, ఆమెను పలకరించడానికీ ఎంతోమంది తహతహ పడుతున్నారు. వరహాలు ఇలాగయిపోయిందేమిటి అని అప్పుడప్పుడు దిగులుపడుతూండేవాడు గూడా.

వరహాలు కిప్పుడు ఏ ఆవేదనా లేదు ఉద్రేకం అసలే లేదు. మనిషి ప్రతీకారేచ్ఛతో నిండి తత్పూర్తికై కార్యక్రమంలో లీనమైనప్పుడు మరో ఆలోచన అతనిలో వుండదు. అదే వెలుగు అనుకుంటూ రాత్రింబవళ్లు దాని పైనే ధ్యాస పెట్టుకున్న ఆవ్యక్తికి ఆ కటిక చీకటి, ఆ దురూహ అతి కాంతివంతంగా మెరుస్తుంది. వరహాలు—ఒక్క అయ్యారు మీద నేగాదు, పురుష జాతిమీద నే పగబూనినట్టుంది. దాని పరిణామాలను గూర్చి ఆమె యోచించలేదు. తన జీవిత విధానాన్ని తనకు తానే మారుదోవకు మళ్లించేసింది. తనను "వ్యభిచారి. విఘం చెడిన స్త్రీ" [illegible] కున్నా లక్ష్యం చెయ్యలేదు.

కాలము మహాశక్తివంతమైనది. దాని మహత్వం ఇంతింతనరానిది. వయసులో వున్న వాళ్లందరికీ వరహాలు ఇప్పుడొక ప్రత్యేకాకర్షణ. మూకీ భావంతోనే ఆమెనుగూర్చి కోరికలు పెంచుకుంటూ తమ్ము తాము దహించుకుంటూ మనసులు పాడుచేసుకుంటున్నది ఆ వూరిలోని యువశక్తి — దీని ప్రభావం అయ్యారు మీద ఎన్నోరెట్లు పనిచేసింది. తనకు ఆమె యందు ఏదో హక్కున్నట్లు గుణించుకోసాడు. నానాటికీ వరహాలు ఒళ్లు చేసుకుంటూ చూసిన వాళ్లను కొట్టొస్తున్నట్లు సొబగులు వెదజల్లుతోంది. వాంఛలుడిగిన ముసలి వాళ్ళకు గూడా ఆ పసుమును చూస్తున్న కొద్దీ ఎన్నేళ్ళ క్రిందటనో మ్రగ్గి మసియైపోయిన కోరికలు తీయగా నవలెత్తుతున్నట్లయి ఉన్మత్తులయ్యేవారు.

అయ్యారు నాలుగైదు నెలలు దాటనిచ్చి వరహాలు వద్ద మొదలెట్టాడు. బ్రతిమాలుకోవడం, ఆశలు చూపడం, సొమ్మునివ్వడం మొదలయ్యింది. మొదట్లో అతని అవస్థకు వరహాలు జాలిపడింది. ఎంతో లాలించింది. అసలు కూడదని హెచ్చరించింది. తాను మునుపటి వరహాలును గానని, తన్ను తాకితే అయ్యారు ప్రమాదం పొందుతాడని సూచించింది పరోక్షంగా. కాని అయ్యారు కివేమీ తలకెక్కలేదు అతడు కళ్లుండీ గుడ్డివాడై పోయాడు. చెవులుండీ చెవిటివాడయ్యాడు. వరహాలు తనకు చేసిన హితబోధలన్నీ వ్యతిరేకార్థాలనే చూపించాయి అతనికి.

స్వతహాగా వరహాలుకు అయ్యారుపైన ఎంతటి పగ వున్నప్పటికి అప్పుడప్పుడు మానవ సహజ జనితమైన కరుణ, జాలి అతని పతనాన్ని నివారించలేకపోయాయి. ఊళ్లో వాళ్లు తరచు అతన్ని హెచ్చరించినా లెక్కచేయలేదు. తమ యిరువుర సంబంధానికి ఈర్ష్యాసూయలతో కొనకొరలాడిన పెదవాళ్ళ మందలింపులు పనిచెయ్యలేదు. ఇటు అయ్యారును, అటు ఇతరుల వ్యాఖ్యానాలను మాని చాటుగా నవ్వుకొనేది వరహాలు. అంతేగాని ఆమె కిప్పుడు భయంగాని, సందేహంగాని ఇసుమంతైనా లేవు. ఒకనాడు తప్పుగా, నిందగా తనకే అనిపించిన ప్రవృత్తి నేడు తాను సంఘంపై పగతీర్చుకోవడానికి ఆయుధంగా తోచింది. అయ్యారు నెలరోజులు వరహాలుతో సుఖమయంకాని, తాను స్వర్గసౌఖ్యం అనుకొన్న దౌర్భాగ్య జీవితం అనుభవించాడు. చూస్తూ చూస్తూ మిడత మంటలను ఫలాలనుకొని చుంబించి సర్వనాశనం పొందిన బందమైంది అతని బ్రతుకు. పాతికేళ్ళు నిండని పసుముగాడికి అమాంతంగా నూరేళ్ళూ నిండిపోతున్నాయా అనే అపటుగలిగింది. ఆ ప్రహారం విద్యుదాఘాతాన్ని మించి ప్రమాదకరమైనది. అయితే దాని తీవ్రతను గుర్తించేసరికి సమయం మించిపోయింది. కొద్దిరోజుల క్రిందట జాలిగా, దయతో, సలహాగా, సూచనమాత్రంగా, హెచ్చరికగా వరహాలు తన ముందుంచిన ప్రబోధంలోని అంతర్యం అతనికి అవగాహన కొచ్చేసరికి కాలం చాలా మేర గడచిపోయింది. పరిస్థితులు తమ ప్రభావాన్ని అతనిపై బలంగా ప్రసరించాయి. మానవ ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. వైద్యులు, చిట్కాలు దమ్మిడీకి కొరగాలేదు—'చేతులారా చేసుకున్నది అనుభవిం

పక తప్పదు—కళ్లు మూసుకుపోయి కండకావరంతో సంచరిస్తే ఏమౌతుంది' అన్నది అంతరాత్మ. వరహాలు కేతని పరిస్థితి సుంతైనా జాలిగొలుపలేదు—కాగా ఆనందం కలిగించిందేమో—ఆమె అయ్యరుహోటల్లో పని మానేసింది—లేదు అయ్యరే హోటలు వ్యాపారం మానేశాడు. ఒకనాటి వేకువజామున కాళ్ళూ చేతులూ వ్యాధివల్ల పడిపోయిన అయ్యరు రెండెడ్ల బండి గట్టించుకొని మహా మరణబాధ ననుభవిస్తూ చచ్చీ చావని దుర్భరావస్థలో ఆ వూరుకు మళ్లీ రాకూడదని నిశ్చయించుకొని తిరువనంతపురంనుండి ఎలాగొచ్చాడో అలాగే కాకుండా, చేతిలో చిల్లి గవ్వ లేకుండా ప్రయాణమై వెళ్ళిపోయాడు......

అయ్యరు నిష్క్రమణంతో ఆ వూరిలో వరహాలు జీవితానికి ఒక పెద్ద ప్రశ్నార్థకం కనుపించింది. అందరూ తలయెత్తి ఆ ప్రశ్నను తలకొకరీతిగా తిలకించారు. కొందరు ఆమె పరిస్థితికి జాలిపడ్డారు; కొందరు అసహ్యించుకున్నారు; మరికొందరు చిత్రంగా వ్యాఖ్యానించుకున్నారు; భయపడిన వాళ్లూ లేకపోలేదు. అయితే ఇంకొకొందరు చీకటిలో లొట్టలు వేశారు—ఇదొక విశేషం. అయ్యరు ఆవూరు వదిలిపెట్టడానికి గూడా తలకొకలాగున కారణాలు చెప్పుకొని తృప్తిపడ్డారు.

నిలవ సొమ్ములో నూరు రూపాయలు జాగ్రత్తగా ఖర్చుపెట్టుకుని వరహాలు నెలా పదిహేను రోజులు గడిపింది ఆ పేదసంసారం. తండ్రికి కూలీ నాలీ చేసే ఓపికగూడా తగ్గిపోయింది. కూతురు బతుకు అతన్ని మరీ వొంగదీసింది. ఊళ్లో పదిమందిలోనూ తలెత్తుకు తిరగడానికి సిగ్గుపడేవాడు. తల్లికి గూడా బలం సన్నగిల్లిపోయింది. ఇప్పుడు ఆ కుటుంబాన్ని పోషించే భారం వరహాలుమీదనే పడింది. గ్రామంలో జరిగే మార్పుల్ని గమనిస్తూ అలాగే ఆమె బరువుగా రోజులు వెళ్ళబుచ్చుతోంది.

ఇలా వుండగా చౌదరీగారికి చాలా ఇబ్బంది వచ్చింది. భార్య నీళ్లు పోసుకొంది. ఆరో నెల. ఇంట్లో ఏ పనీ చేసుకోవడానికి ఓపిక లేదు ఆవిడకి. కోడలుకు ఒంట్లో సుస్తీచేసింది. ఊళ్లోకల్లా పెద్ద కమతం వాళ్ళది. ఇంటి పనులకు, పై పనులకు చాలా చిక్కుపడుతున్నారు. వాళ్లింటికి తరుచు మెత్తులకనీ అలుకులకనీ వరహాలు తల్లి వెళ్లుతూండేది. "పోనీ—అక్కడా ఇక్కడా ఏమి యాతనపడతారు పెరటి సావిడిలో పడివుండి మాకింత చేసిపెట్టకూడదూ!" అని చౌదరీగారి భార్య అడగడమూ, ఆ తల్లి అంగీకరించడమూ జరిగింది. వరహాలుకు ఇది మొదట్లో నచ్చకపోయినా వాళ్ల మకాం చౌదరీగారి చావడిలోకి మార్చక తప్పలేదు. మంచిరోజు చూసుకుని ప్రవేశించారు వాళ్లింట్లో. తర్వాత తర్వాత ఇదీ బాగానే వుంది అనిపించింది వరహాలుకి.

పేరు తల్లిది—ఇంటిల్లిపాదికీ చాకిరి చెయ్యడం వరహాలుపనీగా పరిణమించింది. చేరిన మూడునెల్లకు వాళ్లపాటు చౌదరీగారికుటుంబానికి చాలా నచ్చడం వల్ల "ఇంక మీరు కుదురుగా వేరే వండుకోవడమెందుకు—నలుగురతోబాటు మాతోనే పడుండురూ" అని చౌదరీగారు, పెద్దవాడు, కోరడంతో మరీ వలను చిక్కింది ఆ పేదకుటుంబానికి. చౌదరీగారిభార్యకు పురుడొచ్చింది. మగబిడ్డ గలిగి పదిరోజులు బ్రతికి పోయాడు. ఆమెమాత్రం నీరసంగానే వుంటోంది. కోడలుమాత్రం మంచం వదల్లేదు.

ఇప్పుడు ఇంట్లో పని అంతా వరహాలుదే. ప్రొద్దుటనే లేవడం. దాసీవాళ్ల చేత వాకిళ్లు బాగు చేయించుకోడం. పాలుదీసి పాలికాపు ఇవ్వడంతోనే కాఫీగాచి చౌదరీకీ, భార్యకు—కొడుక్కూ, కోడళ్ళకు ఇవ్వడం, చంటిపిల్లలకు చద్దులు బెట్టి మూతులుగడికి స్నానాలు చేయించి ముస్తాబులు చెయ్యడం, రెండుపూటలా వంటవండడం, అడపా తడపా మధ్యాహ్నం వేళ చిరుతిళ్లకు ఏపకోడీలో మినపసున్ని చెయ్యడం, పెరుగు తోడు బెట్టుకోవడం ఇదీ ఆమె దినకృత్యం. అన్నివిధాలా ఆయింట్లో అందరి మన్ననలూ పొంది వరహాలు తల్లో నాలుకయ్యింది. ముఖ్యంగా ఆమె ఆడువారి ఆదరం పొందింది. చౌదరీగారికి ప్రత్యేకాభిమానం గలిగింది ఆమె వినయవిధేయతలవల్ల. ఆ కొడుక్కి సరేసరి—రోజుకోవరసన ఆమె అతన్ని ఆకర్షిస్తూంటే బిత్తరపోయి అప్పుడప్పుడు దొంగలాగ చూసేవాడు ఆ పడుచు వైపు.

వ్యవసాయంపనంతా కొడుకుదే. ముప్ఫయ్యేళ్లు పైగా వుంటాయి. జట్టీల్లాంటి నలుగురు పాలికాపులు,

వాళ్లలో గవళ్లకుర్రాడొకడు అరుకాళ్ల దుక్కిటెద్లతో మహోధ్వజాయమానంగా కమతం సాగిస్తున్నాడు అబ్బాయి ఊళ్ళో చౌదరిఅన్నా కొడుకన్నా హడలుతారు. పూర్వకాలంనుంచీ పెత్తనదారీ ఆకుటుంబానిదే. ఏ తగవొచ్చినా చౌదరీ తీర్చవలసిందే. ఆయన మంచికాలంలో వుండగా మురబ్బీగా, నిరంకుశంగా వుండేవాడని ఇప్పటికీ పిల్లా మేకా దగ్గరనుంచి అంతా చెప్పుకుంటారు.

వర్షాకాలం. పదిరోజులు ఏకధాటిగా కురిసి కురిసి వొరుపిచ్చింది నాలుగురోజులనుంచి. మఖకార్తె ప్రవేశించి రెండురోజులైంది. చౌదరీగారబ్బాయి ముదరగా వేయిస్తున్నాడు మిరపతోట. పదెకరాల తోటకి అరవైమంది ఆడకూలీలను, పదిమంది మగాళ్లను పెట్టి ఊడ్పిస్తున్నాడు. పొద్దున్న తొమ్మిదింటికల్లా బయలుదేరి రేవటి కెళ్లిపొయ్యాడు. అతిగాడికని మధ్యాహ్నం పంపడానికి కొంచెం మినపసున్ని, పకోడీలు చేయించింది వరహాలుచేత చౌదరీగారిభార్య. 'వేళ దాటిపోతోంది. వస్తానన్న పాలికాపు రాలేదు — ఎలాగ?' అని ఎదురుచూస్తోంది.

వరహాలుకు ఆవేళ తోట ఊడ్పుచూడాలనిపించింది "అమ్మగారూ! నే బట్టికెళతానండి — రేవడి దగ్గరేగా — మిరపతోట చూసినట్టూ వుంటుంది, అబ్బాయిగారికి కాఫీ ఇచ్చినట్టూ వుంటుంది" అన్నది. ముందు యజమానురాలు తటపటాయించిందికాని తుదకు ఒప్పుకోక తప్పిందికాదు. క్షణంలో చిక్కగా కాచి కాఫీ ఫ్లాస్కులో నింపింది. రెండు సున్ని వుండలు, కాసిన్ని పకోడీలు పొట్లాలు గట్టింది. పెరట్లోకెళ్లి శుభ్రంగా స్నానంచేసి ఇస్త్రీ మడత వాయిలు చీరగట్టుకొని, ముల్లురవికి తొడుక్కొంది. చాలారోజులతర్వాత వీధిమొహం చూస్తోందేమో బాగా ముస్తాబవాలి అనిపించింది. ముఖానికి తను మాత్రం పౌడరు అద్దుకుని, తిలకం బెట్టుకోడానికి అబ్బాయిగారి పడకగదిలోకి వెళ్లింది. అప్పుడే ఇచ్చిన నారింజపళ్లరసం త్రాగుతున్న చౌదరీ కోడలుకు కళ్లు జిగేలుమన్నాయి. వరహాలును చూసి నిర్ఘాంత పోయింది. ఆడదైనా ఆమెకు అమాంతం వరహాలును కౌగిలించుకుని ముద్దుబెట్టుకోవాలి తనివిదీరా అనే ఊహ మెదిలింది. దీన్నేమీ గమనించని వరహాలు తీరుగా తిలకం దిద్దుకొని "ఎలాగున్నా వొదినా?" అంది. ఎదటి ఆమెకు అసూయ పులుముకొచ్చింది. "నిజంగా రంభలాగున్నావే—" అని మాత్రం అనగలిగింది. వరహాలు త్రుటిలో ఒకచేత కాఫీ ఫ్లాస్కు, మరొకచేత టిఫిను పొట్లాలు పుచ్చుకొని రేవడికి బయలుదేరింది. ఆమె ఇల్లువిడిచి పొలంవెళ్లిన చాలా సేపటివరకు ఆమెనుగూర్చిన ఆలోచన చౌదరీ కోడలకు పోలేదు.

వరహాలు హంస నడకన వీధినబడి వెడుతూంటే తీరికగా అరుగులమీద కూర్చుని పేకాడుతున్న పెద్ద మనుషులు, వసారాలలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూనో, వైకుంఠపాళీ ఆడుతూనో, చింతపిక్కలాటలోవుండో చూసిన యిల్లాళ్లు "చౌదరిగారి ఇల్లు బట్టాక వీళ్ళ దరిద్రం వొదిలింది—తళతళలాడుతూ ఎలా వెలుగుతోందో పిల్ల" అనుకుని ముక్కుమీద వేలేసుకున్నారు. రాజవీధి దాటి, కాపుల కొంపల సందులు మళ్ళి, మాలపిల్లి దారిన తిన్నగా రేవడి చేరుకుంది వరహాలు.

పొలంనిండా జనమే. రంగు రంగుల కోకలు గట్టుకుని పువ్వుల రవికెలు దొడిగి, కచ్చలు బిగించి పల్లెపడుచులు నడుంవంచి తొల్లికతో ముందు మొగాళ్లు పొడుచుకుపోయే గుంటల్లో చేరెడేసి నీళ్ళు బోసి మిరపమొక్కలు నాటుతున్నారు. నారు పెడలుబుచ్చుకుని వాళ్ళ పిరుగులవెనక, సరాగాలాడుతూ కొందరు కుర్రకారు హెచ్చరికలు చేస్తూ తోటను నడిపిస్తున్నట్లు చురుగ్గా నాటిస్తున్నారు. మధ్య జమానుగా సిల్కు చొక్కా తొడుక్కున్న అబ్బాయి చేస్తున్న అదలింపులు అప్పుడప్పుడు వినిపిస్తున్నాయి. మఖ కార్తె ఎండ మాడ్చేస్తున్నట్టు కాస్తోంది. రేవట్లో మూలగా ఒక్క చోటనేవుంది పెద్ద వేపచెట్టు. జుట్టు విరబోసుకున్న ఉత్తమా యిల్లాలులాగున్న ఆ చెట్టునీడన కూర్చొని ఊడ్పు అందం చూస్తోంది వరహాలు.

ఇంకొక దెసకు ఆమె దృష్టి మళ్లించింది. [illegible]తకు వచ్చిన వేరుశెనగ చేలు, కోతకొచ్చిన బుడమచేలు వాటిమధ్య దీనంగా తలలు వొంచుకుని చిరకాల బంధువులు, మిత్రులు కొద్దిరోజుల్లోనే తనను వీడిపోతున్నారే అని చింతిస్తున్నట్లు వూగిసలాడే కంది మొక్కలు, కొరకొరలాడే కొఱ్ఱకంకెలు నేత్ర

పర్వంగా వున్నాయి. రైతుకు ఆనందమిచ్చే మహత్తర ముహూర్తాలలో ఇదొకటి. శ్రావణమాసపు ఎండ—ఎండను వెంటాడే మేఘాలు, మేఘాల నుండి తప్పుకునే సూర్యబింబం—క్షణంలోనే భయం, అంతలోనే భరవసా—మళ్ళీ మగత—ఆకాశంలో దోబూచులాడుకుంటున్నట్లుంది. మేఘం బెడ గొండిలా కమ్మినప్పుడు చల్లని పిల్లగాలి; మళ్ళీ విడిపోయినప్పుడు వెచ్చని, నులివెచ్చని, గోర్వెచ్చని సూర్యకాంతి ఆమెను గిలిగింత పెడుతున్నాయి. వరహాలు మనస్సు కాస్సేపు ఆ పరిసరాల్ని వీడి ఎక్కడో ఒక మహదానంద కమనీయ మధురావస్థలో విహరిస్తున్నట్లుంది. తన ఉనికినీ, తన స్థితినీ పూర్తిగా మరచిపోయింది. ఆనందంలో తేలిపోతూ మేలుకొని వుంటూనే, కళ్లు తెరచివుండగానే ఆమె ఒక వింత నిదురలో మునిగిపోయింది.

"ఏమిటే—వరహాలూ! ఇలా గొచ్చావు?" ఆశ్చర్యపడుతూ అబ్బాయి అడిగిన ప్రశ్నకు ఆమె ఉలిక్కిపడి లేచింది. ఫ్లాస్కు వేపచెట్టువార పెట్టి ఎంతసేపయిందో, ఎప్పుడు పూలకుప్పలాగ చదికిల బడిందో—ఆ చల్లగాలికి! తత్తరపాటుతో నిలచి పమిట సర్దుకుని తడబడుతూ, "ఆఁ—ఏమీ లేదు. మీకు కాఫీ అలవాటుగా—ఇవాళ నేనే తెచ్చాను" అని సిగ్గుపడి ప్రక్కకు తప్పుకొంది. అబ్బాయి ప్రత్యుత్తర మియ్యలేక గుడ్లు వప్పగించి ఆమె సౌందర్యం త్రాగేస్తూ చేష్టలుడిగిన వృక్షాలలో నిలబడిపోయాడు.

వరహాలు అతని అవస్థను గమనించనట్లే నటించి ఫ్లాస్కు, టిఫిన్ పొట్లాలు తెచ్చి ముందుంచబోతూంటే "ఇక్కడొద్దు, అలాగ నీళ్ళ దగ్గర కెడదాం రా" అని ఆమెను చాటుగా తీసుకెళ్లాడు అబ్బాయి. మెత్తని రేవడి నేల దాటి కొత్తగా వరకట్టిన మళ్లే గట్టుమీద నడుస్తున్నారు. కాలికింద నేల చితచిత లాడుతోంది. ఒకచేత్తో ఫ్లాస్కు చిక్కమూ, మరొక చేత్తో పొట్లాలూ, ఎత్తిపెట్టిన చీరకొంగూ పట్టుకుని అబ్బాయి వెనుకనే మౌనంగా అడుగుల్లో అడుగులేసుకుని వెళ్లింది. మడిగట్టు మధ్యనున్న మామిడిచెట్టు కింద ఖాళీ దిబ్బమీద అతను చదికిలబడ్డాడు. ఎదురుగా ఎగువ మడిలోంచి దిగువ చెక్కలోకి గలగల పారుతోంది నీరు. వీళ్లనుచూచి నీళ్లు నవ్వుతున్నట్లున్నాయి కలకలలాడుతూ. ఆమె అతనికి పొట్లాలందిచ్చి వెడగా నిలబడింది. వరహాలు ఈ మధ్యన ఎంతేనా సిగ్గూ, అభినయమూ నేర్చుకుంది. "నిలుచున్నావేఁ? కూర్చో ఇలాగ" అంటూ తనకు అడుగైనా దూరములేని ఎడం చూపెట్టాడు. పొట్లం విప్పి ఒక ముద్ద వుండ చిదిపాడు. తింటున్నాడు. తన వైపు తేరిపార చూడలేక సిగ్గుతో తలలు వంచుకున్న కన్నెపడుచుల్లాగ కలకలలాడే కుర్రవరి కర్రల్ని చూస్తూ నవ్వుకుంటోంది వరహాలు. ఆ నవ్వ తిలకిస్తూ ఎలాగో తేలిపోతున్నాడు అబ్బాయి. "నువ్వేనా చేశావిది?" అడిగాడు. "ఔను—ఏం? బాగా లేదూ?" ఆమె అతని చేత బాగానే వుంది అని అనిపించుకోవాలని అలాగడిగింది అంతే.

"బాగా లేకపోవడమా? ఎంత తియ్యగా వుందో"

"మనమిలా వచ్చేశాం — కూలీలు వొళ్లు దాచుకోరూ?"

"వెళవనో వెళవపోనిద్దూ. నీకు బాగా వుంటోందా మా ఇంట్లో?"

"నాకేం—నిక్షేపం లాగుంటోంది"—అతను క్రమంగా ఉన్మత్తుడౌతున్నాడని ఆమె పసికట్టింది.

"అయ్యో! నీవు తినలేదే — చూశావా మంద మతి" అంటూ ఆమె అనుమతికైనా ఆగకుండా చొరాయించి తానే స్వయంగా రెండో వుండ ఆమె నోట కుక్కాడు. వ్యవహారం ఇంత త్వరలో ఇలాగ ప్రతిమించుకుందనుకో లేదు వరహాలు. తానూ వరిచేలూ, చెట్లు పరిసరాలు చూస్తూ ఏమరుపాటున వుంది. వెంటనే పళ్లు గిటకరించింది. అతని వేళ్లు రెండు నలిగిపోయాయి ఆమె పంటిసందున బడి. మిగతా వుండ చిదికి సందు ఆమె గుండెలమీదనుండి క్రిందకు దిగజారి చీర నిండా రాలింది.

"అబ్బ! నువ్వు కరచినా ఎంతో తియ్యగా వుంది సుమా" అంటూ అబ్బాయి ఆమెను మరికాస్త దగ్గరగా జరిగాడు. మెడనుండి పాదాలదాకా పడిన సందును వెంటనే దులిపి తుడిచేశాడు అతడు. అతని స్పర్శలో, ఆసంజవేళను, చల్లగాలిలో ఆమె ప్రతి అవయవమూ పులకరించింది. ఇంక ఎంతమాత్రం అశ్రద్ధ చెయ్యకూడదు. సమయ మిప్పటికే మించి

పోయింది. వరహాలు త్రాచుబుసను మరపించే వేడి నిట్టూర్పులతో ప్రక్కకు వొత్తిగిలింది.

"అబ్బాయిగారూ! కొంచెం నోళ్లు దగ్గిరపెట్టుకోండి. అంతకంతకు మీరేం చేస్తున్నారో మీకే తెలియని అవస్థలోకి దిగజారిపోతున్నారు. లేవండి. కళ్ళు తెరవండి."

"వరహాలూ! నేను తెలిసే చేస్తున్నా నీపని"

"అయితే—దీని ఫలితం అనుభవించడానికి సిద్ధంగానే ఉన్నారా?"

"ఆఁ—స్వయంగా'

"మంచిది కాదు సుమండీ మీవంటి వారికి. లోకంలో ఎంతోమందికి సబబులు చెబుతున్న పెద్దయింటి పెద్ద కొడుకులు మీరు"

"అయితే?"

"ఇట్లాంటి పనులవల్ల మీకేగాక, మీ యింటికీ, కుటుంబానికి కూడా చెడ్డపేరు వస్తుంది.

"నువ్వు నాకేమీ నీతులు నేర్పక్కరలేదు" ఎంతో అహంకారం ప్రకటించాడు.

"ఇవి నీతులు కావు—తర్వాత మీకే అనుభవిస్తారు—సరే"

"వరహాలూ! ఈ వూళ్ళో ఎవరూ ఈ చౌదరీని తప్పించుకొని పోలేరు. తలచుకుంటే ఎంతవాళ్ళనైనాసరే నల్లిని నలిపినట్లు నలిపెయ్యగల్ను" అహంభావం అంధకారాన్ని పులిమింది అబ్బాయిలో.

"నేనూ చెయ్యగలను ఆ పని. ఆడదాన్ని అనుకుంటున్నారేమో" వరహాలు అన్నమాట మాత్రం నిజం. ఆమె తలుచుకుంటే ఎంతైనాచేసి తీరుతుంది ఆడది, అందకత్తె గనుక.

"నన్ను ముట్టుకండి. నేను అగ్గిలాంటిదాన్ని. మేం పెంచి పోషిస్తున్నామని మీరు హద్దుమీరి చరించడం మర్యాదగాదు. దీని విషఫలితాలను గుర్తించి కళ్లు తెరవండి."

"ఏం పతివ్రతండీ! బయలుదేరింది ఇన్నాళ్ళకు ఈ పాటిమీద? పతిలేని పతివ్రత" హేళనగా నవ్వాడు. ఈ మాటలవల్ల ఆమె అభిమానం గాయపడింది. వెంటనే రూపుమార్చింది.

"ఇది మానుకోరన్నమాట! సరే" దీనవదనయై దిగజారిన ఆమెను చేరదీసి "వరహాలూ! నామీద నీకెందుకూ ఇంత కోపం? అయ్యరుపాటి చెయ్యనూ నేను?" అన్నాడు నవ్వుతూ. అతడు సరియైన ఉజ్జీ తనకు అనుకున్న ఆ మనిషి "నేనెవ్వరో—దీనికేంగాని కాఫీ త్రాగండి" అసలు జరిగినదాన్ని పట్టించుకున్నట్టే తోచనట్లు విసిరేసింది చివరి చురుకు. అతడు టిఫెనూ, కాఫీ ఖాళీ చేసుకుని కాళ్లు, చేతులు కడుక్కోవడానికి కందకం దగ్గరగా వంగాడు—అప్రయత్నంగా కాలు కందకంలోకి జారుకుంది. తెల్లపంచె, సిల్కు లాల్చీ బురదమయమయ్యాయి. మామిడిచెట్టు నానుకుని ఆతని ముష్కరత్వానికి కూడా సానుభూతి చూపుతున్న పడుచు కొంగు నోటకుక్కుకుని ముసిముసిగా నవ్వుతోంది. అబ్బాయి నెమ్మదిగా లేచి కాళ్లకంటిన బురద తాపీగా కడుక్కుని మడతమార్చి పంచె బొడ్లో దోపుకుని పొలానికి బయలుదేరాడు. 'అడుసు దొక్కనేల? కాలు కడుగనేల?' అనుకొని ఒక కుపితచాలనం అవమానంతో అరుణత్వం నింపుకున్న అతని కళ్లమీదికి విసిరి నవ్వుతూ నడిచింది వరహాలు. తననొక కీలుబొమ్మనుచేసి ఆశల్ల ఆడించడానికి ఉబలాటపడుతున్నట్టు తోచింది అతనికి. "సరేలే — ఇప్పుడు కాదు—నీపని ఈసారి చెబుతా" అన్నట్లు చూసి ఉక్రోశంతో పెద్ద అంగ లేసుకుంటూ పొలంలో పడ్డాడు అబ్బాయి.

"ఇదిగో! ఆ గవళ్లకుర్రాడు చూడండి. చింతపిక్కలాగ నున్నని కండలు మెలిదిరిగిన జబ్బలూ, వాటిపై తాయెత్తులు వాడూను. మనం పొలంగట్టుమీద కూర్చున్నప్పటినుంచి ఏక వెర్రెత్తినట్టు ఎలా చూస్తున్నాడో పనిమాని." అని వాణ్ణి అబ్బాయికి చూపించింది వరహాలు. మనిషి ఒక వింతజంతువు. వయసులోవున్న యువతీయువకులు ఒక జంటగా ఏకాంతంలోవుండి ఏదైనా మాట్లాడుకుంటూవుంటే మతిపోగొట్టుకుని చూస్తాడు. ఎందుకో? ఏమిటో ఆకలి??

అబ్బాయి అవమానంవల్ల తనకు వరహాలుమీద కలిగిన క్రోధాన్నంతటినీ గవళ్ల కుర్రాడిమీదికి మళ్లించాడు. వాడూ మొగాడే. వయసుకాడు. తుమ్మెదుక్కలాంటి కుర్రాడు. వాడి దప్పిక ముందు

వచ్చే అబ్బాయివంకగూడా చూడనివ్వక వెనకాల వచ్చే వరహాలుమీదనే ఉండనిచ్చేసింది వాడికళ్లను. ఆచిన్నది తక్క ఇంకేమీ కనపడడంలేదు. అబ్బాయి యెదుటికొచ్చి సాగదీసి ఒక్క లెంపకాయ కొట్టాడు. దానితో వాడు తెప్పరిల్లి తెలివికొచ్చాడు.

"అదేవిటే—వాణ్ణాకొడతారేం. మీకేమన్నా మతిపోయిందా?"

"ఉండు వరహాలూ! నీకేమీ తెలీదు. రూపాయి కూలిపుచ్చుకుని పనిమాని దిక్కుదిక్కులు చూస్తున్నాడు వెధవ!" అని మళ్లీ లాగి రెండు కొట్టాడు దవడమీద.

"ఆగండబ్బాయిగారూ! ఇంక చెయ్యిమిగిస్తే మర్యాదుండదు. చౌదరీగారికొడుకు ననుకుంటుండావేమో" అని వాళ్లు తడుముకుని పనిలోనికి పోయాడు వాడు. చౌదరీ కొట్టడంకంటె దాన్ని వరహాలు చూడ్డం వాణ్ణి మరీ కాల్చివేసింది అవమానంతో. నెనుదిరగడంలో వాడు అనుపరచిన విరుపులో వేయి పడగల బుస ఇరుక్కున్నట్లు కనుపించింది.

'అసలుమనిషి ఎలా పుట్టాడంటావూ? వాడు భూమిమీద పడకుండానే, తల్లిగర్భంలో తయారౌతున్న క్షణాలలోనే వాడి శరీరకణాలలో నూటికి తొంభైతొమ్మిదింటిని స్వార్థం ఆవహించి అవి తానైపోయి వుంటుంది. లేకపోతే అబ్బాయిని చూడూ! తను చూసినపిల్లను—ఆమెరైనా సవ్యమైనది గనుకా! తనకు తెలియని విషయాపి—దాన్ని ఇంకొకడు కామెచ్చుకో గాకపోతే కనీసం కంటితో వేడుకతీరడానికైనా చూడకూడదూ? ఎంపటిఈర్ష్య? తనవస్తువు, తనఆశ, తనవాంఛ, తనస్త్రీ అంతా తనదన్నదాన్ని తనలా ఇంకొకడు చూడకూడదు. చూస్తే ఇంకేముంది? బాధ, ఏడ్పు, రోషం, దుఃఖం, యుద్ధం, అశాంతి ఇంకా ఎన్ని మహాఘోరాలున్నాయో అన్నీని—' ఇలా ఊహించుకొంటూ ఇంక అక్కడ క్షణంసేపైనా ఆగలేక ఇంటికొచ్చేసింది వరహాలు...

స షం

# యక్షగాన కవయిత్రులు

శ్రీ యస్వీ జోగారావు

పూర్వాంధ్ర కవయిత్రులలో ప్రబంధములు రచించిన వారికంటె యక్షగానములు రచించిన వారే, అందును యిటీవల రచింపబడిన ఆంధ్ర కవయిత్రుల చరిత్రకు నెక్కనివారే యెక్కువమంది గలరు. ఆ యక్షగాన కవయిత్రులు వారి కృతులను గూర్చిన సంగ్రహమైన ప్రసంగమిది: గ్రంథవిస్తర భీతినిందుదాహరణము లుజ్జగింపబడినవి.

## బాల పాపాంబ

ఈమె యక్షగాన కృతి అక్కమహాదేవి చరిత్ర। దీనికే అక్కమహాదేవి బోధావిలాస మనియు పేరు గలదు. అక్కమహాదేవి వీరశైవమత ప్రవర్తకులగు బసవేశ్వరునకు, అల్లము ప్రభువునకును సమకాలికయైన మహాశివభక్తురాలు. అతత వీరశైవమైన కర్ణాటకమున నామె కడు ప్రసిద్ధురాలు. అనేక వీరశైవ యక్షగానములకు వస్తుభిక్ష పెట్టిన మన బసవపురాణమున నామె ప్రసక్తి లేదు. కాని ప్రభులింగలీలలో గొంత గలదు. పాపాంబ కృతిలో నామె కథ యేమనగా: పార్వతీదేవి యొకపరి శివునితో పంతము పట్టి అల్లము ప్రభుని దనమాయకు దాసునిజేయ బ్రయత్నించి యది కుదరక శివు ననుమతిమున దన సాత్త్విక తేజమున భూలోకమున అక్కమహాదేవి నవతరింపజేసినది. అక్కము ఉడుతడి పురాధీశుడు విమలుని పుత్రియైనది. ఒకయానపట్టి జైన నృపాలు నొకని చేపట్టినది. కాని యతడామె కభీష్టమగు లింగధారణము చేయ నిరాకరించెను. అంతట నామె యోగావేశమెత్తి తల విరియబోసికొని నగ్నముగా నగరు వెడలి చరచర పురవీధులు గడచి అడవుల బడి కొండలు కోనలు గడచి కల్యాణపురము చేరి యట ననుభవ మంటపాభ్యంతరమున గొలువుదీరియున్న అల్లమప్రభుని దర్శించి యతని కఠిన పరీక్షకాగి, యతనివలన యోగరహస్యము దెలిసి శివుని గూర్చి తపము సేయ శ్రీగిరి కరిగెను. పార్వతి తన పంతము మానినది.

పాపాంబది జంగము కులము. నివాసము కూడలి సంగమ క్షేత్రము కావచ్చును. తలిదండ్రులు కామాక్షమ్మ, వీర వసంత వసుమతీశుడు. ఈ వీర వసంత వసుమతీశుడే కాలజ్ఞానాది శైవ గ్రంథములందుదాహృతుడైన వీరభోగ వసంతరాయడనియు, ఈతడు క్రీ. శ. 1565 లో జన్మించి తొంబది తొమ్మిదేండ్లు జీవించి క్రీ. శ. 1664 లో లింగైక్యము నొందినట్లుగా నితని ప్రశంసగల గ్రంథములు తెలుపుచున్నవనియు శ్రీ నిడదవోలు వెంకటరావు గారనుచున్నారు. ఈవిషయమింకను విచార్యము. అది నిజమే యగునేని యీమె పదునారు వందల కించుక యావల నుండెడిదనియు నీమెయే ప్రప్రథమాంధ్ర యక్షగాన కవయిత్రి యనియు ననవచ్చును

‘బాలపాపాంబ తన [illegible] తీసుడని చెప్పినది. వీరవసంతరాయడను వానికి సంబంధించిన శాసనములు కొన్ని గలవు.

1. తారమంగలము శాసనము. కాలము క్రీ. శ. *1567. (19 of 1900; M. E. R., 1900; P 31; Sewell, I P 200)* ఇందు వీర వసంతరాయడు సింహాళమును జయించినట్లు గలదు.

2. మరియొక తారమంగల శాసనము. కాలము క్రీ. శ. 1568. (సేలం జిల్లా, ఓమలూరు తాలూకా- *S. No. 122 of Vol I, Topographical list of the Inscriptions of the Madras Presidency*) ఇది తారమంగల కైలాసనాథ దేవాలయ ముఖమంట

1. ఇది యిరువదేండ్ల క్రిందటనే అచ్చుపడినదని ని॥ వేం॥ రా॥ గారనుచున్నారు. కాని దాని ప్రచురణ వివరములు తెలియవు. ఒక వ్రాత ప్రతి మాత్రము (నెం. *D. 1834*) మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్నది.

పను ఉత్తరపద్యముపైనున్నది. వీరవసంతరాయడు ఇళమ సముద్రమను గ్రామమును తారమంగలములోని కైలాసనాథ ఇశమీశ్వర దేవాయతనముల కిచ్చిన ట్లున్నది.

3. మైలంపట్టిశాసనము. కాలము క్రీ. శ. 1587. (కోయంబత్తూరు జిల్లా పొలాచి తా॥ S. No. 379 of Vol. I, T. L. I., M. P.) ఇది వీర వసంత రాయని ప్రధాని యొక్క దానశాసనము.

పై మూడు నొక్కనికే సంబంధించినవని యూహింపవచ్చును. అతడు విజయనగర రాజుల క్రింద గాని మధుర నాయకుల క్రిందగాని యొక పాళెగాడై యుండెనేమో! ఆ కాలమున సేలము, కోయంబత్తూరు ప్రాంతములందు శైవమత ప్రాబల్యము, ఆంధ్రభాషా వ్యవహారము నుండెనట్లు ఆయా మండలముల శాసనములు గజెట్లనుండి తెలియవచ్చును. పై శాసనములలో రెండవ దానినిబట్టి వీరవసంతుడు శివభక్తుడనుట గమనింప దగినది. ఇంకను ఇతరాధారములు లభించి యితడే పాపాంబ తండ్రియని స్థాపింపగలిగిన నాడామె పదు నారవ శతాబ్ది యుత్తరార్థమునకు చెందినదని నిశ్చయముగా చెప్పవచ్చు.

పాపాంబ కృతిలో జంపె, ఏక, అట, త్రిపుట, రచ్చరేకులు మొదలగు తాళప్రధానములైన దరువులు, ద్విపదలు, వచనములు, కందాది పద్యములు, అర్ధచంద్రికలు, జోలలు, శోభనములు, మంగళహారతులు గలవు. రచన చక్కనిదే. ఇందు వర్ణనలు పలుతావుల నున్నవి—కైలాసము, ఉమతపఃకల్యాణ పురవర్ణనలు, అక్కమ శైశవము, సూర్యాస్తమయ చంద్రోదయములు. కవయిత్రికి వర్ణనలన్న కడు ప్రీతి. అట్లని కథా కథనమున నైపుణ్యము ప్రదర్శింపకపోలేదు. పార్వతీ పరమేశ్వరుల పందెపు సంవాదములు, అక్కమహాదేవి మహాప్రస్థానము మొదలగు సందర్భములందు బాల పాపాంబ యథాశక్తి తన విదగ్ధత ప్రదర్శించినది. ఇది వీరశైవ మత ప్రతిపాదకమగు కృతియైనను నిందు విష్ణుస్తుతియు నుండుట విశేషము.

## పసుపులేటి రంగాజమ్మ

ఈమె తంజాపురాంధ్ర నాయకరాజు విజయ రాఘవు నాస్థాన కవయిత్రి. 'మంగమాంబా వేంకటాద్రు లీమె తలిదండ్రులు. ఈమె రాజనీతిలో, పత్రికా లేఖనములలో, పదకవిత్వములో, బహుభాషలలో విశేష ప్రజ్ఞాశాలిని యని తెలియుచున్నది. రాజుగారిచే కనకాభిషేక సత్కారము గాంచినది. ఈమె రచనలు రామాయణ భాగవత భారతకథా సంగ్రహములు (అనుపలబ్ధములు), ఉషా పరిణయము, మన్నారు దాస విలాస ప్రబంధములు, మన్నారు దాస విలాస నాటకము. ఆనాటికే నాటకశబ్దము రూపక సామాన్యవాచియై యక్షగానమునకును పరిపాటిగా పర్యాయ వ్యవహారమైనది. రంగాజమ్మ తన కృతిని మహానాటకమనియు నన్నది. అట్లనుటయు మరియొక మాటవరుస. ఆ మన్నారుదాసవిలాస నాటకమంతయును దా పేర నా పెయే వ్రాసిన ప్రబంధమునకే పరివర్తనము. మన్నారనగా విజయరాఘవ భూపాలుని యిష్టదైవము రాజగోపాలస్వామి. విజయరాఘవుడే మన్నారుదాసుడు. అతని విలాసమునగా ఆస్థాన వైభవము, వివాహోదంతము నిందు బహుధా వర్ణితము. ఇందు సమకాలిక జాతీయజీవన ప్రతిబింబమున కద్దము పట్టినది రంగాజమ్మ. ఏతద్రచనా కాల నిర్దిష్టముగ నిర్ణయించుట కవకాశము లేదు. కాని గ్రంథాంతరమున శోభకృత్సంవత్సరము పేర్కొనబడినది. అది తాత్కాలికేతివృత్తము కాబట్టి, ఆ శోభకృత్తు విజయ రాఘవుని రాజ్యపాలన కాలము (క్రీ. శ. 1633-73)న క్రీ. శ. 1662 - 63 కాబట్టి మ॥ దా॥ వి॥ నాటకము 1664 లో రచింపబడి యుండవచ్చు ననవచ్చును.

ఇందు సంస్కృతశ్లోకములు, చూర్ణికలు, బహువిధప్రాకృత తమిళ కన్నడ ప్రసంగములు, ప్రసిద్ధ రాగతాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు, కవి వచనములు (సంధి వచనములు - పద్యములలో గూడ), బహువిధ తాత్కాలిక వ్యావహారిక ఫోరణులలో వచనములలో సంభాషణలు, గ్రంథాద్యంతములందు నాందివంటి కైవారము, భరత వాక్యము, మంజరి, ధవళము, శోభనము, జోల, సువ్వాల మొ॥ రచనావిశేషము లనేకము గలవు. రచన చదువ జదువ చవులూరించునట్టిది. రచనలో మన యక్షగానములలో మన్నారుదాసవిలాస నాటక మొక మేలుబంతి ప్రక్రియగా యక్షగాన పరిణామ చరిత్రలో నదియొక మేలురాయి.

## అన్నదానము వేంకటాంబ

ఈమె కృతి యక్షగాన రామాయణము. (బాల కాండము మాత్రము). ఇది 1912 లో కర్నూలు

చంద్రమౌళీశ్వర ముద్రాక్షరశాలయందు ముద్రితమై అన్నదానము రామలక్ష్మమ్మగారిచే ప్రకటింపబడినది. గ్రంథారంభమున రామలక్ష్మమ్మగారొక విజ్ఞప్తిచేసి యుండిరి. అందు గ్రంథకర్త్రినిగురించి 'ఇప్పటికి సుమారు రెండువందల సంవత్సరముల క్రిందట సేలం జిల్లా హోసూరు తాలూకా లోగిర అగ్రహారమును శ్రోత్రియగ్రామముగను నా పూర్వీకులైన అన్నదానం వెంకటరామావధానుల భార్య వెంకటాంబ ..' అని యున్నది. దానినిబట్టి గ్రంథకర్త్రి పదునెనిమిదవశతాబ్ది ప్రథమపాదమున నుండెనని చెప్పవచ్చును. వెంకటాంబ గ్రంథాంత ద్విపదలో వంశమును భర్త పేరును జేర్కొన్నది. అది సరిపోయినది కాని యామె నివాసముమాత్రము రామలక్ష్మమ్మగారు చెప్పినట్లుకాక కొమురవద్రీతీరమున వీరరాజమను నగ్రహారమని యున్నది. దానికే లోగిర మరియొక పేరు కాబోలు.

గ్రంథకర్త్రి దీనిని యక్షగానమని పేర్కొని యున్నను ఆమెవారు పాడుకొనుటకుమాత్రమే యుద్దేశించినది. రామలక్ష్మమ్మగారును ఈ గ్రంథమును లిఖితప్రతులమూలమునగాక పారాయణపరుల గాత్రములనుండియే సేకరించిరి. అట్లు నానాట నానోట నానోటనాని వచ్చుటచేతను, ముద్రాపకుల పొరపాటు వలనను, అసలు గ్రంథకర్త్రి అనభిజ్ఞతవలనను నీ గ్రంథమనేకదోషాకరమైనది. ఇందు ప్రసిద్ధ రాగతాళములలో దరువులు, కీర్తనలు, ద్విపదలు, సీసగీత పద్యములు, వచనములు, లాలి, శోభనము, మంగళహారతి మొదలగు పాటలును గలవు. కథ ప్రసిద్ధమైనది. అంతయు నాఖ్యానశైలి. అటనట వర్ణనలు గలవు. రాముని బాల్యము, సీతాకల్యాణ ఘట్టము చక్కగా తెనుగున సంక్షేపమగునట్లు వర్ణింపబడినవి.

## తరిగొండ వెంగమాంబ

ఈమె యింటిపేరసలు తరిగొండవారు కాదు. తరిగొండ కడపమండలములో నొక గ్రామము. అది యీమె నివాసము. ఈమె పుట్టినింటివారి పేరు కానాలవారు. నందవరీక బ్రాహ్మణులు, వాసిష్ఠ గోత్రమువారు. ఈమె తండ్రి కృష్ణార్యుడు, తల్లి మంగమాంబ. భర్త శ్రీవత్సగోత్రోద్భవుడును తిమ్మార్యుని పుత్రుడునైన వేంకటాచల పతి యనియు నామె ద్విపద భాగవతమువలన తెలియుచున్నది. అందతని యింటిపేరు 'ముంజేటి' యని గలదు. మరికొన్నిట 'నింజేటి,' 'ఇంజేటి' యనియు గలదు. ఏ దెట్లయినను ఆమెకు తరిగొండ వెంగమాంబ యనియే ప్రసిద్ధి వచ్చినది. భర్తృవియోగానంతర మామె బాహ్యచిహ్నములు వీడి తన యిలువేల్పగు తరిగొండ నరసింహుని గురువుగా నింటిపేరు గ్రహించినది. ఇష్టదైవతము తిరుపతి వేంకటేశ్వరుని పేరెట్లును నామెకు గలదు. ఆ యిరువురు వేల్పులకు అభేదము పాటించి చాల కృతు లర్పించిన దామె. వేదాంత విషయికములగు కృతులు కొన్నిటి నామె తన గురువగు సుబ్రహ్మణ్యార్యున కంకితము చేసినది. వెంగమాంబ కాలము క్రీ. శ. 1840 ప్రాంతమని సి. పి. బ్రౌను, శ్రీ కందుకూరి వీరేశలింగము గారును నిశ్చయించి యుండిరి. మధిర సుభద్రమ్మగా రామె సమకాలికురాలు.

వెంగమాంబ: 'నా చిన్ననాట నోనామాలనైన నాచార్యు లెవరు నా కొనతిలేదని చెప్పినది కాని పదునైదు కృతులు రచించిన ప్రౌఢ యామె. అవి వేంకటాచల మాహాత్మ్యము, నారసింహ శతకము, నారసింహ విలాస కథ, రాజయోగసార ద్విపద, ద్విపద భాగవతము, వాసిష్ఠ రామాయణ ద్విపద, శ్రీకృష్ణ మంజరి, రమా పరిణయము పెండ్లిపాట, శివనాటకము, కృష్ణ నాటకము, పారిజాతాప హరణము, చెంచునాటకము, రుక్మిణీ నాటకము, గోపికా నాటకము, ముక్తికాంతా విలాసము. ఇందు పద్యకావ్యములు, ద్విపదలు, శతకములు, యక్షగానములు, పాటలును గలవు. ప్రక్రియా వైవిధ్యమే కాదామె సాహిత్యమందు భక్తి, శృంగారము, వేదాంతము మొదలగు విషయవైవిధ్యమును గలదు. ఆమె గ్రంథములు చాల లభించినవి. కొన్ని ముద్రితములైనవి. పై పట్టికలో చివరి యేడును యక్షగానములే. అందు రుక్మిణీ గోపికా నాటకము లలబ్ధములు. నారసింహ విలాస కథయు యక్షగాన మను పేరో యనుకొందునుగాని యదియు నలబ్ధము. ఈ గ్రంథములలో:

౧. శివనాటకము లేక శివ విలాసము:2

ఈ గ్రంథమునకు కవయిత్రి పెట్టిన పేరు లివే కాని కొందరు లేఖకు లొక క్రొత్తపేరు పెట్టినారు,

2. ఇది అముద్రితము. దీనికి ఆంధ్రసాహిత్య పరిషత్తులో నొక కాగితపు ప్రతి (సం .77)

'శివపారిజాత' మని. పారిజాత ప్రసక్తి యిందెక్కడను రాదు కాని నారదుడు పారిజాతము కారణముగా సత్యభామా రుక్మిణుల మధ్య సవతి కయ్యము తెచ్చిపెట్టినట్లే యింకొక రత్నహారముద్వారా శివపత్నులు గంగా గౌరులకు సవతి కయ్యము కల్పించును. సందర్భసాదృశ్యమునుబట్టి లేఖకుడు చేసిన పని యిది. అసలు శ్రీకృష్ణ కథలోవలె శివకథలో గూడ పారిజాతమునకే ప్రసక్తి కల్పించి కొందరు శివపారిజాతము లను పేర యక్షగానములు రచించిరి. తరిగొండ వెంగమ సమకాలికుడే యట్టివాడొకడు గలడు. అతడు తంజావూరు మహారాష్ట్ర ప్రభువగు శివాజీ ఆస్థానకవి వెంకటకృష్ణా జెట్టి. కాని యీ తరహాకృతులన్నిటిలో వెంగమాంబదే మున్నెన్నదగినది. ఇందు లక్ష్మి కొరవంజియై గంగ కెరుక చెప్పుట, నారాయణుడు సింగడగుట, ఆ సింగిసింగళ్ల ప్రసంగము, గంగ గౌరుల సంవాదము హృదయంగమముగా సాగినవి. ఇందపప్రయోగము లనేక మున్నవి. కాని సహృదయ సంభావనమునకు గొదువపడదు. వెంగమ శివకథయగుట చేతను గాబోలు ఈగ్రంథమును రాచవీటి వీరభద్రున కంకిత మొనర్చినది.

౨. కృష్ణనాటకము : లేక బాలకృష్ణనాటకము 3

గోపికా కృష్ణ సంవాదము—కృష్ణు డదృశ్యుడగుట—గోపికల అన్వేషణ—అతడు ప్రసన్నుడై వారలతో జలక్రీడ లాడుట—రాధ విరహ వేదన—ఆమె గోపాలుని పాలికి చెలికత్తెను బుత్తెంచుట—గోపికలా రాధా సఖిపై గోపించుట—కృష్ణుడు రాధను ప్రసన్నురాలిని జేసికొనుట—ఇదీ యిందలి విషయము రచన యొక మోస్తరు.

3. పారిజాతాపహరణము4 :

ఇదియొక పెద్ద యక్షగానము. సుమారు రెండు వేల గ్రంథము. వెంగమ య॥ గా॥ కృతులన్నిట పెద్ద దనుటయే కాదు ప్రథమ గణ్యమును. కృష్ణుడు పారిజాత వృక్షమునే తెచ్చెదనని సత్య ననునయించి సుఖించుచున్న ఘట్టముతో నిందలి కథారంభము. పూర్వకథ సంగ్రహముగా ప్రస్తావింపబడినది. కృష్ణు డొకనాడామెను గికురించి కపటము రాణుల గలియ బోవుట — సత్యభామ విరహము — సత్యాకృష్ణుల సందేశములు—సంవాదములు—సత్యకడకు సరస్వతి కొరవంజియై వచ్చుట—బ్రహ్మ సింగడగుట— సత్య తపస్సుచే ప్రియుని ప్రసన్నుగావించుకొనుట—కృష్ణుడు స్వర్గమున కేగుట కొక నెపము కల్పించుకొనుట—నరకాసురవధ కథ అప్పుడను సంబంధింపబడినది. సందర్భోచితమైన మార్పు—తరువాత పారిజాతాపహరణము—ఇంద్రోపేంద్రుల యుద్ధము—దివిజ రిపువు సత్యభామ పెరటికి దిగగానే సవతుల కయ్యము—రుక్మిణి లగవు దీర్చుట—సత్య సవతులకు పారిజాతపు పూల వాయనము లిచ్చుట—ఇట్లు పారిజాత కథ బహుధా ప్రపంచింపబడినది. శృంగార హాస్యరసములు వెల్లివిరిసినవి. సంభాషణలు చతురముగా, రచన రసోత్తరముగా సాగినవి. అవశ్యము లోక ప్రకాశన మొనర్పదగిన కృతులలో నిదియొకటి.

౪. చెంచు నాటకము 5 :

చెంచులక్ష్మి చెల్లెలు తనప్రియుని వెదకికొనుచు బావగారి భవనపు చాయలకు వచ్చును. ఆట తరి

---

కలదు. మరియొక ప్రతి (నెం. $\frac{1493}{5}$) కలదు గాని దాని పత్రము లట్టకట్టుకొని పోయినవి. నెం 1749 సంపుటిలో నొక యెనిమిదాకు లీ గ్రంథమునందలి యొక ఘట్టము. అది పొరబాటున వేంకటేశ్వర కల్యాణమను యక్షగానముగా ఆం॥ సా॥ ప॥ అముద్రిత గ్రంథసూచికలో నుదాహరింపబడినది. శివవిలాసమునకు మరి రెండు తాళపత్ర ప్రతులు (*Nos. 32 E 19 & 32 H 8*) అడయారు లైబ్రరీలో గలవు. ఆం॥ సా॥ ప॥ ప్రతిలో మాత్రము వెంగమాంబ తండ్రి శేషార్యుడని గలదు కాని అడయారు ప్రతులలో, నామె కడమ గ్రంథములలో కృష్ణార్యుడనియే గలదు. అదియే గ్రాహ్యము.

3 ఇది అముద్రితము. ఆంధ్ర సాహిత్య పరిషత్తున దీని అసమగ్ర తాళపత్రప్రతి యొకటి (నెం. 1566) గలదు.

4. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున విష్ణు పారిజాతమను పేర దీని కాగితపు ప్రతి యొకటి (*R. No. 1056*) గలదు. శివ విలాసము తప్పుగా శివ పారిజాతమని వ్యవహృతమైనది. తద్భిన్నత సూచింపబడుట కిది విష్ణుపారిజాతమైనది.

5. ఇది అమెరికన్ డైమండు ముద్రాక్షరశాల ప్రచురణ, మదరాసు, 1927. ఇందలి గ్రంథాంత ద్విపదలో వెంగమాంబ తల్లి గంగమాంబ యని కలదు. ఈ ముద్రణము నిర్దుష్టమైనది కాదు. అదికాక కడమ గ్రంథము లందెల్ల మంగమాంబ యనియే గలదు. అదియే గ్రాహ్యము.

గొండ నరసింహస్వామి ద్వారపాలకులచే పృచ్ఛింపబడి చెంచెత తన చరిత్ర, తనవారి చరిత్ర యావత్తు ఏకరువు పెట్టును. తరువాత నామె ప్రియుడు చెంచునాయకుడు వచ్చినాడు. అతనితో వాదులాట అయిన తరువాత చెంచెత బుడుత నతని కప్పగించి వేటకుబోవును. ఆమె తిరిగి వచ్చుసరికి చెంచునాయని బెదిరించి యొక పులి యా శిశువు నెత్తుకొనిపోవును. చెంచెత లెంతో సంగలార్చి యార్చి చివరికి శ్రీ వెంకటేశునకు మ్రొక్కుకొని శిశువును బడయును. ఇందు చెంచుల కులాచారములు చక్కగా వివరింపబడినవి. చెంచెత పుత్రశోక ఘట్టము హృదయము నదిలగొను నట్టిది.

౫. ముక్తికాంతావిలాసము లేక వేదాంతజ్ఞానబోధిని:

ఇందు తత్త్వవిషయము సాంకేతికముగా సాగినది. తంజావూరు అముద్రిత గ్రంథసందాయమునందలి వివేకవిజయము, ముక్తికాంతాపరిణయము, జీవనాటకము, రాజరంజన విద్యావిలాసము, అం॥ సా॥ పరిషత్తునందలి ముక్తికాంతావిలాస కురవంజి మొదలగునవన్నియు నించుమించీ కోవలోనివే. అవన్నియు కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయమునకు మానసపుత్రికలు.

వెంగమాంబ కృతియందలి విషయము వేదాంతిమైనను రచన యొక్క భామకలాపమువలె నడచినది. జగదీశ్వరుడు మాయనుబడి ముక్తికాంతను బొందగోరి యామె మందిరమునకు వచ్చుట, జ్ఞానకాంత తలుపు మూయుట, నాయికానాయకుల ఉత్తర ప్రత్యుత్తరములు, సంవాదములు జూచి కృష్ణుడు భామయింటికి వచ్చుట, చెలికత్తెలు తలుపులు మూయుట, నాయికానాయకుల రాయబారములు స్ఫురించును. మాయాశక్తి వైరాగ్య జ్ఞానశక్తులతో వాదించుట నవకుల కొట్లాటను తలపున కెలయించును. విషయము క్లిష్టమగు వేదాంతిమైనను చెప్పుటలో సాధ్యమైనంత సౌలభ్యము చూపించినది గ్రంథకర్త్రి. ఇది సుబ్రహ్మణ్య గురునకు సమర్పించినది.

వెంగమ యక్షగానకృతులన్నియు మంచి నాటకపువాటము గలిగియుండును. వెంగమనాటికే యక్షగానము లనేకము వెలసినవి. ఆమెకు యక్షగాన లక్ష్యలక్షణపరిజ్ఞాన మెక్కువగా నున్నట్లు తోచును. ఆమె కృతులలో నటనటరాగములు పేర్కొనబడినను దరువు లెక్కువగా జంపె, కురుచజంపె, అట, ఏక, త్రిపుట, ఆది మొ॥ తాళముల ప్రాధాన్యముతో నే తరచు తరిగొండ శేషాచలేశముద్రలు గలిగియుండును. ద్విపదలు, మంజరి, పద్యములు, సీసార్ధ కందార్థములు, వచనములు, ఏలలు, గొబ్బిళ్లు, సువ్వాలలు, ధవళ శోభనములు, మంగళహారతులు, మొదలగు పాటలు, శ్లోకములు, చూర్ణికలు, దండకములు మొదలగు పలు రకముల రచనావిశేషములు గలవు. లోకోక్తులు, ప్రయోగవిశేషములు ననేకము గలవు. ఆమె తన వేంకటాచల మాహాత్మ్యములో శృంగారమునకును దినమును చుక్కదురన్నట్లు మాటలాడినదికాని యామె యక్షగానములందు దది సమృద్ధిగా గలదు. ఆమెకు ఎఱుకలు చెంచులు మొదలగు ఆటవికజాతుల జీవిత విశేషములనుండి గహనములైన యోగశాస్త్రరహస్యములవరకు గల అనేకవిషయములు దెలియును. ప్రజామోదము చూరగొన్న యక్షగానముల ప్రత్యేకత లగు నవతికయ్యము, ఎఱుకఘట్టము మొదలగు పట్టులందు పూనుకొని మంచి పనితనమును బ్రదర్శించినది వెంగమాంబ. ఆమెవలెనన్ని యక్షగానము లింత సమర్థముగా రచించిన కవయిత్రులు లేరు సరికదా కవులు నరుదు. తరిగొండ వెంగమ గారి తరువాతి తరములో యక్షగాన కవయిత్రు లెక్కువమంది కన్పింతురు.

## ఏనుగుల చూడమ్మగారు

ఈమె శ్రీ ఎరగుడిపాటి వేంకటాచలము పంతులుగారి పుత్రికయట. పంతులుగారు పంతొమ్మిద శతాబ్ది యుత్తరార్ధమున నుండినట్లు వినికిడి. చూడమ్మగారి కృతి రుక్మిణీకల్యాణము [7] ఇది యక్షగానమని కాని, మరి యేమనిగాని, చెప్పబడలేదు. యక్షగాన లక్షణము కొంత పట్టినది. ప్రసిద్ధ రాగతాళములలో జాల దరువులు, సంధి వచనములు,

6. [illegible] ను బదిలిన రాజమండ్రి గౌతమీ గ్రంథాలయ ప్రతిలో దాని ముద్రణ ప్రచురణాదికములగూర్చిన వివరములు లేవు. ఆ సంపుటములో చివర నొక పదిపుటలలో వెంగమాంబవే తత్త్వకీర్తనలు గలవు.

7. ఇది శే 11 8 1879 న కాకినాడ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

జోలలు, లాలిపాటు, గొబ్బిపాట, నలుగుపాటు, మేలుకొలుపులు, మంగళ హారతులు మొదలగు పలు పాటలు నిందు గలవు. గ్రంథము పేరు రుక్మిణీకల్యాణమైనను నందు రెండువంతులు శ్రీకృష్ణుని బాల్య క్రీడాదికమే వర్ణితమైనది. గ్రంథము రుక్మిణీ కల్యాణముతో నంతమైనది కనుక ఆ పేరు పెట్టిన దనవచ్చును. కథ యెక్కువగా ఆఖ్యాన శైలిలోనే సాగిపోయినది. గ్రంథకర్త్రి తాను యతిగణ ప్రాసలనైన నెరుగ ననియు, 'గురుపాదము చెంతజేరి యిల రవ్వంత కవనము చెప్పబూని మీ చెంత జేరి నిలచియుంటి' నన్నది కాని రచనలో నేమియు గొదువ లేదు. సలక్షణమైన భాషలోనే సరసముగనే వ్రాసినది. గ్రంథకర్త్రికి తత్వశాస్త్రమున గొంత ప్రవేశమున్నట్లున్నది.

## సూర్యనారాయణ శాస్త్రి సుత

ఈమె నామాదికమును గూర్చిన వివరము లేమియు దెలియుట లేదు. ఈమె నివాసము గోదావరీ మండలము చొప్పెల్ల ప్రాంతమనియు, నీమె కాలము 19వ శతాబ్ది యుత్తరార్ధము కావచ్చుననియు, నూహ. ఈమె కృతి నామము శుక చరిత్రము[8] ఇది సరికొల్లా పాట (పేట ?) వేణుగోపాలస్వామి కంకితము. జనక మహారాజునకు ప్రజ్ఞాంగన యందు అంతరంగిక యజ్ఞఫలముగా ముక్తికాంత పుట్టుట. ఆమెకు శ్రీశుకునితో వివాహ మొనరించుటయు నిందలి విషయము. ఇందు దరువులు, ద్విపదలు, పద్యములు, వచనములు గలవు. రచన యొక మోస్తరు. సాంకేతిక సంవిధానము సమంజసముగ నున్నది.

## శ్రీ రామ పుత్రి

ఈమెయు దన పేరు చెప్పుట కిష్టపడినది కాదు. తండ్రి పేరే చెప్పినది. కాని యీమె తండ్రి శ్రీరాములు గారిది కౌశిక గోత్రము. ఈమెది శౌనక గోత్రము. అనగా నీమె వివాహితయో తదుపరి యెప్పుడో చెప్పినది కృతులు కొన్ని. ఈమె తల్లి పేరు విశాలాక్షమ్మ. ఈమె యక్షగాన కృతి సీమంతినీ చరిత్రము.[9] సీమంతిని యను రాజపుత్రిక నలపౌత్రుడగు చిత్రాంగదుని (చంద్రాంగదుని) తో వివాహమగుట — యమునలో నౌకా విహారము చేయుచుండగా నతని పుట్టి మునుగుట — సీమంతిని సోమవారవ్రత దీక్ష కారణముగా అతడు సురక్షితుడై కొన్నాళ్ళకు మరలివచ్చి సీమంతినిని జేపట్టుటయు నిందలి విషయము. ఈ సోమవార వ్రతమహాత్మ్య కథ యితివృత్తముగా మరికొన్ని యక్షగానములు గలవు. వానిలో నెల్ల నిదియే మేలుతరమైన దనవచ్చును. ఇందు అట, త్రిపుట, ఏక, జంపె, రుద్రజంపె మొ॥ తాళ ప్రధానములైన దరువులు విరివిగా నున్నవి. తోడి పున్నాగాది రాగములలో గొలది పాటి కీర్తనలు, కొలది పద్యములు, సంధి వచనములు, ద్విపదలు, అర్ధచంద్రికలును గలవు. 'ఓడం' అను రచనా విశేష మొకటి గలదు. రచన నెట్టి కుంటుపులు లేక సాఫుగా సాగిపోవును. దోషము లల్పము. ఇందలి పెండ్లి పాటలలో బువ్వము బంతుల పట్టు దనిగొల్పును. ఇది కాశీ విశ్వనాథున కంకితము.

## శేషాంబ

ఈమె నివాసము కర్నూలు జిల్లా కోయిలకుంట్ల తాలూకా నందిపాటి గ్రామము. కాలము క్రీ. శ. 1900 ప్రాంతము కావచ్చును. ఈమె కౌనులవారి యాడుపడుచు. కౌనుల రంగయ్యగారి పుత్రిపంచకమున కనిష్ఠురాలు, ఆశ్వలాయన సూత్రులు వసిష్ఠ గోత్రులు నందవరీకియులగు పుల్లయ్యగారి దత్తపుత్రులైన రామస్వామి యీమె తండ్రి. తల్లి నిట్టరప్పన గారిపుత్రి రంగమాంబ. ఈమె తనవిమ్ముడు శేషయ్య ప్రోత్సాహమున మిత్రవిందా పరిణయము[10] యక్షగాన నాటకమును నందిపాటి కృష్ణసుబ్రాయితో రచించినది. మిత్రవింద శ్రీకృష్ణుని నష్టమహిషులలో నొకతె. ఈమె

8. దీని వ్రాతప్రతి యొకటి తే 20-12-1900 న వ్రాయబడినది శ్రీ వేగునూరి గంగాధరము గారి కడ నున్నది. దయతో వారది నాకొసగిరి. వారికి నా ధన్యవాదములు. వారు దానిని తూర్పు గోదావరిజిల్లా చొప్పెల్ల గ్రామవాస్తవ్యులు శ్రీ వాడ్రేవు శేషగిరి రాయకవిగారి నుండి సేకరించిరి. ఆ కవిగారు దీని నెవరిచేతో పాడగా వ్రాసికొనిరట.

9. ఇది [illegible] సాహాయ్యమున మదరాసు పమ్మి త్యాగరాయ సెట్టిగారి శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు సం. 1907 లో ముద్రితము.

10. ఇది 1919 లో అనంతపురము ఎ. పి. కవి అంతుకో వారి బాల భారతీయ ముద్రాలయమున ముద్రితము.

పరిణయమాగాధ భాగవతమున అస్థిపంజరముగా నున్న దాని నీమె యపూర్వ పాత్ర చిత్రణముతోడను సరస సంభాషణల తోడను సన్నివేశముల తోడను మాంసలముగా దిద్ది మనోజ్ఞ నాటక ఫక్కికను రచించినది. మిత్రవింద విప్రలంభము, స్వయంవరాగతులైన వివిధ దేశాధిపులతో విందానువిందులతో కృష్ణుని యుద్ధము, ద్వారకలో మిత్రవిందా కృష్ణుల కల్యాణము సుద్భుటగా వర్ణింపబడినవి. ప్రసిద్ధ రాగ తాళములలో దరువులు గలవు. గ్రంథారంభమున చోప్దారు మొదలు ముఖ్యపాత్రల కన్నిటికిని ప్రవేశక్రమవాగానముతోడనే రంగప్రసక్తి. పద్యములు, కందార్థములు, ద్విపదార్థములు, సంధి వచనములు, సంవాద వచనములు, లాలంటు శోభనము, నలుగు, సువ్వి, మంగళహారతులు మొదలగు పాటలు, తరంగములను పేర తాళ జతులు నిందు గలవు శృంగారవీర రసములు పోషింపబడినవి. ఆనువారి వరస్వీకరణాధికారమును చమత్కారముగా సమర్థించినది కవయిత్రి.

## ముడుంబై అలమేల్మంగ తాయారమ్మ

ఈమెది కౌశిక గోత్రము, ఈమెకు తిరుమంత్రోపదేశము చేసినవారు నరసింహ దేశికులు. ఇంతకంటె నీమెను గూర్చిన విశేషము లెరుకపడలేదు. ఈమె రచించిన యక్షగానము సుల్తానీ కల్యాణము 11 ఇది యాదవాద్రీంద్రునకు గృతియైనను గ్రంథాంత ద్విపదలో పీఠికాపుర కుంతి మాధవస్వామి తలపబడి యుండుటచే నీమె గోదావరీ మండల వాసిని యని తోచుచున్నది. గ్రంథారంభమున నామెయే స్వయముగా నొక వచన పీఠిక వెలయించుట జూడ నామె యాశునికపరాలని ఘంటాపథముగ జెప్పవచ్చును. ప్రజాసామాన్యమున ప్రచారమున నున్న బీబీనాంచారి కథ యీ గ్రంథమునందలి యితివృత్తము. ఆ కథకు ఆకరము ఆచార్య సూక్తి ముక్తావళి. సురతాణి కల్యాణము నను నింకొక యక్షగానము కర్తృత్వ మెరుగబడనిది గలదు.12 అదియు స్త్రీ రచనవలె గన్పట్టుచున్నది. అందలి కథ శ్రీరంగనాథుడు ఢిల్లీ సుల్తాను కూతురును వివాహమాడుట. తిరుకూరమ్మగారా గ్రంథమును జూచినది. ఈమె గ్రంథమందలి కథలో నించుక మార్పుగలదు. ఇందు మైసూరు మండలమునందలి మేలుకోట అనే యాదవాచలము, అచటి పెరుమాళ్ళు మూలవరులకు తిరునారాయణ పెరుమాళ్ళనియు, ఉత్సవులకు రామప్రియుడను, శెల్వపిళ్ళె (చెల్లపిళ్ళె) రాయుడను, సంపత్కుమారుడు ననియు బేళ్లు. మేలుకోట యొకప్పుడు పాదుషా పరిపాలనలో నుండినది. అతడు హిందూ దేవాలయములను కొల్లగొట్టి దైవ విగ్రహములను గొనిపోయెనట. లక్ష్మీదేవి నిర్హేతుక జాయమాన కరుణ నతని కోమార్తెగా నవతరించినదట. ఆమె రామప్రియుని అర్చావిగ్రహము నంతఃపురము నకు గొనిపోయి సేవలు చేసి స్వామిని ప్రసన్నుగావించుకొని గాంధర్వవిధి నతని వివాహమాడినదట. ఇది తాళ ప్రధానములైన దరువులు ప్రచురముగాగల రచన. ఇందు ద్విపదలు, సీసములు, కందములు, ఏలలు, లాలి, అర్ధచంద్రికలు, ధవళశోభనములు, సంధివచనములును గలవు. ఛందోదోషము లెడనెడ నున్నను తాయారమ్మ కృతి తత్పూర్వకృతికంటె కథాకథన విధానమునను శయ్యా సౌభాగ్యమునను చాల మేలుగా నున్నది.

## రామానుజమ్మ

వరయోగి జియ్యరు తిరువడి సంబంధురాలగు నీ రామానుజమ్మ శ్రీరంగనాథ పంగున్యుత్తరోత్సవ యక్షగానమును 13 రచించినది. ఇది ప్రచురణకాలమున (1927) కించుక పూర్వము రచింపబడినట్లు

11. ఇది 1917 లో దాసు కేశవరావు పంతులు గారి బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

12. ఇది 1952 లో రాజమండ్రి చింతామణి ముద్రాక్షరశాలయందు ముద్రితమై కర్రా అచ్చయ్య అండు సన్సు వారిచే ప్రకటింపబడినది. క్రీ. శ. 1854 లో వారణాసి అచ్యుతరామకవి సురతాణీ పరిణయము ప్రబంధరూపమున వ్రాయుచు నా కథ యిది వరకు యక్షగాన రూపమున గలదని చెప్పెను. అది యిదియే కావచ్చును.

13. ఇది శ్రీ ఉ. వే. న. చ. దేశికాచార్యుల వారిచే సరిచూడబడి వారి తిరువడి సంబంధురాలగు కొత్తూరు రంగనాయకమ్మచే 1927 లో ప్రచురింపబడినది. చెన్నపురి నాతా నమ్మయ్యసెట్టి అండు సన్ వారి శ్రీ రామానుజవిలాస ముద్రాక్షరశాలయందు ముద్రితము.

తోచును. ఇది పదినాళ్ళ రంగస్వామి ఫాల్గుణోత్సవపు వేడుకలు ముచ్చటింపబడిన గ్రంథము. ప్రధాన కథ: రంగనాథుడు రంగనాంచారితో జెప్పకుండ వరయూరు నాంచారు (చోళ రాజపుత్రి; పేరు కమలవల్లి) కడకేగుట—నారదుని కైలాటము—రంగనాంచారు అలక—నమ్మాళ్వారి తియ్యారింపు—రంగనాయికా నాయకులకు తలుపుదగ్గర సంవాదము—తరువాత సమాగమము—సఖీజనుల సపర్యలు—పదియవనాడు స్వామి పంగుణ్యుత్సవ రథోబంధము విప్పుట—మరునాడుత్సవాహూతులై వచ్చిన పెద్దలు స్వామి సెలవు గైకొని తమ తమ నెలవులకు బోవుట. ఈ గ్రంథమునకు నంబెరుమాళ్లు చరితమనియు పేరు. ఇందు ప్రసిద్ధ రాగతాళములలో దరువులు, ద్విపదలు, పద్య గద్యములు, ద్విపదార్థ కందార్థ వృత్తార్థములు, అర్థ చంద్రికలు, ఏలలు, నలుగుపాట, తలుపుదగ్గరి పాట, లాలిపాట, బంతిపాటలును గలవు. ఇది యే బాలవిశ్వే స్థలకో ఏ విస్తళ్లు కుట్టుకొను వేళనో పాట కాలక్షేపమున కింత పనికివచ్చునట్టిది మాత్రము. రకరకముల దోషముల కాకరమీ గ్రంథము.

ఇప్పటికి మన యక్షగాన కవయిత్రులందు ముఖ్యమైనవారినిగురించి ముచ్చటించినట్లే. ఇక కర్తృత్వము తెలియని యక్షగానములు కొన్ని గలవు. అందు కొన్ని యచ్చముగా స్త్రీ రచనలని తోచును. అట్టివానిలో అండాళుచరిత్ర14 యొకటి. వీ తద్గ్రంథకర్త్రి ఈచంబాటి శ్రీనివాసాచార్యుల శిష్యురాలని మాత్రము ఇందలి కొన్ని పాటలవలన దెలియుచున్నది. పై రామానుజమ్మ యక్షగానము చివర తెంగచిందను రంగనాథ స్తుతిపరమైన గేయరచన చరమ చరణమునందు 'ఈచంబాటి శ్రీనివాసాచార్ల కృపను— రంగా! దాసురాలిని బ్రోవరా? అని కలదు. రామానుజమ్మ కృతి ప్రచురణకర్త్రియైన కొత్తూరు రంగనాయకమ్మగారు వే కృతికర్త్రిచే కృతజ్ఞతా సూచకముగానట్లు స్మరింపబడియుండును. ఆ రంగనాయకమ్మ గురువు, అండాళుచరిత్ర గ్రంథకర్త్రి గురువు ఈచంబాటి శ్రీనివాసాచార్యులే కావున నామెయు నీమెయు నొక్కరే కావచ్చును. అనగా అండాళుచరిత్ర కృతి రచయిత్రి కొత్తూరు రంగనాయకమ్మ కావచ్చుననుట. అగుచో నాండాళుచరిత్ర యీ శతాబ్దపు కృతియే యగును. అండాళనగా ఆముక్తమాల్యదగా ప్రసిద్ధి వడసిన గోదాదేవి. ఆమె భూదేవి (భూపిరాట్టి) యవతారమనుట. పెరియాళ్వారను విష్ణుచిత్తుని కూతురు. ఆమెకే చూడికుడుత్త నాంచారని నామాంతరము. శ్రీరంగనాయకుని కొలుపుకు దేవేరులు—రంగనాంచారు, నీల, మహాదేవి, వరయూరు నాంచారు, చూడికుడుత్త నాంచారు, బీబీనాంచారు. రామానుజమ్మయు, రంగనాయకమ్మయు కూడ బలికికొని చెరియొక నాంచారు కథను గ్రహించి కృతులు రచించిరేమో. ఇరువురి కృతులందును రచనా సాదృశ్యము కొంత గలదు. ఇందును ప్రసిద్ధ రాగతాళములలో దరువులు, పద్యములు, వచనము, మంజరీ ద్విపద, కందములు కందార్థములు, సీసములు సీసార్థములు, ఏలలు, అర్ధచంద్రికలు, పలురకముల పెండ్లిపాటలును గలవు. రామానుజమ్మ కృతిలోని దోషములవంటి దోషములు కొన్నిమాత్రమే యిందు గలవు. రంగనాయకమ్మ రచన మేలుతరమైనది. అండాళుచరిత్రలో ఆళ్వారుల చరిత్రను గొంత చెప్పబడినది; కొరవంజి పాత్రకు ప్రసక్తి కల్గినది. అండాళు పెండ్లి వేడుకలు ముచ్చటగా వర్ణింపబడినవి. ఇందు భక్తి శృంగార రసములు బాగుగా పోషింపబడినవి.

## రూప్ఖాను పేట రత్నమ్మగారు

గోలకొండ కవుల సంచిక 'కవిపరిచయము' ద్వారా క్రీ. శ. 1934 నాటికి 72 ఏండ్ల వయసు గల రూప్ఖానుపేట రత్నమ్మగారు శివపుకొరవంజి యను యక్షగానమును రచించినట్లును, అది అచ్చయినట్లు తెలియవచ్చినది. కాని యది నాకలభ్యము.

## కళ్లేపల్లి వేంకటరమణమ్మగారు

శ్రీ మంత్రిప్రగడ భుజంగరావుగారు సంతరించిన ఆధునిక కవిజీవితములలో కళ్లేపల్లి వేంకటరమణమ్మగారను నామె వరలక్ష్మీవ్రతవిధాన మను యక్షగానము రచించినట్లు గలదు. అదియు నాకలభ్యము. కాని అది వ్రతకల్పమువంటి రచనగాని యక్షగానము కానేరదనుకొందును.

ఇప్పటి కుపలబ్ధములగు నీ పదునైదారు కుంతో పజ్ఞములైన యక్షగాన కృతులను చూచినచో వానిలో

---

14. ఇది కాకినాడ మంచు రంగనాథరావుగారి ప్రచురణ. ప్రచురణ సంవత్సరము తెలియదు.

సామాన్యముగా అవ్యుత్పత్తి కృతములైన దోషము లనేకము పొడగట్టినను అన్నిటి రచన మృదుమధురముగ నుండును. అందును చవులూరించు పలురకముల పెండ్లి వేడుక పాటలు చదువునప్పుడా యక్షగాన రచనా సమయమున సహజముగా గానకళా సరస్వతికి కేళాగృహములైన యీ కవయిత్రుల గాత్రముల మాధుర్యము గంటములకును దిగివచ్చెనా యనిపించును. వారి యక్షగానములందు కవితకు, గానకళకు కొదువ లేదు గాని రంగాజమ్మ, తరిగొండ వెంగమాంబ, నందిపాటి శేషాంబల కృతులందు తక్క కడమ వానిలో నాటకీయత తక్కువ. శృంగార కరుణ హాస్య వీరాది రసపోషణ విషయమున నీ కవయిత్రులు యథాశక్తి తమ సామర్థ్యమును ప్రకటించిరి. కాని వారి కృతులలో శృంగారాదిక విషయములందు పురుష కవుల కృతులందున్నంత ప్రౌఢియును లేదు, అంత అనౌచిత్యమును లేదు. బిడ్డ కాన్పులు, పెంపకములు, పెండ్లి వేడుకలు, సవతి మచ్చరములు, కొరవంజి సోదెలు మొదలగు ఆడువారికి సంబంధించిన యనేక సందర్భములందు పురుష కవుల నతిశయించునట్లు రచనలు పచరించిరి. వారిలో చాల మంది కృతులం దకలంకమైన దైవభక్తియు, తత్త్వజిజ్ఞాసయు గన్పట్టును. రంగాజమ్మవంటివారి దారి వేరు కాని కడమ కవయిత్రుల జీవితములలో నేదో యొక సామ్యము, సమీచీనతయు గోచరించును. వారు రాజసన్మానములు, బిరుదగౌరవములు నాశించినవారు గారు. పురుష కవులవలె తమ గ్రంథములందు బడాయి కొట్టుకొన్నవారు కారు. విదుషీమణులు గూడ కించిజ్ఞులమనియే వినయము ప్రకటించుకొనిరి.

ఆడువారికి ప్రబంధ రచనకంటె పాటల రచన యనువైనది. ఆ రెంటికి నొక విధముగ నేకవాక్యత ఘటించు యక్షగానమును మన కవయిత్రులకు గైవసమైనది. బాల పాపాంబ కాలము నిజముగా క్రీ. శ. 1600 ప్రాంతమే యగునేని యక్షగాన రచన చాల కాలము క్రిందటనే ఆడంగులను గూడ ఆకర్షించి అంతకంతకు నాధునిక యుగోన్ముఖముగా వికసించిన దనవలె.

# సూర్యోదయం

శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

తెల్లవారింది. ముఖ ప్రక్షాళనం చేసుకుందామని నీళ్ళ చెంబుతో అరుగుమీదకు వచ్చిన రంగయ్యగారు, కూర్చుని తూర్పు దెస చూశాడు. కొంచెం ఆగి, ఆశ్చర్యంతో కళ్ళకు చేయి అడ్డుపెట్టుకుని, తీక్షణంగా చూశాడు. ఆయన కళ్ళు ఆనందంతో మెరిశాయి. సూర్యుడు! అవును సూర్యుడే.

సంతోషంతో గట్టిగా కేక వేద్దామనిపించింది. ఆ క్షణాన్నే యింట్లోకిపోయి యీ విషయాన్ని, యీ శుభవార్తని ఎలుగెత్తి చాటుదామనుకున్నాడు. కాని ప్రయత్నం మీద రెండు ప్రయత్నాలూ మానుకుని ఉత్సాహంతో చూడసాగాడు.

క్రమక్రమంగా సూర్యుడు దగ్గరకు వస్తున్నాడు. మరీ సమీపానికి వచ్చేసరికి రంగయ్యగారు ఉత్సాహం ఆపుకోలేక లేచి నిలబడ్డాడు.

"మామయ్యా!"

"సూర్యుడూ"

సూర్యుడి గొంతువిని మహదానందంలో మునిగిపోయిన రంగయ్యగారు, పేరుపెట్టి పిలిచి నఖశిఖ పర్యంతం పరిశీలించసాగాడు. ఆ గొంతు! నాలుగు సంవత్సరాల క్రితంవరకూ అలవాటైన గొంతే.

"కులాసాగా వున్నావా మామయ్యా!"

"ఆఁ లోపలకు పోదాంరా" అని అతన్ని రెక్క పుచ్చుకుని లోపలకు తీసుకుపోయి "ఇదిగో ఏయ్ సూర్యుడు వచ్చాడు చూడు!" అని అరిచాడు.

ఈలోగా అతను తను తెచ్చుకున్న సూట్‌కేసు ఒక మూలను పెట్టి, నిల్చున్నాడు. రంగయ్యగారి కేకకు లోపలినుంచి ఓ నడివయసు స్త్రీ, యిద్దరు చిన్న కుర్రవాళ్లు, ఒక పదహారేళ్ళ అమ్మాయి జవాబుగా ప్రత్యక్షం అయారు.

వాళ్ళందరివంకా వరుసగా చూసి సూర్యారావు నిరాశ చెందాడు. అతను ఆశించిన వ్యక్తి కనబడ లేదు. వెంటనే బయటపడక "అత్తయ్యా! గుర్తుపట్టావా?" అన్నాడు.

నడివయసు స్త్రీ సంతోషంగా జవాబు చెబుతూ "ఎలా మరిచిపోతాను సూర్యుడూ యింట్లో [illegible] చెప్పుకోని రోజుంటా? మరి నీ అమ్మ...." అని భర్తవంక సందిగ్ధంగా చూసి ఆగిపోయింది.

"మా అమ్మ; ఏమిటి?"

రంగయ్యగారు శాంతంగా "నిలబడేవున్నావు. ఆ కుర్చీలో కూర్చో... కంగారుపడకు సూర్యుడూ, చెల్లెలు పోయింది" అన్నాడు.

"ఆఁ" అని ఒక క్షణంపాటు నివ్వెరపోయి రెండుచేతుల్తో ముఖాన్ని కప్పుకున్నాడు అతను— "అమ్మా! నన్నువిడిచి వెళ్ళిపోయినావా" అని గొణుగుకుంటూ, విలపించసాగాడు.

"ఊరుకో నాయనా. ఇప్పటి విషయమా యిది? రెండేళ్ళనాటి సంగతి" శాంతమ్మగారు అంది.

సూర్యారావు ఆశ్చర్యంగా చేతులు తీసేశాడు. బాగా ఏడ్చి వుండటంవల్ల అతని కళ్ళు ఎర్రబారి వున్నాయి.

"రెండు సంవత్సరాలనాటి విషయమా?"

గుమ్మంలో నిల్చునివున్న పదహారేళ్ళ అమ్మాయి, యితని వంక దీనంగా, జాలిగా చూస్తోంది. "పాపం" అనుకుంది. తల్లిపోయిన రెండు సంవత్సరాలకు యితనికి యీ విషయం తెలిసింది.

అతని ప్రశ్నకు రంగయ్యగారు సమాధానం చెప్పాడు. "అవును. మంచంమీద మూడు నెలలు తీసుకుంది. ఎప్పుడూ నిన్ను తలుచుకుని ఏడుపే. చివరి

రోజుల్లో నిన్ను కళ్ళారా చూడాలని పాపం దాని ప్రాణం తెగగింజుకు పోయింది."

"నాకు హృదయం లేదు. నేను పాపాత్ముణ్ని. కఠినుణ్ని.

సూర్యారావు మితిలేని దుఃఖంతో మళ్ళీ హృదయవిదారకంగా విలపించసాగాడు. రంగయ్యగారు దగ్గరకు వచ్చి భుజంమీద చేయివేసి ఓదారుస్తూ అన్నాడు. ఊరుకో నాయనా. ఏంచేస్తాం? ఏదెలా జరగాలో అదలా జరుగుతుంది.

సూర్యారావు వృద్ధుడైన మామయ్యవంక దీనంగా చూస్తూ "నేను దురదృష్టవంతుణ్ని మామయ్యా అన్నివిధాలా" అన్నాడు.

కొంతసేపు యీ విధంగా సంతాపవాక్యాలతో గడిచిపోయింది. కాని పదహారేళ్ళ అమ్మాయికి యీ పద్ధతి ఎక్కువ నచ్చినట్లులేదు. దగ్గరకువచ్చి ముఖంలోకి చూస్తూ "నేను గుర్తున్నానా బావా?" అని నవ్వుతూ అడిగింది.

సూర్యారావు నిదానంగా ఆమెవంక చూస్తూ "నువ్వా? యిందాకటి నుంచీ ఎవరో అని ఊరుకున్నాను. ఎంత మారిపోయావు సీతా?" అన్నాడు ఆశ్చర్యంతో.

ఆమె కిలకిలా నవ్వుతూ "అయిదేళ్ళ క్రిందటి నీ ఫోటో యిక్కడ వుంది. దాంతోపాటు అద్దం కూడా తెచ్చిస్తాను అద్దంలో చూసుకుని ఆ ఫోటోలో పోల్చుకుని నువ్వెంత మారిపోయావో పరీక్షించుకో" అంది.

"అప్పుడు పన్నెండేళ్లు"

"నాలుగేళ్ల తర్వాత—యిప్పుడు పదహారేళ్లు" ఎంత విడ్డూరం ఆమె నవ్వు ఆపుకుంటోంది.

"ఏయ్. పెంకిపిల్లా—బొత్తిగా అంత సిగ్గులేదేం?" అంటూ ఆమె జడను అందుకోబోయాడు. తప్పించుకుని పారిపోతూంటే రంగయ్యగారు "అమ్మాయ్ బావకి కాఫీ తీసుకురా" అన్నారు.

శాంతమ్మగారు యిందాకే లోపలకు వెళ్లిపోయింది. ఇద్దరు కుర్రవాళ్ళు గోడకు ఆనుకుని యీపరిచయంలేని వ్యక్తివంక వింతగా చూస్తున్నారు.

సీత! లోపలకు పోబోతూన్నదల్లా జడ ముందుకు పడేటట్లు గిరుక్కున తిరిగి "యింకా ముఖం కడుక్కోలేదేమో నాన్నా" అంది.

"పర్వాలేదు. ఈనాలుగేళ్లలో ముఖం కడిగేసుకోకుండా, కాఫీ ఏమిటి, భోజనాలే లేపేసిన సందర్భాలు చాలా వున్నాయి. తీసుకురా" అని అతను జవాబు వెంటనే యిచ్చాడు. ఆమె లోపలకు వెళ్ళిపోయింది. రంగయ్యగారు కళ్ళు చికిలించి మేనల్లుడివైపు చూశాడు. మరదలు కాఫీ తెచ్చేలోగా సూర్యారావు ఆ యిద్దరి కుర్రవాళ్ళనీ దగ్గరకు పిలిచి కొత్త కుక్కపిల్లల్ని మచ్చిక చేసుకుంటున్నట్లు మంచి చేసుకోసాగాడు.

అతను కాఫీ త్రాగుతూంటే రంగయ్యగారు, ముఖం తుడుచుకుంటూ లోపలకువచ్చి "యిదేనా నీ సామాను?" అని ఆ చిన్న సూట్‌కేసుని చూపుతూ అడిగాడు.

సూర్యారావు చిన్నగా నవ్వుతూ "అంతే. అందులోనైనా ఏదో వున్నదని భ్రమపడవద్దు. మూడు జతల లాగూలు, చొక్కాలు, కొంత చిల్లరడబ్బు" అన్నాడు.

"ఇంతేనా?" రంగయ్యగారు ఆశ్చర్యంతో కళ్లు పెద్దవి చేశాడు.

"ఊఁ"

ఇంతకాలం అతను ఏమేమి చేసిందీ, ఎక్కడెక్కడ తిరిగిందీ, ఏమిటి సాధించిందీ అడుగుదామనే వుంది రంగయ్యగారికి. కాని నాలుగేళ్ల క్రితం చెప్పాపెట్టకుండా పారిపోయాడు. తిరిగి ఆ విషయాలన్నీ కదిపితే, మళ్లీ ఎక్కడ పారిపోతాడోనన్న భయంతో ఏమీ ప్రశ్నించలేదు. ప్రక్కనున్న మరో కుర్చీలో కూర్చుంటూ "అమ్మాయి. నాకు కాఫీ తీసుకురామ్మా" అని కేకవేశాడు. రెండు నిమిషాలలో సీత కాఫీ పట్టుకువచ్చి తండ్రికి యిచ్చి వెళ్లిపోయింది.

ఇద్దరూ ఏదో లోకాభిరామాయణం మాట్లాడుకోసాగారు. సూర్యారావు తన విషయం ఏమీ చెప్పకుండా, యీవూరు ఎలా వుండేది ఎలా మారిందీ, తనకు తెలిసిన యీ ఊళ్లో వ్యక్తుల విషయం ప్రశ్నిస్తూ తెలుసుకోసాగాడు.

చాలాసేపు యీ విధమైన సంభాషణతో గడిచిపోయింది. ఇంతలో పనివాడు వచ్చి 'నీళ్లు తోడా

నని చెప్పేసరికి తువ్వాలు తీసుకుని సూర్యారావు లోపలకు వెళ్ళాడు.

ఇక్కడకు వచ్చిన తర్వాత కొన్ని గంటల వ్యవధిలోనే అతను రకరకాలుగా మారాడు. విచారమూ, సంతోషమూ, ఆశ్చర్యమూ వీటిల్లో ఏదీ అతనిలో అతన్ని ఎక్కువసేపు అంటిపెట్టుకుని వుండలేదు. తల్లిపోయిన విషయం తెలిసి, ఆ దుఃఖంలో వున్నప్పుడు చాలా సులభంగా, తేలికగా సీత అతనిలో అద్భుతమైన మార్పు తీసుకువచ్చింది.

ఆ యింట్లో క్రొత్తదనం చాలా కొంచంసేపు మాత్రం అతను అనుభవించాడు. తరువాత అనుకోకుండానే నాలుగేళ్ళక్రిందటి సూర్యారావుగా మారిపోయాడు. ఇంట్లో చనువుగా తిరగసాగాడు.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు శాంతమ్మగారు "సూర్యుడూ! భోజనానికి లేనాయనా" అని కేక వేసింది. రంగయ్యగారు ముందే వెళ్లి పీటమీద కూర్చున్నాడు. సూర్యారావు వంటింట్లోకి వెళ్తోతూ ప్రక్కగదిలోంచి వస్తూ తనని చూసి, హఠాత్తుగా ఆగిపోయిన వ్యక్తిని చూసి చకితుడై నిలబడిపోయాడు. ఆమె తబ్బిబ్బుపడి, చాటుకు తప్పుకుందామని ప్రయత్నించికూడా, ఆ విపరీతమైన స్థితిలో ఏమీ చేయలేక విఫలురాలై తలవంచుకుని నిలబడింది. ఒకటి రెండు క్షణాలు అలాగే నిలబడి తరువాత అతను ఏదో అందామని ప్రయత్నించాడు. కాని మనసూ, నోరూ రెండూ వొప్పుకోలేదు. గబగబ నడిచి లోపలకు వెడుతూ "యిదేమిటి? ప్రొద్దున్న నుంచీ కనబడలేదేం? తప్పించుకుని తిరుగుతూందా?" అనుకున్నాడు.

ఎంత ప్రయత్నించినా తన మనస్సులో ఉదయించిన ఒక ప్రశ్నను అతను దాచుకోలేకపోయాడు చివరకు ధైర్యంచేసి "మామయ్యా! శకుంతల..." అంటూ ఆయన ముఖంవంక చూస్తూ ఆగిపోయాడు.

"ఏమిటి?"

"పెళ్లయిందా?"

ఆయన వెంటనే జవాబు చెప్పలేదు. తలఎత్తి భార్యవంక చూశాడు. ఆమెకు ఏమీ పాలుపోక, అక్కడ వుండలేక ప్రక్కకు వెళ్ళిపోయింది.

"అయింది యిన్నాళ్లు కాకుండా ఎలా వుంటుంది?" అన్నాడాయన మెల్లగా.

"ఎవరతను?" సూర్యారావు వెంటనే అడిగాడు.

"ఎవరయితేనేం? యిప్పుడు లేడు"

"అదేమిటి?"

"పోయాడు టైఫాయిడ్ వచ్చి"

"శకుంతల విధవంతువా?"

ఆయన మాట్లాడకుండా, తలవంచుకుని అన్నం కలుపుకుంటున్నాడు.

"ఇక్కడే వుంటుందా?"

దీనికికూడా ఆయన సమాధానం చెప్పలేదు. కాని అవతలనుంచే శాంతమ్మగారు "మరి ఎక్కడ వుంటుంది నాయనా? మేముగాక దాన్ని యిహ ఎవరు ఆదరిస్తారు?" అంది గాద్గదికంగా.

జరిగిపోయిన సంగతులు ఏవేవో గుర్తుకువచ్చి సూర్యారావు హృదయం కలచివేసినట్లయింది. అమాంతంగా అతని మనసంతా శకుంతల ఆక్రమించుకుని కూర్చుంది.

"మరి...యిహ అంతేనా?"

"అంటే?" రంగయ్యగారు ప్రశ్నార్థంగా చూశాడు.

"శకుంతల గతి"

"అంటే"

సంభాషణ యిద్దరిమధ్యా అంతే జరిగింది. ఇవాళ ఆ యింట్లో గడిచిపోయిన గాథల నెమరు వేత ప్రతివారిలోనూ ఆవహించింది. సూర్యారావు యీ ఆకస్మిక ఆగమనమే దానికి ముఖ్యకారణం.

"మళ్లీ పెళ్లి చేయకూడదా?" అని అడుగుదామనుకున్నాడు కాని మామయ్య స్వభావం ఎక్కువ అతనికంటే చాలామందికి తక్కువ తెలుసు. ఊరుకున్నాడు.

ఆ మధ్యాహ్నం అతను సావిట్లో పడకకుర్చీలో కూర్చుని ఏదో ఆలోచిస్తున్నాడు. అక్కడకు మెల్లగా సీత వచ్చింది. రంగయ్యగారు ఎక్కడికో వెళ్లిపోయాడు.

"బావా! ఏమిటి ఆలోచిస్తున్నావు?"

సూర్యారావు ఉలుక్కుపడి చూసి "ఏమీ లేదు మరదలా" అన్నాడు.

ఆమె కొంచం దగ్గరకువచ్చి "నా కోసం ఏమీ తీసుకురాలేదా నువ్వు?" అని అమాయకంగా అడిగినట్లు అడిగింది.

"నీకోసం ఏదయినా ఎందుకు తీసుకురావాలి?"

"నువ్వు వొట్టి పిసినారివి"

"డబ్బులేని ప్రతివాడూ పిసినారే"

ఆమె ఆశ్చర్యంగా "యింతకాలం నువ్వేమీ సంపాదించలేదా?" అనడిగింది.

"ఊహు"

"మరి ఎలా గడిపావు?"

"ఎంతసేపూ తిరగటం"

"ఎక్కడెక్కడ?"

"దేశం అంతానూ"

"ఊరికినే తిరిగావా?"

"ఊఁ. డబ్బు అయిపోయినప్పుడు ఏదో ఉద్యోగం చేసేవాడిని. అలా అని పరువు తక్కువగా ఎప్పుడూ ప్రవర్తించలేదు. నలుగురిలోనూ మంచి సంపాదించుకున్నాను. రకరకాల వ్యక్తులతో పరిచయం చేసుకున్నాను. దిగులుగా, బాధగా ఏనాడూ గడపలేదు. తిరిగి యింటికి వచ్చేటప్పుడు వెళ్ళేటప్పుడు ఎలా వున్నానో అలా నే వచ్చాను."

కొంచం ఆగి సీత "నీ సూటుకేసు తెరిచిచూడమన్నావా?" అనడిగింది.

అంగీకారంగా సూర్యారావు తల ఊపాడు.

లోపలనుంచి సూట్‌కేసు తెచ్చి అతనిముందు విప్పిచూసింది. అతను చెప్పిన మాటల్లో అబద్ధం ఏమీ లేదని గ్రహించటానికి ఆమెకు ఎక్కువసేపు పట్టలేదు. తిరిగి మూసివేయబోతూండగా ఫోటోల ఆల్బమ్ ఒకటి ఆమె దృష్టిని ఆకర్షించింది. ఇదేమిటి?" అని దాన్ని తీసుకోబోయింది.

ఇందాకటినుంచి మెదలకుండా ఊరుకున్న సూర్యారావు, కంగారుగా "వద్దు. అది తీయబోకు" అన్నాడు.

తన ప్రయత్నాన్ని విరమించి ఆమె "ఏం?" అనడిగింది తెల్లబోయి.

"ఊరికినే, దానిని ఎవరికీ చూపించటం నాకిష్టంలేదు."

"సరే"

ఆమె తిరిగి సూటుకేసును యథాతథంగా మూసి వేసింది. సూర్యారావు జేబులోంచి సిగిరెటు తీసి వెలిగించుకుని వెనక్కు జారగిలబడ్డాడు.

చిన్నగా అతనిదగ్గరకు వచ్చి సీత "బావా! నిన్నొక ప్రశ్న అడగనా?" అంది.

"అడుగు"

"నువ్వు యిక్కడ్నుంచి ఎందుకు పారిపోయావు?"

మరుక్షణంలో సూర్యారావు ముఖం పాలిపోయింది. ఒకసారి ఆమెవైపు చూసి, తలవంచుకుని "ఊరికినే" అన్నాడు.

"కాదు. నాకు చెప్పకూడదా?"

"లేదు, చెప్పకూడనిది ఏమీలేదు"

"అయితే సరే" అని ఆమె అక్కడినుంచి నిష్క్రమించబోతూంటే "మాట" అని ఆపి "యిలా అడిగానని ఎవరితోనూ అనకేం? మీ అక్కయ్య నన్ను ఎప్పుడైనా అడిగిందా?" అని అడిగాడు.

"ఆఁ చాలాసార్లు"

"ఏమని?" అని సూర్యారావు ఉత్కంఠతో ప్రశ్నించాడు.

"బావ ఎంతో మంచివాడు. నేనంటే చాలా ప్రేమ. ఎందుకని వెళ్ళిపోయాడో మరి? అని"

అతను నిట్టూర్పు విడిచాడు.

ఆమె తిరిగి "ఎప్పుడూ ఏడుస్తూనే వుంటుంది అక్కయ్య" అంది.

"ఎందుకు?"

"నిన్ను పెళ్ళిచేసుకోలేదని ఏమో"

"ప్చ్"

"పోతున్నాను" అని ఆమె వెళ్ళిపోతూంటే మళ్ళీ ఆపి "ఆ పెళ్ళి చేసుకోవటానికి ఏమయినా అభ్యంతరం చెప్పిందా?" అని గబగబ అడిగాడు.

"ఎక్కువ లేదులే మనసులో ఏమనుకుందో. బయటకు ఏమీ గోలచేయలేదు"

అతను ఏమీ మాట్లాడకుండా ఒకసారి గట్టిగా సిగరెట్ పీల్చి నెమ్మదిగా పొగ వొదిలేశాడు.

కాని సీత అక్కడినుంచి వెళ్ళిపోవటానికి యీసారి ప్రయత్నించలేదు. అతనికి మరికొంచెం దగ్గరకువచ్చి, కళ్ళలోకి అనునయంగా చూస్తూ, "ఏమిటో

అడగకుండా వుండలేకపోతున్నాను. మీయిద్దరికీ పెళ్ళి నిశ్చయం అయిందాకా బాగానే వున్నావు. అప్పుడే.. ఏం? అక్కయ్యని పెళ్ళి చేసుకోవటం యిష్టం లేదా?" అంది.

సూర్యారావు ఒక క్షణం ఆమెవంక విస్మితంగా చూసి, చేతిలోని సిగరెట్‌ని మూలకి బలంగా విసిరేసి "ఊహు. అది కాదు" అంటూ విసురుగా లేచి, అదే వేగంతో బయటకు వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం అతను మండపందగ్గరకు పోదామని బయలుదేరి, మెల్లగా నడుస్తున్నప్పుడు అటూ యిటూ వున్న యిళ్ళలోంచి వాళ్ళూ వీళ్ళూ తనని రహస్యంగా చూస్తున్న విషయం కనిపెట్టి కొంచెం సిగ్గుతో నవ్వుకున్నాడు.

చిన్నప్పుడు తను ఎంత అల్లరి చిల్లరిగా గాడు? ఈ ఊరు, యీ యిళ్ళు తనకు ఎంతో పరిచితం. ఈ నాలుగేళ్ల కాలంలో ఎన్ని మార్పులు జరిగాయో! అనాడు తనకు స్నేహితులుగా వున్న వాళ్ళకీ, తనకు తెలిసివున్న స్త్రీలకూ ఎంతమందికి పెళ్ళిళ్ళు అయినాయో యేమో. తనే ఏమీ తెలీకుండా అయోమయంగా గడిపాడు.

వేణుగోపాలస్వామి ఆలయం ముందు వున్న మండపంమీదకు వచ్చి కూర్చున్నాడు. ఈ మండపం మీదనే కూర్చుని తను పూజారిఅయిన ఆచార్లుగారితో గంటలు, రోజులు కబుర్లు చెబుతూ వేసవి రాత్రులు అక్కడే పడుకుంటూ కాలం గడిపాడు. ఈ ఊళ్ళో తన ముఖ్యస్నేహితుడు అతనే. మధ్యాహ్నం అతన్ని కలుసుకోలేదు. అతని యిల్లు కూడా గుడికి దగ్గరనే.

"ఆచార్లుగారూ" అని కేక వేయబోయి ఏదో స్ఫురణకు వచ్చి నవ్వుకుని "బావగారూ" అని పిలిచాడు. అప్పటి అలవాటది.

"ఊరికి వెళ్ళారు" అని వినిపించీ వినిపించనట్లుగా యింట్లోంచి జవాబు వచ్చింది.

సూర్యాస్తమయం యింకా కాలేదు. వంటరిగా అలానే కూర్చుని నీటికోసం ఏటికిపోయివచ్చే మనుష్యుల్ని చూడసాగాడు.

అతనికి హఠాత్తుగా యిందాక సీత వేసిన ప్రశ్న స్ఫురించింది. ఎందుకుపారిపోయాడు? ఇక్కడ్నుంచి ఎందుకు పారిపోయాడు?

నాలుగేళ్ళనాటి చిన్న పిల్ల సీత, ఆమె అక్క శకుంతలా, యీ ఊరూ అన్నీ వరుసగా కళ్ళల్లో మెదిలాయి. అప్పుడు...

అతన్ని ఆలోచనను ఆటంకపరుస్తూ యింతలో "బాబుగారూ" అన్న కంఠధ్వని వినిపించింది. ఉలుక్కిపడి చూశాడు. — వెంకటస్వామి

"నువ్వా? పైకిరా" అన్నాడు.

అతను మెట్లు ఎక్కి మండపం మీదకు వచ్చి సుమారంలో క్రింద కూర్చున్నాడు.

"మీరు వచ్చారని పొద్దుటే విన్నాను. అప్పుడే వద్దామనుకుంటే వీల్లేకపోయింది. ఎన్నాళ్ళకి చూశాను?" అన్నాడు.

"ఆశ్చర్యంగా ఉందికదూ?"

"ఆశ్చర్యం కాక మరేటి? మీరు అసలు ఎందుకు పారిపోయారో ఎవరికీ తెలవదాయె. నానా రోజుల పాటు ఊరంతా యీ యీ విశేషమే చెప్పుకుంది. అదంతా పోనియ్యండి. సిగరెట్టుందా?"

సూర్యారావు మాట్లాడకుండా జేబులోంచి సిగరెట్ తీసి ఒకటి అతనివైపు విసిరేశాడు. అతను ఒకసారి అటూయిటూ చూసి "పంతాలు ఆచార్లుగారు లేరు" అని గొణుక్కుంటూ జేబులోంచి అగ్గిపెట్టె తీసి వెలిగించాడు.

'ఏమిట్రా? పెళ్ళి చేసుకున్నావా?"

"పెళ్ళా?" అని అతను కళ్ళు చిట్లించి "మనకొద్దు బాబూ చూశాను చూశాను కంటికి నచ్చింది ఒకటీ అగుపడలా. అయినా యీ కాలంలో ఆడదాన్ని నమ్మినంత యెర్రిపని యింకోటి లేదు. నమ్మి మోసపోవటం ఎందుకని అసలా ఉద్దేశమే వొదిలేశాను" అన్నాడు

సూర్యారావు ఎక్కడికో చూస్తూ "నిజమేరా" అన్నాడు.

కొంచెం సేపు నిశ్శబ్దంగా గడిచాక "మరి యిన్నాళ్ళు తిరిగారు. పెళ్ళి గిళ్ళీ ఏమయినా..." అని ఆకస్మికంగా అడిగాడు వెంకటస్వామి.

సూర్యారావు ఆశ్చర్యంగా "అన్ని నువ్వనా? యింతకుముందే కదురా, పెళ్ళి చేసుకోవటం బుద్ధి తక్కువ పని అన్నావు" అన్నాడు.

"అది నాయిశేయం ? బాబుగారేటి ? అయినా మంచిది కొదని అన్ని పన్లూ వొదిలేస్తున్నారూ?

"యింకా చేసుకోలేదు"

"అయితే యిక్కడికి వొచ్చాశారుగా. యిక అవుతాది లెండి."

"అదేమిటి ?"

"సీతమ్మగారుందిగా"

"పోరా !"

"ఏం పోరా? నాకన్నీ తెలుసు బాబుగారూ. రంగయ్యగారు మిమ్మల్నంత తేలిగ్గా వొదిలేశయ్యరు లెండి. మీరు యిక్కడ్నుంచి వెళ్ళిపొయ్యాక నిజంగా దిగులు పడ్డారంటారా? అంతా బూటకం."

సూర్యారావు మాట్లాడలేదు.

"ఆరి మొనటమ్మాయిగారినే మీ కంటకడదామని ఓసూపు సూశారు. ఉహు, సాగలా. సరే, ఆరి బతుకు అట్టా తెల్లారిపోయింది. అట్టా యిట్టా తిరిగి మీరు మళ్లీ వచ్చేతలికి రెండో పిల్ల రెడీ. మీ యిద్దరికీ సంబంధం కలపాలని ఆయన పట్టుబట్టక పోతే యీ సెవి యిట్టా కోయించుకుంటాను. ఆఁ"

సూర్యారావు చిన్నగా నవ్వి "అందులో విడ్డూరం ఏముందిరా? మేనమామగదా. మేనరికం కలుపుకోవాలని ఎవరికి వుండదు?" అన్నాడు.

వెంకటస్వామి కళ్లు పెద్దవిచేసి "అదీ! మీరు ఆరి వల్లో బాగానే పడ్డారన్నమాట. బాబుగారూ! ఇన్నేళ్లు దేశం తిరిగొచ్చినా మీకు బాగా గ్యానం అబ్బలేదు. రంగయ్యగారి తంతంతా నాకు తెలుసు. మీ నాయనగోరు పోయినప్పటినుంచి ఎందుకంట మిమ్మల్ని సేరదీసింది? మీమీదేం ఆయనకి మమకారం వొలికిపోతుందా? అసలు ఆయన ఆస్తి ఏపాటి? ఆస్తంటే మీదీ. మిమ్మల్ని పరాయిచోటికి పోనియ్యకుండా యింట్లో కట్టేసుకుంటె లాభం ఎవరికి? సెప్పండి" అన్నాడు.

"మామయ్య మనసులో అటువంటి ఆలోచన్లు వున్నాయంటే—నేన్నమ్మను?"

"అవున్లెండి. మీకు బాగా యెర్రి తలకెక్కింది."

ఈమాట హృదయానికి వాడిగా తగలగా, కొంచెం కోపంగా "అప్పటికీ యిప్పటికీ నీ ప్రవర్తనలో మార్పు ఏమీ లేకుండా అప్పుడూ యిలాగే మాటిపోసేవాడివి. నువ్వెన్నయినా చెప్పు. మామయ్య అంటే నాకు చాలా భక్తి గౌరవా లున్నాయి. ఆయ నేంచేసినా సరే. నాకు యిష్టమే" అన్నాడు.

వెంకటస్వామి చిన్న దెబ్బతిని "అంతే లెండి. మామా అల్లుళ్ళకి యిద్దరికీ యిష్టమైనప్పుడు మధ్యన నా దేమిటి?" అన్నాడు.

కొంతసేపు యిద్దరూ మాట్లాడలేదు. తరువాత వెంకటస్వామి లేచి "పనుంది. యెళ్తాను" అంటూ గబగబ మెట్లుదిగి వెళ్ళిపోయాడు.

"ఎవరి గోడవ వాళ్ళది" అనుకున్నాడు సూర్యారావు. వంటరిగా కూర్చునేందుకు విసుగుపుట్టి యింటికి వెళ్ళిపోదామని మండపందిగి వచ్చేటంతలో ఎదురుగా వస్తూన్న వ్యక్తిని చూసి కంగారుపడ్డాడు. ఆ వ్యక్తి చూడకుండా వెనక్కి వెళ్ళిపోదామనుకున్నాడు. కాని అతను చూడనే చూసి "ఎప్పుడొచ్చారు?" అని చిరునవ్వుతో పలకరించాడు.

అతన్తో మాట్లాడటమంటే సూర్యారావుకు అసహ్యంగావుంది. ఇంత ధైర్యంగా తనను పలకరిస్తాడేమిటా అని ఆశ్చర్యంకూడా చెందాడు. కాని యిక్కడినుంచి తను పారిపోయేముందు తమ యిద్దరి మధ్యా వైరం ఏమీ లేదన్న విషయం గుర్తుకువచ్చి "పొద్దున్న" అని సమాధానం యిచ్చాడు.

"ఎన్నాళ్ళకి చూశాను" నవ్వుతున్నాడతను.

"దుర్మార్గుడా!" అనుకున్నాడు సూర్యారావు మనస్సులో అతని నవ్వుకు గుండె మండిపోతోంది.

"కులాసాగా వున్నారా ?"

"ఊఁ" యిష్టం లేనట్లుగా గొణిగాడు.

తరువాత తప్పనిసరిగా "నువ్వో?" అన్నాడు.

"ఆఁ నా కులాసా కేమొచ్చింది లెండి!"

సూర్యారావు మాట్లాడకుండా ఊరుకు నేసరికి "వస్తాను. మళ్ళీ కనిపిస్తాను" అని గోవిందం అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిపోయినవంకే చూస్తూ క్రోధంగా కొంచెంసేపు నిలబడ్డాడు. వీడే. అంతా చేసింది వీడే.

తెప్పరిల్లి మెల్లగా నడిచి యింటికి వచ్చాడు.

ఆ రాత్రి అతనికి చాలాసేపటిదాకా నిద్ర పట్టలేదు. ఎన్నో సంగతులు గుర్తుకు రాసాగాయి. శకుం

తల తనకి భార్య కావలసింది. తన భార్య అయితే ఆమె వితంతువు అయేదికాదు. కాని తను బ్రతికివుండగా శకుంతలను పెళ్ళిచేసుకునేవాడు కాదు. ఆమే చేతులారా చేసుకుంది. బాధతోనూ, విచారంతోనూ, కోపంతోనూ అతని శరీరం వొణికింది.

తనకు తెలుసు. ఎంత యిష్టంలేదని సరిపెట్టుకుందామన్నా, ఎంత తోసుకుని తిరుగుదామన్నా ఆమెను పలకరించాలని వుంది. ఆమెతో మాట్లాడాలని వుంది. సరదాగా వుండాలని వుంది. కాని... అతను ఆలోచించలేకపోయాడు.

* * * *

నాలుగురోజులు గడిచాయి. ఇదివరకటి స్వాతంత్ర్యం తిరిగి యీ యింట్లో సంపాదించినా, వెనకటిలా స్వేచ్ఛగా మసలుకోలేకుండా వున్నాడు సూర్యారావు. చేసేందుకు ఏ పనీ లేకపోవటంవల్ల అతనికి విసుగ్గావుంది. ఏమీ పొద్దు పోవటంలేదు. ఎంతసేపని తిరుగుతాడు? పగటిపూట మామయ్య సాధారణంగా యింట్లో వుండడు. ఎంతసేపూ సీతతోనో, చిన్న కుర్రాళ్లతోనో కబుర్లు చెప్పుతూ గడపాలి.

శకుంతల అతనికి సాధారణంగా కనబడదు. ఎంతసేపని అలా దాక్కోగలుగుతుందో అతనికి ఆశ్చర్యంగా వుండేది. ఎప్పుడూ వంటరిగా, రహస్యంగా కూర్చుని కాలం ఎలా గడుపుతుందోనని అనుకునేవాడు.

ఒకటి రెండుసార్లు మాట్లాడదామని ప్రయత్నించాడు. కాని తీరా ఆ సమయం వచ్చేసరికి నిలద్రొక్కుకుని, అక్కడినుంచి తప్పించుకుపోయేవాడు.

కాలక్షేపంకోసం సీతకు పేకాట నేర్పించాడు. తీరికైనప్పుడు ఆమె వచ్చి అతనితో ఆడేది.

ఒకరోజు మధ్యాహ్నం పేకాటలో యిద్దరూ వుండగా ఆమెవంక పరిశీలనగా చూస్తూ "మరీ పెరిగిపోతున్నావు. చప్పున పెళ్లి చేసుకో" అన్నాడు.

"ఏం?"

"లేకపోతే పాడయిపోతావు"

"నేను నిన్నే చేసుకుంటాను"

"ఛీ! బొత్తిగా సిగ్గు లేదేం?"

"సిగ్గెందుకు బావదగ్గర?"

సూర్యారావు కొంచెం కోపంగా "అంతా నీ యిష్టమేనా? నేను నిన్ను చేసుకోను" అన్నాడు.

"నా యిష్టం కాకపోతే నీ యిష్టమూ ఏమిటి? అక్కయ్య వెర్రిది కాబట్టి నిన్ను పారిపోనిచ్చింది. నేను మాత్రం నిన్ను వదలను"

"పో, వెంకిపిల్లా" అంటూ సూర్యారావు అక్కడ్నుంచి లేచి బయటకు వెళ్లిపోయాడు. అతనికి భయంగా వుంది. ఇంకా తను వచ్చి నాలుగురోజులయినా కాలేదు. అప్పుడే పెళ్లిప్రయత్నాలు తలపెట్టారా ఏం?" అనుకున్నాడు. లేకపోతే సీత అలా ఎందుకు అంటుంది? ఆమె ఏమీ అమాయకురాలు కాదు.

ఒకవేళ అలా జరిగితే...మామయ్యతో ఏం చెప్పాలి?

అతనికి ఏమీ తోచలేదు. మంచంమీదకు పోయి కళ్ళు మూసుకుని పడుకున్నాడు. తను ఇక్కడకు రాకుండావుంటేనే బావుండేదేమో. ఏమాత్రం విశ్రాంతి లేకుండా యిన్నాళ్లు తిరిగాడు. ఎంతో అనుభవం సంపాదించాడు. చివరకు యిక్కడకు వచ్చి వెనకటి జీవితాన్ని తిరిగి ప్రారంభించబోతున్నాడా?

గోవిందం వికటంగా నవ్వుతూ మాటిమాటికీ కళ్లముందు కనిపించసాగాడు. కళ్లు మూసుకున్నా కనిపించాడు.

తను ఎందుకు పారిపోయాడు? ఎందుకు పారిపోయాడు?

అతనికి నిద్రపట్టింది.

చివరకు అనుకున్నంతా జరిగింది. మరునాటి రాత్రి తనప్రక్క మంచంమీద పడుకున్న రంగయ్యగారు "మాడు సూర్యుడూ" అన్నాడు.

"ఏమిటి మామయ్యా"

"నీకో విషయం చెప్పాలయ్యా!"

"ఏమిటి?"

ఆయన కొంచెం తటపటాయించి "నీగురించి నాకు నమ్మకం వుంది. ఏ పని కూడా అనాలోచితంగా ఎప్పుడూ చేయవు. ఇన్నాళ్లు తప్పించుకు తిరగటానికి ఏదో కారణం వుండేవుంటుంది. అయినా ఆ విషయాన్నిగురించి నిన్నేమీ అడగను. నిన్ను బాధపెట్టను" అన్నాడు.

# సూర్యోదయం

సూర్యారావు మాట్లాడకుండా వినసాగాడు.

"నీకోసం నేను పడిన బాధ చచ్చి స్వర్గంలో వున్న మీ అమ్మ పడిన బాధకన్నా ఏమాత్రం తక్కువది కాదు. ఎన్నాళ్లో నీకోసం వెదికించాను. చివ్వరికి నీ అంతట నీవే వచ్చావంటే ఎంతో సంతోషించాను."

"నీ విషయం నాకు తెలుసును మామయ్యా" అని సూర్యారావు అస్పష్టంగా గొణిగాడు.

"మేనరికం వుండి పరాయి సంబంధంకోసం చూస్తే లోకం అంతా ఆడిపోసుకుంటుంది. ఈ ఊళ్లోవాళ్ల విషయం నీకు తెలీదు గనకనా? అయినా వేరే ఎవరితోనో ముడిపెట్టుకోవటం నాకూ యిష్టం లేదు."

సూర్యారావు క్రమక్రమంగా అర్థం జేసుకోసాగాడు.

"నువ్వొచ్చి యింకా నాలుగురోజులయినా కాలేదు. అప్పుడే యీ సోది మొదలుపెట్టాడేమా అని అనుకుంటున్నావేమో. అవతల సీత ఈడుమించి పెరిగిపోతూంది. మీ అత్తయ్యకూడా ఊరికినే తొందరపడుతూంది. అతిశయోక్తి అనుకో యింకేమయినా అనుకో. ఇన్నాళ్లు నీకోసం ఆగాను. నీకు వయసు పెరిగిపోయిందేమోనని అనుకుంటున్నావేమో. పాతికేళ్లు పెద్దవయస్సేమీ కాదు. నీ ఉద్దేశం ఏమిటి?"

సూర్యారావు వెంటనే మాట్లాడలేదు.

"ఇంకో విషయంకూడా వుంది. చెల్లెలు పోతూ పోతూ నాచేత ఒట్టుకూడా వేయించుకుంది. 'అన్నయ్యా, శకుంతలని నా కోడలు చేసుకుందామని ఎంతగానో ప్రయత్నించాను. కాని దైవం వేరు విధంగా వున్నాడు. సూర్యుడు ఏనాటికైనా తిరిగి వస్తే, నేను వున్నా లేకపోయినా వాడిని నీ అల్లుడుగా చేసుకోవా?' అని ప్రాధేయపడింది. అలాగే నన్నాను"

సూర్యారావు చీకట్లో మామయ్య ముఖంవంక చూడటానికి ప్రయత్నించాడు.

"బలవంతపెట్టి నిన్ను ఒప్పించను. నీ యిష్టం. నీ ఉద్దేశం ఏమిటి?"

"నేను కొంచెం ఆలోచించుకోవా మామయ్యా."

"సరే."

మళ్ళీ సూర్యారావు "దీనికి నువ్వు వేరువిధంగా అనుకోకూడదు. తల్లీ తండ్రీ నాకెవరూ లేరు కాబట్టి నా పెళ్లిని గురించి ఆలోచించుకోవలసిన బాధ్యత నాదే కాబట్టి అలా అన్నాను" అన్నాడు.

"ఆలోచించుకో నాయనా. తప్పేం?"

ఆయన తిరిగి మాట్లాడలేదు. సూర్యారావు యిటు తిరిగి పడుకున్నాడు. అతని మనసంతా చికాకుగా వుంది. మామయ్యతో తను ఏమని చెబుతాడు? యిష్టం లేనందుకు కారణం ఏమని చెబుతాడు? చెప్పలేడు.

చెప్పకుండా?

తిరిగి పలాయనం చిత్తగిస్తాడా?

కాదు. ఊహూ. ఈసారి తెగించి ఏదో చెప్పాలి.

మరునాడు మామయ్య యింట్లో లేనప్పుడు అత్తయ్యతో మెల్లగా అన్నాడు "నా కెందుకనో ఎక్కువ యిష్టంగాలేదు అత్తయ్యా."

ఆమె అంతరార్థం గ్రహించి "ఎందుకు? సీత బాగుండదా?" అన్నది.

"బాగుండకేం? శకుంతలకన్నా అదే బాగుంటుంది?"

"మరి, యింకేం?"

"అదికాదు" తటపటాయిస్తున్నాడు.

"మీ ఆస్తిపాస్తులతో మేము తులతూగలేమనా? నిజమే. మేము నీ అంత ధనవంతులముకాదు. కాని బంధుత్వం అనేది ఒకటి వుందికదా. అదీగాక నువ్వు యిక్కడ లేనప్పుడు మీ మామయ్యేగనుక పూనుకోకుండా వున్నట్లయితే సెంటు భూమికూడా నీకు మిగలకుండా లోకులు తన్నుకుపోయేవాళ్ళు. ఆయన నీమీది మమకారంతో సొంత పొలంలా చూసుకున్నారు. రేపో ఎల్లుండో నీ పొలం నీకు అప్పజెబుదామనుకుంటున్నారు. ఆ విశ్వాసం అయినా వుంచు సూర్యుడూ."

"అది కాదు" అని అతను యింకా తటపటాయిస్తున్నాడు.

"దేశాలు తిరిగివచ్చినవాణ్ణి. నేను అంత మంచి అల్లుణ్ణి కాదేమో. నాకంటే..." సూర్యారావు చివ్వరికి అన్నాడు.

శాంతమ్మగారు నిష్ఠూరంగా "చాల్లే ఎక్కడ నేర్చుకున్నావేం యీ అతిశయోక్తులు?"

సూర్యారావు దెబ్బతిని మాట్లాడక ఊరుకున్నాడు.

"నువ్వు ఊ అంటే వేగిరం కానిచ్చేద్దాం అనుకుంటున్నాం. మాకూ తొందరగా వుంది."

"నా కెందుకో ఎక్కువ యిష్టంగా లేదు అత్తయ్యా" అతను ఎలాగో ధైర్యంచేసి అన్నాడు. ఆమె అతనివంక ఆశ్చర్యంగా చూసి "నీ మనస్సులోది స్పష్టంగా చెప్పు నాయనా" అంది.

అక్కడ్నుంచి లేచిపోతూ సూర్యారావు "ఏమో నేను బాగా ఆలోచించుకోవాలి" అని బయటకు వెళ్ళిపోయాడు.

ఈ పెళ్ళి విషయం చాలా దృఢంగా వే అందరి మనస్సుల్లోనూ నాటుకునివుందని అతను గ్రహించాడు. ఏమీ సమాధానం చెప్పకుండా తటస్థంగా ఊరుకు నేందుకు కూడా వీలులేని పరిస్థితి. "బావంటే నాకు యిష్టంలేదు" అని సీత అంటే బాగుండునని అనుకున్నాడు. కాని "అమ్మా! అదా అనేది. నాతో నే సరదాగా చెబుతుంటేనూ" అని వెంటనే అనుకుని, బాధపడి ఊరుకున్నాడు.

ఆ రోజంతా యింట్లో వుండకుండా సూర్యారావు పొలాల వెంబడి నడిచీ, ఏటి వొడ్డున కూర్చునీ గడిపాడు. ఒక్కో ఉద్రిక్తావస్థలో "అసలు విషయం చెప్పి వేస్తే?" అనుకు నేవాడు. కాని "అంత సాహసం తనకు వుందా?" అన్న సందేహం తోచినప్పుడు యీ క్షణంలో చప్పబడి పోయేవాడు.

ఇంటికి వచ్చి భోజనం చేశాక ఎవరితోనూ మాట్లాడకుండా పడుకున్నాడు. ఏమనుకున్నారో ఏమిటో అతన్ని ఎవరూ పలకరించలేదు.

సూర్యారావుకు ఒక రాత్రి వేళ మెళకువవచ్చింది. కాని యీ మెలకువ రావడంలో అతనికి స్వాభావికం ఏమీ కనపడక పోయేసరికి కళ్లు-చికిలించుకుని చూశాడు. బయట చలిగా వుండటం వల్ల యివాళ గదిలో పడుకున్నాడు. మరీ చీకటిగా వుండటం వల్ల మొదట ఎవరూ కనబడలేదు. కాని చీకటికి కళ్లు కొంచం అలవాటయ్యాక కాళ్లదగ్గర ఎవరో నిలబడి వుండటం చూశాడు. తనను లేపిందికూడా ఆ వ్యక్తే అని గ్రహించి తెల్లబోయి లేచికూర్చున్నాడు. కొంచెం గాభయం వేస్తోంది. ఆ వ్యక్తి ...సీతలా వుంది.

"ఎవరు?" వొణుకుతూ అడిగాడు.

"ఉష్, బయటకురా"

సీత కాదు శకుంతల. అతను ఆశ్చర్య చకితుడయ్యాడు. అవును. శకుంతలే.

"ఏమిటి?"

"బయటకు"

ఏమీ చేయలేక మెల్లగా ఆమె వెనక పిల్లిలా నడిచివొచ్చాడు. కొంచం గట్టిగా మాట్లాడుకున్నా ఎవరికీ వినిపించనంత దూరం వచ్చి, వేప చెట్టు క్రింద నిల్చున్నారు. చలీ, భయం యీ రెండూ సూర్యారావును కంపితుణ్ణి చేశాయి.

"నిన్ను ఓ ప్రశ్న అడుగుదామని వచ్చాను" అంది శకుంతల చిన్నగా.

అతనికి అంతా కలలా తోచింది. ఏనాటి శకుంతల? తను ఆమెతో మాట్లాడి కొన్ని సంవత్సరాలు గడిచింది. ఇక్కడకు వచ్చాకకూడా తనూ మాట్లాడ లేదు; ఆమెకూడా తప్పించుకు తిరిగింది. కాని యీ రాత్రి వేళ యిక్కడ యింతనిబ్బరంగా తనంతట తాను వొచ్చి మాట్లాడగలుగుతోంది "ధైర్యంఅంటే స్త్రీలదే" అనుకున్నాడు.

"ఏమిటి?"

"ప్రశ్న కూడా కాదులే. అవసరం అయితే ప్రాధేయపడదామని కూడా అనుకున్నాను"

"చెప్పు" అన్నాడు సూర్యారావు ఆదుర్దాగా.

"నువ్వు యిక్కడ్నుంచి ఎందుకు పారిపోయావు?"

"ఇదేనా నువ్వు అడగదలుచుకున్న ప్రశ్న?" కోపంతో అడిగాడు సూర్యారావు.

"కేవలం నాంది"

అతను కొంచెం ఆలోచించి "చెప్పను" ఊహూ అన్నాడు.

"రహస్యమా?"

"కావచ్చు"

ఆమె వెంటనే మాట్లాడక పోయేసరికి తనే "ఈ విషయంలో ఎక్కువ వొత్తిడి చేయడం నీకే క్షేమం కాదు" అన్నాడు.

"పర్వాలేదు నన్ను పెళ్లి చేసుకోవటం యిష్టం లేక పోయిందా?" శకుంతల మార్దవంగా అడిగింది.

"నాకు యిష్టంలేని సంగతుల్ని నా నోటి గుండా వినాలని ఎందుకు కుతూహలపడతావు? అది ఎక్కువ సబబైన పని కాదు"

"చెప్పు, పర్వాలేదు"

"యిష్టం లేకపోయింది"

"ఈ విషయం అనాడే ఎందుకు చెప్పలేదు? పారిపోవాల్సినంత యిది ఏమొచ్చింది?"

"చెప్పలేకపోయాను"

"సరే" అని ఆమె కొంచం ఆగి మెల్లగా "ఆశ్చర్యంగా వుంది. ఒకనాడు నన్ను ఏకాంతంగా కలుసుకుని 'నేను నిన్నే పెళ్ళి చేసుకుంటాను' అన్నావు గుర్తుందా? నాన్నతో కూడా నీకు యిష్టమేనని చెప్పావు. అదంతా అలా ఎందుకు జరిగింది?" అని అడిగింది.

"అది వేరే విషయం"

"కాదు—" శకుంతల కటువుగా అంది.

సూర్యారావు ఏదో చెప్పాలన్నంత ఉద్రిక్తత వొచ్చినా నిలద్రొక్కుకొంటూ "లాభం లేదు. ఆ సంగతులు ఏమడిగినా జవాబు చెప్పను" అన్నాడు.

మళ్ళీ తనే "యింకేనా అడగవలసింది? అయితే వెళ్ళిపోతాను. ఎవరయినా చూస్తే ఏమనుకుంటారు?" అన్నాడు.

"చూడకపోతే ఏవిూ అనుకోరుగ"

"అది సరియైన జవాబు కాదు"

"బావా" అంది శకుంతల కంపిత స్వరంతో. "జరిగిపోయిందేదో జరిగిపోయింది. నేను నీదగ్గరకు వచ్చినందుకు కారణం వేరు. సూటిగా అడుగుతాను. సీతను పెళ్లి చేసుకోవా?"

సూర్యారావు చకితుడయ్యాడు.

"అవును. సీతను పెళ్లి చేసుకునేందుకు నువ్వెందుకు తటపటాయిస్తున్నావు?"

దీనికి సమాధానం ఏమని చెబుతాడు? అయినా ఆమె యింత సూటిగా అడుగుతుందని అతను భావించలేదు.

"కారణం ఏవిూ లేదు. యిష్టంలేక"

"ఎందుకు యిష్టంలేదు?"

సూర్యారావు మాట్లాడలేకపోయాడు.

"అందంగా వుండదా?"

"శకుంతలకన్న సీత బాగానే వుంటుంది" అని అతను మనస్సులో అనుకున్నాడు.

"మాట్లాడవేం?"

"అదేదీ కాదు"

"ఇంకేమిటి?"

ఈ వాతావరణం ఏవిూ అతనికి బాగుండలేదు. ఒకరి మొహం యింకొకరికి కనబడని యీ చీకటిలో ఎదురెదురుగా నిల్చుని యీ వాగ్వివాదాలు ఏమిటి?

"నన్ను చంపకు— వెళ్లిపోతాను"

అతను జవాబుకోసం ఎదురుచూడకుండా అక్కడినుంచి వచ్చివేయబోయాడు. రెండు మూడు అడుగులు వేశాడు కాని...త్రుళ్లిపడ్డాడు. ఆమె అతని చేతిని గట్టిగా పట్టుకుని "జవాబు చెప్పందే యిక్కడ్నుంచి కదలటానికి వీలులేదు" అంది దృఢంగా.

నిర్విణ్ణుడై "ఏమిటి యీ సాహసం? ఈ యింట్లో నన్ను వుండనీయవా ఏం?" అన్నాడు.

ఆమె చప్పున అతని చేయి వొదిలేసి "ఇక్కడ చిరకాలం వుండమని ప్రాధేయపడుతున్నాను" అంది.

ఒకటి రెండు నిమిషాలు అతను మౌనంగా నిలబడ్డాడు. తరువాత ఏదో నిశ్చయించుకుని "అసలు యీ విషయంలో యింత పట్టుదల ఎందుకు కలిగిందో చెప్పు" అని తాపీగా అన్నాడు. ఆమె చెప్పబోయేది జాగ్రత్తగా వినదల్చుకునే అన్నాడు.

"చెప్పనా?"

"ఊఁ"

వొణుకుతున్న కంఠస్వరంతో శకుంతల అంది "సిగ్గు విడిచి చెబుతున్నాను. నాలుగేళ్ల క్రితం అన్నీ అనుకున్నట్టు జరిగివుంటే మనమిద్దరం భార్యాభర్తలం కావలసింది కాని దైవం వేరే వున్నాడు. నువ్విలా పోయావు. నేనిలా అయ్యాను."

కొంచం విరామంతో తిరిగి గాద్గదికంగా "నీకు తెలీదుగాని యీ యింట్లో నీకు చాలా గౌరవం వుంది.

నిన్ను పరాయిచోటికి పోనివ్వటం ఎవరికీ యిష్టం లేదు. నువ్వు నా మరిదివి అయితే యింక ఎక్కడికి పోతావు?" అంది.

సూర్యారావు చలించకుండా "నీకు కూడా నే నంటే గౌరవం వుందా?" అన్నాడు.

"నన్ను గాకుండా యీ యింట్లో ఎవరిని అడిగినా సమాధానం చెబుతారు ప్రశ్నకు."

"నువ్వు నన్ను ఎప్పుడైనా ప్రేమించావా?"

ఆమె తెల్లబోతూ "ఈ సమయంలో అది చాలా అనవసర ప్రసంగం" అంది.

అతను కోపంతో మండిపడుతూ "యింతవరకూ నువ్వు చేసింది అవసర ప్రసంగమా ? నీకు సిగ్గులేదూ? ఈ అర్ధరాత్రిపూట వచ్చి మొగాడితో మాట్లాడేందుకు. ఉండు నీ ప్రశ్నకు సమాధానం విని మరీ వెళ్లు. ఎందుకయితే ఆనాడు పారిపోయానో ఆ కారణం చేత నే యిప్పుడు సీతను చేసుకు నేందుకు యిష్టపడటం లేదు" అని అరిచాడు.

మొదట ఆమె అతనికి జవాబు చెప్పకూడదనుకుంది. కాని యీ చివర వాక్యం విని, వళ్లు తెలియని ఆవేశంలో "ఏమిటిమరీ చెప్పు" అంది.

"చెబుతాను. చెప్పవలసిన సమయం యిప్పుడు వచ్చింది. నువ్వు మంచిదానివి కావు"

"అంటే?"

"ఇంకా విపులంగా చెప్పాలా? నీ మొహం ముందు నా నోటిగుండా వినవల్సిన దుర్దశ పట్టినందుకు చింతించు. ఆ రోజుని నా జన్మలో మరిచిపోను. నా కళ్లారా చూశాను.

"ఏమిటి ?" శకుంతల భయంతోనూ, దుఃఖంతోనూ కంపించసాగింది.

"గోవిందం..."

ఆ మాట అసంపూర్తిగానే వుండి అతను "ఏ మాయమాటలూ చెప్పి నన్ను బుకాయించలేవు. మీ రందరూ నాకంటగడదామనుకుంటున్న పిల్ల నీ చెల్లెలు కాదా ?" అన్నాడు గబగబ.

ఆమె జవాబు చెప్పకుండా వెక్కి వెక్కి ఏడవటం అతనికి వినిపించింది. "అంతే. ఏడవాలి" అనుకున్నాడు.

"నువ్వు దీనికి ఏమయినా జవాబు చెప్పగలవా ?"

సిగ్గు, అభిమానం, దుఃఖం కూడిన కంఠంతో ఆమె "నువ్వు యిందుకు పారిపోయావని యిప్పుడు తెలిసింది. మీ రెవరూ క్షమించరాని తప్పు చేశాను. అదంతా చిన్నతనం...అది యింకా ఏదో చెప్ప బోయింది.

"చిన్నతనం !" సూర్యారావు వెటకారంగా అన్నాడు.

"నువ్వు నన్ను ఆక్షేపించవచ్చు బావా. నన్ను క్షమించమని ఎవరినీ ప్రార్థేయపడటంలేదు. లోకంలో క్షమార్హంలు లేని తప్పులలో ఒకటి. కాని నేను సిగ్గులేకుండా నీముందు నిల్చుని ఉన్నానంటే కారణం ఏమిటో తెలుసా ?"

"మనం యిక విడిపోదాం. ఎందుకు కబుర్లు, పరిస్థితి యింత విషమించాక కూడా.

"కాదు. నువ్వు వినాలి. నేను చేసింది మహా పరాధం అవటంవల్లనే యిలా [illegible] అనుకుంటున్నా వేమో. కాని నాకు తెలిసి [illegible] కూడా అన్యాయం జరగనియ్యనంటాను..."

సూర్యారావు మాట్లాడకుండా, త్వరపడలేదు గాడు.

శకుంతల "ఇది విను బావా. శకుంతల చేసింది ఎటువంటి అసహ్యాకరమైన పని అయినా, అదంతా పరిస్థితుల ప్రభావం అనీ, నీమీద ఆమెకు అగౌరవం ఎంతమాత్రమూ లేదని గుర్తించు. నిన్ను ఎంతో గౌరవించింది. ఆ గౌరవాన్ని నిలబెట్టుకునేందుకు తన చెల్లెలిని పెళ్ళి చేసుకోమ్మని ప్రార్థిస్తున్నారు" అంది నిర్వికారంగా.

"మనం మళ్ళీ మొదటికి వస్తున్నాం."

"లేదు. నీ సంశయం అర్థం అయింది. సీత చాలా మంచిది"

"నువ్వు చెబుతున్నావా?"

ఆమె బాధతో "అవును. మనస్ఫూర్తిగా చెబుతున్నాను. దానిలో ఎటువంటి కల్మషమూ లేదు. ఎంత పెంకెదో అంత అమాయకురాలు" అంది.

"నిదర్శనం?"

"చెడును నిరూపించటానికి నిదర్శనాలూ, రుజువులూ చాలా లభిస్తాయి గాని మంచిని నిరూపించటం

క్రియద్వారా కష్టం బావా. అది కేవలం తెలివి తేటల మీదా, అనుభవం మీదా వ్యక్తం అవుతుంది"

"నీ మాటల్ని నమ్మేదా?"

"ఎందుకు నమ్మవు?"

"ఎందుకు నమ్మాలి?" వెటకారంగా అన్నాడు.

అకస్మికంగా కలిగిన క్రోధావేశాలలో ఆమె వెనువెంటనే నోరు కదల్చలేకపోయింది. తరువాత బుసలు కొడుతూ "ఈ స్థితిలో వున్న ఆడది ఎప్పుడయినా అబద్ధం చెబుతుందా? మూర్ఖుడా! పోపో! నా కళ్లముందు వుండవద్దు" అని అరిచింది.

నిరుత్తరుడై అతను ఒక క్షణం అచేతనుడై నిలబడిపోయాడు. తరువాత మెల్లగా తెలివి తెచ్చుకుని ఆమెను సమీపించి "నన్ను క్షమించమని అడుగుతున్నాను" అన్నాడు.

"ఏమిటి?" ఆమె విస్మయపూర్వకంగా అంది.

"నేను సీతని పెళ్లి చేసుకుంటాను"

"కృతజ్ఞురాలిని" అంటూ ఆమె యింకా అక్కడ నిలబడకుండా వెళ్లిపోయింది. సూర్యారావు నిట్టూర్చి చుట్టూరా కలయజూశాడు. చీకటి.

తడుముకుంటూ మెల్లగా నడిచి గదిలోకి వెళ్లాడు. మంచంమీద కూర్చుని "ఏం జరిగింది?" అని ప్రశ్నించుకున్నాడు.

అతని మనస్సంతా సంక్షోభంతో నిండిపోయింది. ఎటువంటి వింతరాత్రి. ఎటువంటి అనుభూతులు!

చప్పున తెల్లవారితే బాగుండును. చప్పున సూర్యుడు ఉదయిస్తే బాగుండును.

ఈరాత్రి యిహ తనకు ఎలా నిద్రపడుతుంది? విచిత్రమైన ఆలోచనలతో సతమతమౌతూ గడపాలిసిందేనా?

అలాగే పడుకుందామని ప్రయత్నించేటంతలో గదంతా ఒక్కసారిగా వెలుతురుతో నిండిపోయింది. అదేమిటి? అతను నివ్వెరపోయి ద్వారంవైపు చూశాడు. చేతిలో దీపం పుచ్చుకుని అక్కడ సీత నిలబడి అతని వంక చూస్తోంది.

"సీతా!" అన్నాడు పొడిగా.

చేతిలోని దీపం నేలమీద పెట్టి, యింకా అతని నేత్రద్వయంలోకి సూటిగా చూస్తూ "మనోరమ ఎవరు?" అనడిగింది.

సూర్యారావు తెల్లబోయాడు.

"పద్మ ఎవరు?"

"............"

"రాగిణి ఎవరు?"

సూర్యారావు కష్టంమీద తెలివి తెచ్చుకుని, ఆమె వంక చూడటానికి భయపడి "ఈ రాత్రి వేళ యింకా ఏమిటి సీతా?" అన్నాడు తల ఎత్తకుండా.

"ఈరాత్రి యింకా చాలా జరిగాయిగా"

అతనేం మాట్లాడుతాడు?

నీ సూట్ కేసును నువ్వు యింట్లో లేనప్పుడు తెరిచి ఫోటోల ఆల్బమ్, ఉత్తరాలూ చూసినందుకు నిన్ను నేను క్షమాపణ అడగవల్సిన పనిలేదు. అలాఅయితే అక్కయ్య విషయంలో నువ్వు చేసిన పనికి దానికి క్షమాపణ చెప్పుకోవాల్సి వుంది" సీత చలించకుండా అంది.

సూర్యారావు తెగించి తలఎత్తి "అయితే యింతకీ నాదగ్గర్నుంచి నీకు కావలిసింది ఏమిటి?" అనడిగాడు.

"మనోరమ విషయం నిజమేనా?"

అతను మళ్లీ తలవొంచుకుని "ఊ" అని గొణిగాడు.

"మీ యిద్దరూ కలిసి తీయించుకున్న ఫోటో నే అందుకు సాక్ష్యం. రాగిణి?"

"అన్నీ నిజమే."

"పాపం పద్మని ఎందుకు మోసంచేశావు ?"

"ఆమెను పెళ్లి చేసుకుందామని నే నెన్నడూ అనుకోలేదు. ఆమే భ్రమపడి అలా అనుకుంది" అన్నాడు సూర్యారావు దీనంగా.

"ఈ నాలుగేళ్లూ దేశాలు తిరిగి చేసిన ఘన కార్యాలు యివేనా?" కటువుగా అంది సీత.

"నేను కావాలని ఏమీ చేయలేదు."

"చిన్నతనమూ" వెటకారంగా అంది.

అతను అదిరిపడి ఆమె కళ్లల్లోకి చూశాడు. ఏమయినా భావాలు దొరుకుతాయనే పిచ్చినమ్మకంతో అతను చూడలేదుగాని, మనసులో ఏదో స్ఫురించి "నువ్విలా ఎందుకడుగుతున్నావో నా కర్థమయింది మా మాటలన్నీ చాటుగా విన్నావా?" అన్నాడు

"నువ్వు నేర్పిన విద్యే."

దెబ్బమీద దెబ్బగా యిలా వరుసగా తగలటం చూసి అతను "నిజమే. నేను దేశాలు తిరిగి పాడయిపోయాను" అన్నాడు ఖేదంగా.

ఆమె మాట్లాడకుండా అతనివంక చూస్తోంది.

ఆమెను సమీపించి చిన్నగా "నిన్ను పెళ్లి చేసుకునే అర్హత లేదు. నీకు సమాధానం దొరికిందా?" అని సిగ్గుతో "నా కళ్లు తెరిచావు. నేనింత పతితుణ్ణని, ఎవరిని పెళ్లి చేసుకునేందుకూ అర్హతలూ, యోగ్యతలూ నాకు లేవని బోధపడింది. నన్ను పెళ్లి చేసుకోకు. నాకంటే మంచివాణ్ణి......" బాష్పాలతో అతని గొంతు పూడుకుపోయింది.

సీత నిశ్చలంగా "కాని నిన్ను నేను పెళ్లి చేసుకుంటాను" అంది.

అతను తెల్లబోయి ఆమెకేసి ఆశ్చర్యంగా చూశాడు.

"అవును"

"ఎందుకు కష్టాల్లో పడతావు? నేను మంచివాణ్ని కాను"

"పర్వాలేదు" ఆమె అంది "మీలో లోపించిన క్షమ, విశాలభావాలూ మాలో వున్నాయి. ఏమాత్రం కలత చెందకుండా నిన్ను నేను భర్తగా స్వీకరించగలను"

అతను ఆర్ద్ర నేత్రాలతో ఆమెవంక చూస్తూ "సీతా" అన్నాడు.

"నీ విషయంలో నేను హామీ యిస్తున్నాను. నా విషయాల్లో అక్కయ్య చెప్పినదాన్ని గురించి రుజువు చేసుకోవటానికి నాకేం అవసరం లేదు. బాగా ఆలోచించుకుని ఏదో నిశ్చయానికి రా" అని అక్కడి నుంచి వెళ్లిపోబోతూ "ఒక్క విషయంమటుకు నీకు తెలుపదామనుకున్నాను. ఈ రాత్రి నేను చాలా కొత్త విషయాలు విన్నా, అక్కయ్యంటే నాకేమాత్రం ఏహ్యత కలగలేదు. ఆమెమీద ప్రేమ గౌరవం యినుమడించింది" అని చకచక నడిచి వెళ్లిపోయింది.

ఆమె వెళ్లినవంకే భావశూన్యంగా కొంతసేపు చూసి, తరువాత నిమ్మదిగా కిటికీదగ్గరకు వచ్చి తూర్పు దిశ చూశాడు.

ఇంకా తెల్లవారలేదు. సూర్యుడు రాలేదు.

కాని అతని మనసులో...

అందుకు కేవలం వ్యతిరేకంగా జరిగింది.

# సూఫీవాదము

## శ్రీ కర్ణ రాజశేషగిరిరావు

మహమ్మదీయ మతమునందలి సూఫీవాదము పుస్తక రూపమున పరిగణించినది కాదు. ఇందు అధ్యాత్మ తత్త్వము, మఱియు సాధనాక్రమమును సంప్రోషితములైనవి. సూఫీ వాదమునందు అధ్యాత్మిక ప్రతిపత్తి, తత్సాధనములు సూచింపబడినవి. సూఫీ వాదమునకు నిశ్చితరూపము 12 వ శతాబ్దమున నేర్పడెను. తదుపరి అనేక మతముల ప్రభావము దానిపై బడెను.

పారసీక భాషలో సూఫీ మతమును 'తసవ్వుఫ్' అందురు. ఈ రెండు శబ్దములు 'సూఫ్' అను శబ్దము నుండి వెల్వడినవి. ఈ శబ్ద వ్యుత్పత్తి విషయమునం దనేక మతభేదములు గలవు. మదీనాలోని మసీదునందు 'సోఫా' గలదు. దానిమీద గూర్చుండు ఫకీరులను సూఫీ లందురు. సూఫీ శబ్దము సఫ్ (పంక్తి) శబ్దము నుండి వెల్వడినదనియు, కయామతుదినమున సేవకు సదాచార సంపన్నులో వారు వేరే పంక్తిలో గూర్చుండబెట్టబడుదురని వారే సూఫీ లని యందురు. సూఫీలు పవిత్రులు, స్వచ్ఛంద్రులును. సూఫీ శబ్దము వాస్తవముగ సోఫియా (జ్ఞానము) యొక్క రూపాంతరము. జ్ఞానముగలవారు సూఫీలు. వీరు సూఫ్ (ఉన్ని)ని ధరింతురు. అందువలన సూఫీలని పిలువ బడుదురు. నికల్సను, బ్రౌను, గోల్డియరు ఈ యభిప్రాయమును బలపఱుతురు.

ఇస్లాము మతమునకు దీనికి పరస్పర సంబంధము గలదు. అయినప్పటికి మాదన భావముతో నీశ్వరు నారాధించుట, సంయోగ వియోగములతో మేల్కొల్పు ప్రవృత్తి నవలంబించి పరమసత్తనెఱుంగుట ప్రాగైతిహాసకాలమునుండియు ననుస్రుతముగ వచ్చుచున్నది. సూఫీ వాదముపై క్రిందివాని ప్రభావ మున్నదందురు.

(1) ఆస్తికమతము (2) నాస్తిక మతము (3) నూత్న అలఫాతూనీ మతము (4) యూదు మతము (5) క్రైస్తవ మతము (6) బౌద్ధ మతము (7) భారతీయ వేదాంతము.

ఇస్లాము మతము పుట్టకమునుపే సూఫీలు గలరని తగువాయి భారతీయమత ప్రభావము దానిపై బడెన దని; తదుపరి తొమ్మిది, పదియవ శతాబ్దములందు పెంపొందిన దని తలంతురు.

అరబు, సిరియా దేశములకు భారతీయ సంస్కృతి వ్యాపించినది. సిరియా శేశస్థుల ఆదిపురుషుడు "ఆదము" స్వర్గమునుండి చ్యుతుడై దక్షిణ భారతమునందుదిగెను. అచ్చట అతడు అనేక వత్సరములు తపం బొనరించి, అంతరంగిక ప్రేరేపణపై అరబుదేశమునకు తరలి పోయెను. అక్కడవారు 'కాబా' నిర్మాణమును గావించి శివలింగము నేర్పాటుజేసిరి. ఆదము కృషీవలుడై యుండవచ్చునని కొందరిమతము. భారతదేశ మాతని జన్మస్థానము. ఆదముయొక్క సంబంధము 'పణి' యను జాతిలో నున్నదని శ్రీ చంద్రబలీ పాండేయ అభిప్రాయపడినారు. ఈ జాతివారు హారప్పా, మొహెంజదారోలలో నివసించిరి. ఆర్యుల యాక్రమణకు దాళలేక వారు బవేరు, అరబు, దక్షిణ భారతములకు వెళ్లిరి. జలప్రళయము తర్వాత ఆదము శవము జరూశలేము తీసికొని పోబడినది.

అనగా ప్రాచీన కాలమున మధ్య ఆసియా దేశమునందు మాదన భావము నాధారముగా గొని విశేష జాతి, మతము వికసించినదని చెప్పవచ్చును. ఇది భక్తి, యోగ, జ్ఞానాత్మకమై యుండనోపును. ఈ ధర్మమే ఉపనిషత్తులకు రహస్యవాణి నిచ్చియుండును. సిరియా దేశమునందు రహస్యవాణి మూలరూపమునం దున్నది.

ఆర్యమతము ఈరాను, భారతదేశములందు వికసించినది. భారతదేశమందలి సురులు ఈరాను దేశీయులకు 'అసురు'లైరి. కాని ఆర్య సంస్కృతి విభిన్న

రూపములందు వెలుగొందుచున్నను పరస్పర వినిమయము లందుకొనినది. సిరియా మతవికాసమునందు పారసీకుల (ఇరానీ ఆర్యులు) ప్రభావమెక్కువగా నున్నది. పారసీకార్యులందు ఒక శాఖ 'మగ్గయ' యని పిలువబడుచుండెడిది. క్రీస్తుకాలమునందుతూర్పు ఇరానునందు సాధువులకు గౌరవ మెక్కువగా నుండెడిది. సూఫీలు 'మగవు' లను తమ గురువుల నెంచుకొనిరి. నాస్తికమత ప్రవర్తకుడు 'మైను' అను పేరుగల మగవు. అతని సంప్రదాయము బౌద్ధమతముపై నాధారపడియున్నది. మానీ మతముగూడ సూఫీమత వికాసమునకు తోడ్పడినది. మానీ మతప్రవర్తకుడు బౌద్ధధర్మము నెఱుంగుటకు చీనా, భారతదేశములందు పర్యటించెను.

నవఅఫ్లాతూను గూడ సూఫీమత వికాసమునకు తోడ్పడినది. ఈ వేదాంతము గ్రీకు వేదాంతమునందంతిమ రూపము. ఇందు పాశ్చాత్య వేదాంతము, పౌరస్త్య యోగము, రహస్యవాదము అధ్యాత్మతత్త్వము కలిసియున్నవి (రాహుల సాంకృత్యాయను—దర్శన దిగ్దర్శనము) అశోకుడు బౌద్ధ భిక్షువులను యవనదేశముల కంపెను. ఈ సమయమందు పశ్చిమమునందు బౌద్ధధర్మము బాగుగా వ్యాపించినది. సికందరు (858.321) కాలమునందు భారతదేశము దార్శనికులకు, యోగులకు ప్రసిద్ధి నొందినది. క్రీ. పూ. 6 వ శతాబ్దమునాటికే ఉపనిషద్రహస్యములు జనించినవి. తదుపరి జైన, బౌద్ధ, యోగ, వేదాంత, శైవ, పాంచరాత్ర, మహాయాన, వాసుదేవ, భక్తిమార్గములు, రహస్యవాదమునకు తోడ్పడినవి. నవ అఫ్లాతూని దర్శనము ననుసరించి యింద్రియములకు గోచరించు ప్రపంచము మాయ, భ్రమ, యింద్రజాలమనియు తలంతురు. మానసిక జగత్తు నిజమైనదని వారి యూహ. అన్ని వస్తువులును పరమశక్తిచే సృజింపబడినవి. వానికి, పరమాత్మకు నవినాభావ సంబంధమున్నది. పరమతత్త్వమున్నదని గ్రహించుటకే కల్పన తోడ్పడును. కాని పరమతత్త్వ గుణములను గ్రహించుటకు నింద్రియములు సాధనములు కావు. ఈ పరమతత్త్వము నందే ఆత్మ పుట్టును. అదియే ఈశ్వరుడు. అతడే సృష్టికర్త. (ప్లాటినస్)

క్రీస్తుపూర్వము యూదులమతము బాగుగా వికసించినది. క్రీ. పూ. 2, 3 వందల యేండ్లకుముందు యూదుదేశమునకు బౌద్ధసన్యాసులు ప్రవేశించిరి. యూదులు సన్యసించుటకు విలువను భక్తిని గోరుదురు. క్రీస్తుమతము పుట్టుటకు ప్రాధాన్యము చాల తోడ్పడినది (తిలక్-గీతారహస్య). [illegible] మన మాదిరి భావముతో పరమసత్తతో సంబంధము జోడించుట భారతీయ భావమున కనుకూలముగ నున్నది. ఇదియు సాంఖ్యభావము కాదు. ఇది గ్రీకుల కల్పన. ఆర్య రహస్యము నుపనిషత్తులు బయలుపెట్టినవి. భక్తి భావములు పెంపొందిన పశ్చిమదేశములకు వ్యాపించినవి.

సూఫీ మతము ఇస్లాము మతమున కాధారమని 'కురాను' ఒప్పుకొనుచున్నది. కురాను [illegible] గ్రంథము నందు భారతీయ మతప్రభావము కన్పట్టుచున్నది. మహమ్మదు సాహెబు హీరా గుహలందు తపస్సు నొనరించి 'ఇల్హాము' (ఈశ్వర సందేశము) బొందెను. హిందా యను పేరుగల [illegible] తన రాజ్యమునందు మతములు నిర్మించెను. పురాణము నందు చెప్పబడిన హనీఫ్, సేబి జాతులు భారతదేశమునందలి 'ఫణి', 'శైవ' జాతులు కావచ్చును! [illegible]; సర్వనాశనము; [illegible] భావములు ఉపనిషద్భావములే.

అరబ్బులు 'ఇస్లాము' మతమును స్వీకరించి దక్షిణదేశమునందలి రామేశ్వర యాత్ర ([illegible] చిహ్నములు) చేసెడివారు. ఈ [illegible] బౌద్ధమతస్థు లుండెడివారు. వీరిని అరబ్బులు 'బేగు' లందురు. వీరు అరబ్బులను సత్కరించెడివారు. వీరి వలన భారతదేశము పతనమైనది. కొందరు అరబ్బులు సింధుప్రాంతము నాక్రమించిరి. క్రమముగా ముల్తాను సూఫీల కేంద్రమాయెను. బాగ్దాదు విద్యాకేంద్రముగ నున్నపుడు బరామకులు మంత్రులయిరి. వీరు మొదట బౌద్ధమతస్థులు. సూఫీలపై, పై మతప్రభావము లన్నియు పడినవి.

మహాయానమతము సహజయాన, వజ్రయాన అను సంప్రదాయములుగ చీలిపోయినది. ఆనాడు సిద్ధులకు గౌరవముండెడిది. సూఫీలు వీరి పరిచయము నందుకొనిరి. సిద్ధుల యోగానందమును (పరమసుఖము) సూఫీలు అనుకరించిరి. ఈ విధముగ సూఫీమతమునందు గుహ్యత, భక్తి సమ్మిళితములైనవి. జిలీ మహమ్మదు సాహెబును ఇంసాను-ల్-కామిల్ (పూర్ణ పురుషోత్త

ము(ను) అని నిరూపించెను. శంకరుని యద్వైత వాదమును రామానుజుడు ఖండించినట్లు జిలీ అగర్బ్బీ పక్షమును ఖండించి విశిష్టరూపము నేర్పఱచెను.

## వికాసక్రమము:

మహమ్మదు సూఫీ మతము రహస్యపూర్ణమని ప్రచారము చేయలేదు. దీనిని అలీకి నేర్పెను. అది 'ఇమామత్' విప్లవములను రెచ్చగొట్టెను. 'హసన్' 'మోతజిలీ' యను సంప్రదాయమును స్థాపించెను. ఇది జ్ఞానాశ్రయ భక్తివాదమువలె నుండును. ఇందు మాదన భావము కలుగలేదు. ఇస్లామీ సూఫీ వాదము 8, 9 శతాబ్దములందు వికాసమునొందెను. రుబియా (752) ఆమె శిష్యురాండ్రు, మంసూరి ప్రధాన సూఫీలు. రుబియా దాసి. ఆమె తనను అల్లాయొక్క పత్నిగా తలంచెడిది. మీరా, ఆండాళులు కృష్ణుని తమ భర్తగ నెంచిరి. అట్లే రుబియా అల్లాయొక్క పెండ్లికూతురు నని చెప్పుకొనినది. రుబియా యిట్లు చెప్పుకొనెను— "ఓ నాథా! నక్షత్రములు మెరయుచున్నవి. లోకులు కన్నులు మూసికొనిరి. సమ్రాట్టులు ద్వారములను బంధించుకొనిరి. ప్రతిప్రియుడు తన ప్రియురాలితో ఏకాంతసేవన మొనరించుచున్నాడు. నేను ఒంటరిగా నున్నాను." (రుఫీయూదమిస్టిక్), "ఓ నాథా! నేను నిన్ను రెండువిధముల ప్రేమించుచున్నాను. ఒకటి స్వార్థపూరితమైనది. అనగా నేను మిమ్ములను దప్ప నన్యులను కామించను. రెండవది పారమార్థికము. అనగా మీరు నా పరదాను నా కండ్లనుండి తొలగింపుడి. నేను మిమ్ము సాక్షాత్కరించి మీ సురతియందు నిమగ్నురాలనగుదును. ఎట్టి పరిస్థితులందీ శ్రేయస్సు నాకు లభింపనిది? ఇది మీ కృపాపాత్రమే"

రూమియూ అద్వైతబ్రహ్మను తన మాదన భావమునందు అలంబనముగ స్వీకరించెను. 'ఓరసూల్! మీ రెవరికి నచ్చరు. జీవులందఱు కోరుదురు. కాని నా పరిస్థితియే వేఱు. నా హృదయమందు పరమేశ్వరుడు వ్యాప్తినొందియున్నాడు. అతనికి దప్ప ఇతరులకు స్థానమే లేదు.' ఈ భక్తస్త్రీలు రసూలును మధుర భావముతో వీక్షించి జీవితమంతయు పరమేశ్వర ప్రేమతో పునీత మొనరించుకొనిరి. వీరి యుద్గారములందు పవిత్రప్రేమ కన్పట్టెడిని. వేదనాప్రాచుర్యము, వియోగ సంయోగప్రేమ చిత్రింపబడినది. ఈ భావనయే నానాటికి వాసనోన్ముఖ కామముగమారి నైతిక పతనమునకు కారణభూతమాయెను. కాని వారిని మాత్రము సహస్రహృదయములందు శాంతి సుఖముల సంచరింప జేసినది. ఇట్టి ప్రేమభావన భారతీయులకు క్రొత్తగాదు. రాధాకృష్ణుల ప్రేమ వ్రజప్రాంతపు గొల్లభామలవఱకు వ్యాపించినది అనంత సౌందర్యము రాధాకృష్ణులలో వెల్లివిరిసి అనంత ప్రకృతియందు కణకణమునందు వ్యాపించెను.

ఇబ్రహీము, దావూదుతాయి ఎనిమిదవ శతాబ్దమునందు పేరెన్నికగన్న సూఫీలు. వీరియందు అనురాగమునకంటె విరాగ మెక్కువగా కన్పట్టుచున్నది. వీరు లౌకికప్రేమను (ఇస్క్-మిజాజి) పారలౌకికప్రేమ (ఇస్క్-హకీకి) కు ప్రతీకగా స్వీకరించిరి. పూర్వదేశములందప్పుడు నిర్గుణజ్ఞానము ప్రబలుచుండెను. శంకరాచార్యుడు అద్వైతమతమును ప్రచారమొనరించెను. మోతెజిలీలు అద్వైత మతమును స్వీకరించిరి. అబూహాసిము (770) నిజమైన సూఫీ. తరువాత రుబియా, మన్సూరులు వచ్చిరి. మన్సూరు ప్రేమజీవి. హల్లాజ్ అన్‌అల్‌హాక్ అని చెప్పెను. 'తత్త్వమసి' అను బ్రహ్మవాదమును ఇదే. అతడిట్లనెను— "నేను ఎవరిని ప్రేమింతునో అతను నేనే. ప్రేమించునది నేనే. నేను ఒక శరీరమునందుండు రెండు ప్రాణుల వంటివాడను. నీవు నన్ను చూచిన అతనిని చూడగలవు. అతనిని చూచిన మా యిద్దఱిని చూడగలవు'. సూఫీ సిద్ధాంతము లిటనుండి ప్రారంభమైనవి.

ఫరాబీ (950) ఖురాను, వేదాంతమును సమన్వయపఱచి సూఫీ మతమును తేటతెల్ల మొనరించెను. 'సతీదు' 'సమా' (సమాధి) నేర్పఱచెను. 'సమా' విషయ వాసనలను నాశన మొనరించుకొనుటకు తోడ్పడెను. 'సయీదు' మహర్షివంటివాడు. అతని సాధనాబలముచేత సూఫీ మతమును లోకప్రియ మొనరించెను. అందువలన ఇస్లాము సనాతనులు సూఫీమతమును ఇస్లాము ధర్మమునకు విరుద్ధమని గణించెదరు. ఇస్లాం, సూఫీమత సంఘర్షణము అరబ్బు ఈరాను మత సంఘర్షణలవంటిది. కాని సూఫీలకు లోకప్రియత్వమబ్బినది. ఇమాంగజ్జాలీ ఇస్లాము సూఫీమత సమన్వయ మొనరించెను. వీరి ప్రయత్నములవలన సూఫీ మతము ఇస్లామునకు దార్శనిక భూమికగా నేర్పడినది. గజ్జాలీ ధర్మము, దర్శనము, సమాజము, భక్తిభావమును

సమన్వయపఱచెను. అరబ్బీ, రూమీ మొదలగు సుప్రసిద్ధ సూఫీలు దీనిని పెంపొందించిరి. సూఫీ సాధనమునకు అల్లా, బౌద్ధసాధనకు నిర్వాణము, హిందూసాధనకు బ్రహ్మ ఆధారము. కాని సూఫీల అల్లాకు, ఇస్లాముల అల్లాకు భేదముకలదు. కాని ఇస్లాము మత ననుసారము అల్లాతప్ప దేవత లింకెవ్వరు లేరు. సూఫీల ఆధ్యాత్మతత్వమునందు అల్లా సత్తె సర్వోపరి. వీరు కరుణామయుడను 'రహీము'ను గొలుదురు. ఖురానులోని అల్లా వాస్తవముగ పరమదేవత. అతడు సగుణుడు, సాకారుడు, శాశ్వతుడు. సూఫీలకు అల్లా హృదయములో నుండును. అతడు అంతర్యామి; హృదయమును నద్దమును స్వచ్ఛముగ నట్టిపెట్టకొనిన అతని ప్రతిబింబమును జూడవచ్చును ఈ విధముగ అల్లా ఏకదేశీయుడు గాక సర్వాంతర్యామి, నిర్గుణ నిరాకారుడాయెను. 'జిలీ' అల్లాకు నాలుగు గుణములను జెప్పెను. (1) జాత (ఏకత, నిత్యత, సత్యత, సార్వభౌమికత) (2) జమా (ఉదారత, మాధుర్యము, క్షమ) (3) జలాలు (శక్తి, శాసకత్వము) (4) కమాలు (విరోధగుణముల సమాహారము)

ఇస్లాములు అల్లా యెదుట మస్తిష్కము నొగ్గెదరు. సూఫీలు అల్లా ఎదుట హృదయమును సమర్పింతురు. సూఫీల భావనకు వేదాంతుల బ్రహ్మవాక్కునకు సమరసత యెంతేనికలదు. అందువలన ఇందు రహస్యవాదము, మాదినభావము (ఇశ్క) పెంపొందెను. జీవుడు: ఖురానులో బ్రహ్మ జీవుల సంబంధమును గుఱించి చెప్పలేదు. కాని అల్లా మహమ్మదు సంబంధమును గుఱించి యున్నది. అల్లా ఒక్కడే: అతడు సర్వోపరి; అతనిసత్తె అన్నింటికంటె మించినది. మహమ్మదు అతనిదూత. (రసూల్), దూతలు వచ్చుచుందురు. కాని మహమ్మదు అంతిమ దూత. అల్లా మఱియు ఇస్లాముల సంబంధము సేవ్యసేవకభావము వంటిది. సూఫీలకు అన్-అల్-హాక్ (జీవుడే బ్రహ్మ) అతడు సత్యము, నిత్యమును. మనుష్యుడు అల్లా యొక్క ప్రతిరూపము.

సూఫీలు అద్వైతవాదులు. కాని జీవుడు జీవుడే. బ్రహ్మ బ్రహ్మయే. హల్లాజు సిద్ధాంతము ప్రకారము జీవుడెన్నటికి బ్రహ్మ గాడు. అతడెవనిని ప్రేమించునో అతడే అతడు. ఇద్దఱు ప్రణయబద్ధులు. రూమీ సిద్ధాంతము ప్రకారము వీరియందు నొక్కటే యాత్మ వసించును. ఫారిజు ప్రకారము వీరిద్దఱిలో భేదముకలదు.

## సృష్టి:

రూహ్ ఒక అలౌకికశక్తి. ఇందు అల్లా ప్రకాశించుచుండును. ఇదే సృష్టికి ఉపాదానము. ఇట్టి రూహ్ మనుష్యునియందున్నది. అల్లా నిజసత్తెను రూహ్ రూపమునని చ్చెనని జిల్లీ చెప్పినాడు. సృష్టిలోని ఉపకరణములన్నియు అల్లాయొక్క అంగప్రత్యంగములు. సూఫీలు సృష్టిలో ప్రతిబింబితమైన అల్లా సౌందర్యమును గాంచి ముగ్ధులై తన్మయులగుదురు. జీవుడు అల్లాయొక్క ప్రతిబింబము. ప్రకృతికి నతనికి పరస్పరసంబంధమున్నది. అనగా ప్రకృతియే సూఫీలకు మహత్తర సాధనము. ప్రకృతి సౌందర్యమునందు తల్లీనుడై సాధకుడు ఈశ్వరానుభూతిని బొందును.

## సైతాను:

భారతీయ వేదాంతమునందు బ్రహ్మమును, జీవుని వేరు చేయునది 'మాయ', సూఫీల ప్రకారము సైతాను అల్లా, ఇన్సానులను వేరుచేయును. ఇస్లాము మతమునందు పాపసమస్య పొటమరింప నేలేదు. పాపము పుణ్యమును బోధించుటకు మాత్రమే. అల్లాలో పాపమేమియును లేదు. ప్రకృతి దోషము లతనిని స్పృశింపవు. అందువలన అల్లా పాపి కానేరడు. వాస్తవముగ పాపము లేనేలేదు. ఉన్నదనుకొనినను పాపములని పుణ్యము ప్రజ్వలించును.

## అన్ అల్ హాక్:

నిజముగా అల్లా, ఇన్సాన (మనుష్యులు) తత్వమొక్కటియే, అల్లాలో 'జమాల్', '…ల్' తత్వములున్నవి. ఇవి మనుష్యునిలో నున్నవి. 'యత్ పిండే తత్ బ్రహ్మాండే' పిండములో నున్నవాడు బ్రహ్మాండమునందున్నాడు. మనుష్యునిలో రూహ్ (ఆత్మ) గలదు. ఇది అల్లాయొక్క ప్రతిబింబమే. అల్లాయొక్క ఆత్మదర్శనము ఈ రూపమును బొందినది. పరమాత్మదర్శనమైన పిమ్మట అల్లాకు, మనుష్యునకు భిన్నము లేనేలేదు.

అన్‌హాల్‌హాక్ — నేను బ్రహ్మను. ఈ యనుభూతి నొందుటకే సూఫీలు ప్రయత్నింతురు. ఇది సహజముగ ప్రాప్తించునది గాదు. దీనికి సాధనకావలెను. దీనినే సూఫీలు విరహసాధనమందురు. సూఫీలు జీవ, బ్రహ్మైక్య ఆతురపడుదురు.

# సూ ఫీ వా ద ము

సూఫీలకు 'కల్బము' 'సిట్జ్,' 'నఫ్స్' ముఖ్యమైన వస్తువులు. కల్బము మనుష్యుని అత్యంతసూక్ష్మబుద్ధి. ఇది సత్యమందిరము. ఇందు అల్లా నివసించును. జప తపనామసాధనములవలన జీవుడు పరిష్కృతుడగును. జీవుడాచరుడైనపుడు అతనియందు సాత్త్వికభావ మేర్పడును. ఈ సాత్త్వికభావమును 'సిట్జ్' అందురు. 'నఫ్స్' అంటే ఇంద్రియలోలుపత. పంచేంద్రియములు దీనికి సాయపడును. విషయవాసన, భోగవిలాసము, ఆత్మశంసన— దీని రూపములు. వీనినుండి విముక్తి నొందినగాని ఆత్మశుద్ధి కలుగనేరదు.

మనుష్యునికి 'నఫ్స్, రూహ్, అకల్' ఈమూడు గుణములుండును. 'అకల్' అనగా బుద్ధివిలాసము. ఇది 'నఫ్స్' (నీచప్రవృత్తి) వలె బాధను కలిగించి పీడించుచుండును. జీవునియందు సాత్త్వికప్రవృత్తి 'రూహ్' యందు రూపొందియుండును. దీనిని 'నఫ్స్', 'అకల్' నాశనమొనరించుచున్నవి. దీనికాధారము 'ఖుదీ' (అహంకారము) 'అహం'ను చంపుకొనినగాని 'ఖుదా' కన్పించదు.

## సూఫీసాధన!

సూఫీసాధన సామాన్యమైనది కాదు. ఇది వ్యక్తి గతమైనది. ఇది హృదయసాధన. అందువలన సామాజిక నియమములిందు పాటింపనక్కరలేదు. వ్యక్తి యెంత పరిష్కృతుడైన అంత జీవుడు సాత్త్వికుడగును. ఈ సాధనకు హృదయము ముఖ్యావసరము. సూఫీలు నామస్మరణమును కేవలము నామము నుచ్చరించుటకు చేయరు. నామస్మరణవలన 'విహ్వలత' 'ఆతురత' యేర్పడవలెను. ఇట్టి విహ్వలతలో తల్లీనత యేర్పడును. సూఫీలు దయ, త్యాగమును దృష్టిలో బెట్టుకొని సన్యసించుటకు ప్రయత్నింతురు. అట్టి సమయమున సంతోషము (తవక్కుల్) అత్యావసరము. సౌమన స్సంయమము. అనగా తపము. దీనికి ప్రధానాంగము 'ఉపవాసము'. ఈ విధముగ ఖురానులోని సాధనమునకు సూఫీలు నూతనరూపము నిచ్చిరి.

'శరీయతు' నందు కర్మకాండ మొదలుపెట్టబడును. సూఫీసాధనము వాస్తవముగా ప్రేమతో ప్రారంభమగును. గర్వమును పోగొట్టుకొని, సంతోషముతోనుండి, యీశ్వరాదేశప్రకారము నడచుచు, అతిడనిన భయపడుచు, బ్రతుకుతెరువుకొరకు తికమకలు పడకుండా ఈశ్వరధ్యానమొనరించుట— ఇవి మజిలీలవంటివి. అలాయనిన నెప్పుడు ప్రేమకల్గునో అప్పుడు 'తరీఖతు'కు జీవుడు ప్రవేశించును.

'తరీఖతు'నందు జీవుడు సాధకుడగును. అప్పుడతనికి నిలుకడ కావలెను. అప్పుడే సాధనమందు ప్రజ్ఞావంతుడగును. అప్పుడెల్లా స్వరూపమును గుఱించి యాలోచించి విరహపీడితుడగును. అప్పుడు 'మారిఫతు' చేరి జ్ఞానియై, 'హకీకత్' చేరును. హకీకతునందు మహా 'మిలన' మేర్పడును. సాధకుడు 'ఫనా' మజిలీ చేరి 'అన్ హల్ హక్' అని కేకలిడును.

'శరీయతు' కర్మకాండతో గూడికొనినది 'తరీ' వలన జ్ఞానోదయము కల్గును. 'తరీకతు' మజిలీలో నిజమైనప్రజ్ఞ (ఉవారిఫ్)వలన కల్గును. ఇదియే పుష్టి. ఇదియే వల్లభాచార్యుని పుష్టివాదము. ఈ నాలుగు మజిలీలు భారతీయ దార్శనిక పరంపర ననుసరించి కర్మకాండ, ఉపాసనకాండ, జ్ఞానకాండ, భక్తికాండములవలె నుండును. కాని సూఫీసాధనలో సాధకుడు కర్మ, ఉపాసనా, జ్ఞానములనుదాటి భక్తిని బొందును. 'హకీకతు' సర్వోపరికాండ. 'సిట్జు' అవస్థను బొందినవాడు పరమహంసయగును.

సాధనకు సహాయాంగములు 'జిక్ర్', 'మరాకబా', 'సమాఅ', 'జిక్ర్'లో యోగాసన జపతపాదులు చేరును. సాధకుడు మంత్రోచ్చారణ మొనరించుచుండును. 'జలీ' సంఘసాధన. 'జఫీ' హృదయసాధనము. 'జిక్ర్'వలన ఫిక్ర్ (చింతన) కలిగి మరాకబ (సమాధి)లోనికి పరివర్తితమగును. 'జిక్రు' నకు ప్రధానాంగము సమాఅ (సంగీతము). వైష్ణవధర్మమునందట్టి సంకీర్తనముకలదు.

## ముకామాత్(రహస్యయాత్ర)

సూఫీలు నాలుగులోకము లున్నవని నమ్మెదరు.

(1) నాసూత్ (నరలోకము—జాగ్రదవస్థ)

(2) మలకూత్ (దేవలోకము— స్వప్నావస్థ)

(3) జబరూత్ (ఐశ్వర్యలోకము—సుషుప్త్యవస్థ)

(4) లాహూత్ (మాధుర్యలోకము— తురీయావస్థ)

'హాహూత్'ను సత్యలోకమందురు. ఇవే కాక ముకామాత్తు లేడుకలవు. (భూమికలు)—అబూదియా,

ఇశ్క్, జహాను, ముబారిక, విజ్ఞ, హాకీక్, వస్ల్. 'వస్ల్' ప్రాప్తివలన అహంకారము నాశనమగును. మురశిద్ (గురువు) ఉపదేశములవలన నీ రహస్యములు తెలియును.

## ప్రతీక : రహస్యవాదము

వేదాంతము రహస్యనిష్ఠము—

ఇందు గూఢార్థములెన్నియో నిలచియుండును. ఆత్మకు, పరమాత్మకు; జీవునకు, పరబ్రహ్మమునకుగల పరస్పర సంబంధమును వ్యక్తముచేయుటకు వేదాంతులు వివిధ ప్రయత్నములు చేయుదురు. ఇట్టి ప్రయత్నము నందు సఫలులగుటకు ప్రతీకాత్మకమగు భాష నుపయోగింతురు.

సూఫీమతమునందు 'రతి', 'సంగతి'కి ప్రధానత నిచ్చిరి. దీనికుద్దీపనము 'మదిర'. 'సాకీ' అల్లాయొక్క రూపము. 'సూమియో' 'జామియో' వేదాంతుల సృష్టికి 'అల్లా' స్త్రీరూపమున దర్శనమిచ్చెను. దీనికి ప్రతీక సౌందర్యమే. 'సురాపానము' ఉల్లాసమును జేకూర్చు ప్రతీక. సూఫీ సాహిత్యమునందు 'సాకీ' ప్రధాన ప్రతీకయాయెను. అంగ ప్రత్యంగములను ప్రతీకల నేర్పఱచి ప్రేమను పెంపొందించుటకు ప్రయత్నించిరి. 'బుల్ బుల్' విరహోత్క పెట్టుకేకలు. ఆబోమాహీ (జల మీన) సంబంధము సన్నిహిత సంపర్కమును ప్రబోధించును. విశ్వమునందు ప్రతికణమునందు విరహతాపము వ్యాపించియున్నది. లౌకిక ప్రేమను అనగా స్త్రీ పురుషుల ప్రేమనుదిసికొని అలౌకిక ప్రేమనువ్యక్తమొనరించుటకు వారు ప్రయత్నించిరి. హృదయము నందు ఘనమైనవ్యథ యేర్పడినపుడు జీవిత వికాసము కల్గును. ఇది కేవలము జ్ఞానమువలన రాదు. హృదయము నందు స్వార్థ ముండకూడదు; కామ వాసనలుండ గూడదు; ఐశ్వర్య సిద్ధికై అఱ్ఱులుచాచ కూడదు; ప్రేమయే కావలెను. ఆ మదిరాపానములో, ఆనందోల్లసిత సంపర్కములో, ఆ సౌందర్యాకాంక్షలో త్రాగి తెలియకపడిపోయిరి (సానసీతబరీను) ఆ పరమ సీమయందు ఆత్మ పరమాత్మలకు భిన్నముండదు. అది గంభీర మేకాంత సత్యమైనది; పరమశాంతియుత మైనది: అగోచరము అనాత్మ ప్రేమానిర్వచనము. 'చేపలు నీటిలోనీదునట్లు, పక్షి వాయువులో నెగురు నటుల నీ యాలింగన విముఖులము కాము. మేము శ్వాసించిన, నీవు కనుగొనుదువు' దీనిని డా॥ గోమానిస్ అత్యంత సుస్వరాన్విత మనినారు అనాదనాపునుండి మధుర సంగీత ధ్వనిపుట్టును. ఈ సంబంధము గంధ ధూపమువంటిదని, స్వర్గఛందస్సులోని భావ సౌందర్యము వంటిదని రవీంద్రుడు పలికినాడు.

శంకరుని అద్వైతవాదమునకు, సూఫీవాదమునకు భేదమిసుమంత మాత్రముకలదు. అద్వైతమందు ఏకత్వము—అనగా అనైక్యమునందు ఐక్యము సంపాద్యమానమగును. కాని సూఫీవాదమునందు 'ఐక్యము' ఉండును. ఇట్టిఐక్యము ఆత్మపరమాత్మలందు కలుగుటకు కొన్ని మజిలీలను దాటవలసియుండును. ఇంతవరకు రహస్యవాదమునుగూడ సూఫీమతము స్వీకరించినది. (డాక్టరు రామకుమారవర్మ).

సూఫీ ప్రతీకలు అవినీతికి దారితీసినవి. లౌకిక శృంగారము శృతిమించినది. నైతికపతనమొందు సమాజమునం దిట్టి విచిత్రములు తప్పకకల్గును. కాని రానడే చెప్పినట్లు ఈరహస్యవాదము వ్యక్తిగత సంస్కారమునకు, అనంత సంసిద్ధిని సామాజికదృష్టి నవలంబించుటకు తోడ్పడుచున్నది. ఈ యనంత రహస్యమును కనుగొనిన మానవుడు మానవత్వమును చంపుటకు ప్రయత్నింపడు. విశ్వశాంతి కిట్టితత్వములు తోడ్పడక మానవు.

# అనుభూతి

## శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

తీరా యింటికి వెళ్ళేటప్పటికి తలుపు తాళం వేసి వుంది. అంతవరకు రవి వూళ్ళోనే వున్నాడనే మధు అనుకోవటం.

క్రిందటిసారి కనిపించినప్పుడుమాత్రం నూతనంగా అన్నమాటవుతే నిజమేకాని, అప్పటికప్పుడే వెళ్ళిపోతాడనిమాత్రం మధు అనుకోలేదు. అన్నంత పని చేసితీరాడు. గట్టిపిండం. రవి అన్నమాటలకు పూర్తి అర్థం యిప్పటికి మధుకు తెలిసినట్లయింది. ఆలోచిస్తూవుండగానే మధు కళ్ళు చెమ్మగిలినాయి.

రవి యింట్లోనుంచి లేచిపోవలసిన అవసరం యేంకలిగింది? నిజంగా ఆ భార్యాభర్తలమధ్య చిన్న చిన్న పొరపొచ్చాలకు కారణాలు యేమున్నా వున్నాయేమో? అయినా వాటికోసమా తాను యిల్లు వదిలిపెట్టి వెళ్ళిపోయింది. ఏంఘోరమైన బాధ అనుభవిస్తున్నాడని. అతనిభార్య అలాంటిదా కాదే! అలాంటి ఉత్తమురాలికి భర్తఅయ్యే భాగ్యం గలిగితే కలగాలి అని తాను యెన్నిసార్లు అసూయపడ్డాడో రవికేం తెలుసు? శని పట్టుకుపీడిస్తుంటే రవిమాత్రం యేంచెయ్యగలుగుతాడు! యింట్లోనుంచి లేచిపోయాడు. ఊళ్ళపాలయిపోయినాడు ఏంసుఖం అనుభవించనో. ఇంట్లో లేని సుఖం వీధుల్లో యేముంటుంది? ఊళ్ళల్లో యేముంటుంది? నిజంగా యెప్పటికీ వదిలేసి వెళ్ళిపోవటానికేనా భార్యను పుట్టింటికి పంపించింది. పాపం పూర్తిగా అమాయకురాలు. రవి దుర్బుద్ధి ఆమెకు చెప్పెయ్యాల్సింది. ద్రోహం చేశాను. తెలిసికూడా కప్పిపుచ్చాను. మధు బాధపడుతున్నాడు.

స్టేషన్లో సుజాతకళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినప్పుడు మధు చలించిపోయాడు. ఆమె కళ్ళల్లో జాలి, ప్రేమ, అందము అన్నీ మధును విపరీతంగా ఆకర్షించినాయి. రైలు కదలబోతోంది. సుజాత మొహం చూడలేకపోయాడు. మధుహృదయం యెందుకో వెక్కివెక్కి యేడ్చింది. కాని రవి అట్లాగే నిలబడిపోయాడు. మగవాడు, తనభర్త రైలుస్టేషన్లో అంతకంటె యేవిధంగానూ తన మనోవేదన వెళ్ళబుచ్చలేడని సుజాత తృప్తిపడింది. తప్పక రండి అన్న సుజాత మాటలుకూడా రవి నిబ్బరంగానే స్వీకరించాడు. సుజాతకు రవి అంగీకారం అర్థమయినట్లనిపించింది. మధు నమ్మలేదు పూర్తిగా. రవి సుజాతను నమ్మించాడు. సుజాతకు అసలు విషయం తెలుస్తే యేంచేసేదో? ఇంకా వస్తాడు ఇంకా వస్తాడు అని అనుకుంటూ సుజాత తన పుట్టింట్లో రవికోసం యెన్నాళ్ళయెదురుచూస్తూ కూర్చుంటుంది. దుర్మార్గుడు. కఠినహృదయుడు. రాతిమనసు. ఆడదాని మనసు అర్థం చేసుకోలేకపోయాడు. అందులో యేరికోరి చేసుకున్న పెళ్ళి. ప్రేమించిన యువతి—పెద్ద ఘనకార్యం. ఒక పెద్ద ఆశయానికి చాలాదగ్గరగా వెళ్లాడు రవి. తనకూ అలాంటి వివాహం అవుతే బాగుంటుందని వుంది. అయితే మధు అనుకుంటున్న గృహస్థజీవితానికి యీ ఆశయం నెరవేరటానికి యేవిధమైన సంబంధం మధు పెట్టుకోలేదు.

గిర్రున తిరిగి యింటికి వెళ్ళిపోయాడు మధు. కుర్చీలో కూర్చున్నాడు. ఏ పుస్తకం తీసినా, ఏ ఆలోచనల్లోకి పోయినా రవి యిల్లే మాటిమాటికీ జ్ఞాపకం వస్తోంది మధుకు. ఆ యింటికి వెళ్ళినప్పుడల్లా యేదో కీచులాట వినిపిస్తూ వుండేది. దానికి కారణం యెంత వూహించినా మధు తెలుసుకున్నట్లు కనిపించలేదు. చిన్న చిన్న మాటలు కూడా తాను వినకూడదని సుజాత యెంత ప్రయత్నం చేస్తూవుండేదో, మధుకు తెలుస్తున్నప్పుడల్లా, ఆమెమీద, తన హృదయంలో మారుమూలలనుంచి తనకు తెలియకుండానే జాలి, ప్రేమ వచ్చిపడేవి. తాను స్వయంగా ఆమెతో మాట్లాడదామనుకున్నాడు. రవికి యే అభ్యంతరం వుండదని మధుకు తెలుసు. కాని ఏమని మొదలుపెడ

తాడు ? ఏ విషయాన్ని గురించి మాట్లాడుతాడు ? అంతా అయోమయంగా వుండేది మధుకు. రవి బడ బడ యేవేవో అనేశేవాడు. రవికి మధు చనువు, మధు వింటాడనే అభిప్రాయం రవికి యేకోశానా లేదు. వినాలని అంతకంటే లేదు. సుజాతకవుతే మధు కొత్త మనిషే. తన భర్తకు తనకు మధ్య యేవో పొరపులు వున్నాయని మూడోవాడు తెలుసుకోవటం సుజాతకు సుతరాం యిష్టంలేదు. మధుకు చెడ్డకోపం వచ్చేది. ప్రేమించి పెళ్లిచేసుకున్న తర్వాతకూడా భార్యకు భర్తకు భేదాభిప్రాయాలు గాని, తగాదాలు గాని వస్తాయా అని అనుకుని ఆశ్చర్యపోయేవాడు. అలాంటప్పుడు ప్రేమించుకోవటం యెందుకో? మధుకు సమాధానం రాని ప్రశ్న.

కొంతమంది వ్యక్తులు ప్రేమించుకుంటారు. దానికితగ్గ విషయాలు ఆ వ్యక్తుల్లోనే వుండిపోతాయి. ఆ కారణాలు వాళ్లకు తప్ప యింకోళ్లకు కనిపించవు. మూడో వ్యక్తి యెవరైనా, ఆ అమ్మాయి నేనా నువ్వు ప్రేమించిందన్నా, ఆ అబ్బాయి నేనా నువ్వు ప్రేమించిందన్నా చాలా కటువుగా వుంటుంది. ఆ వ్యక్తిని చీల్చి చెండాడా లనిపిస్తుంది. వాడికి ప్రేమంటే యేమిటో తెలీదు. ప్రేమంటే డబ్బు, చదువు, అందమేనా, అంటూ చెడ్డచిరాకు పడిపోతారు. ఒకళ్లనొకళ్లు యెందుకు ప్రేమించుకుంటున్నారో వాళ్లకేనా తెలుసా అని అవతలవాళ్లు అయోమయంలో పడిపోవటంకూడా కద్దు. ఏమైనా రవి సుజాతను ప్రేమించినట్లే సుజాత రవిని ప్రేమించింది. ప్రేమిస్తోంది. అది ప్రేమవివాహం. దీంట్లో రెండు అభిప్రాయాలు లేవు. పెళ్లికి ముందు తనను ఆకర్షించిన గుణాలు సుజాతలో తర్వాత యేమి తగ్గినాయో రవికి తెలియాలి కాని యింకోళ్ళకు అర్థంకావు. సుజాతలో అవుతే మార్పేమీ లేదు. పెళ్లికి ముందు పెళ్ళయిన తర్వాత తాను యెట్లా వుందామనుకుందో అట్లాగే వుంటోంది. రవిలో మార్పు రావటానికి గల కారణాలు సుజాతకూ వివరంగా తెలియలేదు. సమయం చూసి ఒకటి రెండు సార్లు రవిని అడిగింది కూడా. రవి యేమీ సమాధానం యివ్వలేదు. ఏమైనా యింట్లో ఒక్కక్షణం కూడా రవికి సుజాతను పడేదికాదు. రవికి పెళ్లికాకముందు వున్న సూత్రాలు ఏవి కూడా పెళ్లయినతర్వాత తనను బంధించలేకపోయినాయి. మధుకూడా యీ మార్పును గ్రహిస్తూనే వున్నాడు. పెళ్లయిన తర్వాత రవి గొప్పతనం యింకా యెక్కువయినట్లనిపించింది. వ్యక్తిస్వేచ్ఛ, వ్యక్తిత్వం తప్పక గుర్తించ కలడు రవి. కాని అవి తనకుమాత్రమే పరిమితమై వుండాలనే అభిప్రాయం వెలిబుచ్చినట్లు కనిపిస్తోంది. జీవితసహచారిణిని ఆ అర్థానికి తగ్గట్టుగానన్నా చూడాలని సుజాత అభిప్రాయం. తాను బ్రహ్మాండమైన కోరికలు యేమీ కోరుకోనే లేదు. రవివంటి భర్తకు తన కోరికలు యేవిధంగా కనిపిస్తాయో సుజాతకు పూర్తిగా తెలుసు. అసలు అలాంటి కోరికలు ఆమెలో యెన్నడూ రానే లేదు. మగవాళ్ళమీద వున్న ఆమె అభిప్రాయం యెన్నడూ కూడా రవి యెదుట చెప్పనే లేదు. పైగా ఆ దృష్టితో రవిని యెన్నడూ చూడనే లేదు. తన ఆ అభిప్రాయం మార్చుకోవటానికి రవి సహాయపడతాడనికూడా ఆశించింది సుజాత. తాను జన్మంతా దాసిగా వుండటానికి యీ కొంపలోకి రాలేదు. తన స్వేచ్ఛకు రవి అడ్డం వస్తాడని అదివరకు యెప్పుడూకూడా సుజాత వూహించనే లేదు. తన సహనం అంతరించిన యెన్నోరోజులదాకా రవికి ఆ విషయం తెలియనే లేదు. తెలియకూడదనికూడా సుజాత తాపత్రయపడేది. భార్యకాగానే ఆడదానికి వ్యక్తిత్వంపోతుందంటే మధు సహించడు. సుజాతకు ముందుగా యీవిషయం తెలుస్తే ఆమె నిర్ణయం యింకోవిధంగా వుండేది. రవి ప్రపంచంలో ఒక నిరాశావాదిగాను, భ్రష్టుడుగాను, పిచ్చివాడుగాను తయారయిపోయేవాడు. రవిని బ్రతికించింది సుజాత పెళ్లి చేసుకుని. ఆ విశ్వాసమన్నా రవికి లేదు. రవి కోరుకున్నది హాయి, శాంతి, సుఖం. తాను సుజాతను పెళ్ళిచేసుకున్నది దీనికోసమే. తాను యీనాడు యిల్లువిడిచి వెళ్ళిపోయింది దీనికోసమే!

'అనుభవించేవాళ్లకు తెలుస్తుంది. నేను యీ యింట్లో ఒక్కక్షణం వుండలేను. నేను యీ గడప దాటిననాడే నాకు పరిపూర్ణమైన శాంతి, సౌఖ్యమూనూ'. రవి అన్న మాటలు చెవుల్లో గింగురుమన్నాయి. రవి యేంచేస్తున్నాడో, యెక్కడెక్కడ తిరుగుతున్నాడో, యేవిధంగా వుంటున్నాడో మధు వూహించుకుంటున్నాడు. చిరాకు, కోపం రవిమీద యెక్కువయిపోతున్నాయి. ఇంకా రవి విషయం ఆలోచించటం నిరర్థకమనిపించింది. వృథా అయిన జీవితాన్ని గడుపుతూ యే సిద్ధాంతానికీ యే సూత్రానికి కూడా కట్టుబడక నిరామయంగా జీవితం

వెళ్లబుచ్చుతూ బాధ్యతల్ని అతి తేలికగా విస్మరించే వాళ్ళమీద తనకు యేవిధమైన సానుభూతీ వుండకూడ దనుకున్నాడు. అందులో అతి ముఖ్యమైన స్నేహి తుడే అలా అయిపోయాడంటే మరింత బాధగా వుంది మధుకు.

* * * *

రైలుకంటే తీవ్రంగా పోతోంది రవి ఆలోచన. ఎక్కడికి పోయినా యేమీ తెలియటంలేదు. ఇన్నా ళ్లుగా వూళ్లు తిరుగుతున్నా తాను కోరుకున్నది యెక్కడా కనిపించటంలేదు మూడేళ్లు ఒక జీవి తంలో క్షణకాలం అనుకున్నాడు. గమ్యస్థానం చేరు కోబోతున్న రైలులో ధ్యేయం లేని రవికి యెక్కడ దిగాలో అంతుపట్టటంలేదు. టెలిగ్రాఫ్ స్తంభాల్ని దాటేస్తున్నట్టే స్టేషన్లనుకూడా దాటేస్తోంది రైలు. రవి మెదడులో అనేకం మెదులుతున్నాయి. సుజాత కనిపిస్తోంది.

'సుజాతా మనది ఒక ఆదర్శవివాహంగా వుండి పోవాలి. మన వివాహవిషయంలో నాకు సంబంధిం చినంతవరకు యెన్నో అడ్డంకులు వస్తున్నాయని నేను గ్రహిస్తూనేవున్నా. కాలక్రమేణా అన్నీ వాటం తట అవే సర్దుకుపోయినాయి. నీ విషయంలో కూడా అంతే అనుకుంటాను...'

'మీ నిబ్బరమే నిజాన్ని తెలుసుకోగలిగింది. ఏమాత్రం తొందరపాటైనా మీరు నన్ను అపార్థం చేసుకోక తప్పేదికాదు. దానివల్ల మనకు లాభం కంటే నష్టమే యెక్కువ జరిగేదే...'

రవి కనుబొమ్మలు చాలాదగ్గరకు వచ్చేసినాయి. కిటికీలోంచి వక్కసారిగా బైటకు చూశాడు. రయ్ మంటూ గాలి మొహాన కొట్టేసింది.

పెళ్లి మేళాలు రవి చెవుల్లో గింగురుమన్నాయి. ఆనాడు కాలేజీ వాతావరణం అంతా తనయింట్లోకే వచ్చేసింది. శుభాకాంక్షలు, ఆశీస్సులు, టెలి గ్రాములు, వుత్తరాలు, స్వాగతాలు. సుజాతను పెళ్ళి చేసుకున్నావు. ఆమాటలో యెంత తృప్తి, యెంత ఆనందం. తనకళ్లకు కట్టినట్లుంది ఆ దృశ్యమంతా.

రవికళ్ళల్లో నీళ్లు క్షణంలో ఆ దృశ్యాన్నంతా కడిగేసినాయి.

స్టేషనులోనుంచి బైటపడ్డాడు రవి. నాలుగు వేపుల తేరిపార చూశాడు. ఎక్కడాకూడా తాను అనుకున్నట్టే యెరుగున్నవాళ్లెవరూ కనిపించలేదు. ఇంతపట్నంలో యెక్కడోక్కడ యెవరో వకరు తగలకపోతారా అనే భయంమాత్రం రవిని పీడిస్తూనే వుంది. సరిగ్గా టాక్సీ ఆ పెద్దభవనంముందు ఆగింది. మెట్లు యెక్కుతూనే రవి వులిక్కిపడ్డాడు. ఎదు రుగా కొంచెం దూరంగా ఒక ఆడమనిషి వస్తోంది. రవికి వణుకు యెక్కువయింది. తలెత్తి గట్టిగా ఆమె వంక చూడటానికి ధైర్యం చాలలేదు. వెనక్కు తిరిగి వెళ్ళిపోదామనే ప్రయత్నంకూడా ఆ క్షణంలో సాగలేదు. ఆ అమ్మాయి దగ్గరకొస్తున్నకొద్దీ రవి గుండె బరువు యెక్కిపోతోంది. తనకళ్లు గుర్తుపట్టే దగ్గరలోకి ఆమె వచ్చేటప్పటికి ధైర్యంగా మెట్లు యెక్కేసి లోపల గదిలోకి వెళ్లిపోయాడు. ఆ గదంతా పరిశుభ్రంగా వుంది. గోడకు రెండుమూడు ఫోటోలు యేవో వేలాడుతున్నాయి. ఒక ఫోటోవంక చూసే టప్పటికి సుజాత జ్ఞాపకం వచ్చింది. అట్టే ఆ ఫోటో వంక చూస్తూ నిలబడిపోయాడు.

'మీరు మన పెళ్లి అయినతర్వాత చాలావరకు మారిపోయారు. నేనుమాత్రం మీకు తగ్గట్టుగానే మారి పోదామని అనుకోవటం లేదు. ఎప్పటికైనా మీరు మళ్ళీ మొదట వున్నట్లుగానే వుండిపోతారనే విశ్వాసం నాకున్నది....' సుజాత అన్నది.

'అవును నేను మారిపోయినట్లు కనిపించటంలో ఆశ్చర్యం యేమీ లేదు. వివాహం అయిన తర్వాత ఆడది యెట్లా వుండాలో నువ్వు గ్రహించుకున్నట్ల యితే నేను మారిపోయినానని నువ్వు అనుకోవు. నీకా గ్రహింపు లేకపోవటం కూడా నేను మారిపోయినట్లే కనిపిస్తే నేనేం చేస్తాను...' రవి అన్నాడు.

'వాదనకు దిగితే నేను చెప్పలేనుగాని మీరు అదివరకున్నట్లుమాత్రం లేరు అంతవరకు చెప్పగలను. నావల్ల యేదైనా లోపం వుంటే చెప్పండి. సర్దుకుం టాను. అట్లాగే...' సుజాత ఆపేసింది.

'తప్పులు యెంచటం తప్పులు దిద్దటం కాదు నా పని. ఎవరివి వాళ్లే తెలుసుకుని దిద్దుకుంటే, ఇంకోడు చెప్పే అవసరం వుండదు' రవి ఆపేశాడు.

రవి చెడ్డచిరాకుగా లోపలకు వెళ్లి స్నానంచేసి హాయిగా మంచంమీద పడుకుందామనుకున్నాడు. కాని రవికి శాంతి లేదు. ఎంతసేపు ప్రయత్నించినా రవి తన గడిచిన రోజుల్లోకే పోతున్నాడు. ఎంతసేపు

తన మనస్సును మథనచేసి ఆలోచించినా యింటికి వెళ్ళదామనే ఉద్దేశం రావటం లేదు. కొంచెం సేపు తన ఆలోచనలు స్థిరంగా కూడా పోతున్నాయి. కాని సంఘం, సమాజం మాటలు చాలా భయంకరంగా కనిపిస్తున్నాయి. తాను అనుకున్న సిద్ధాంతాలకు యిప్పుడు జరుగుతున్న పనులకు యెక్కడా పొలికలేదు. తాను అనుకున్న పనులన్నింటిలోను సుజాత సహాయంగా వుంటుందని ఆశించాడు. కాని సుజాత కంటకంగా తయారయింది. విచారం, ఆవేశం, కోపం, అన్నీ ఒకదానికంటె వకటి ముందుగా రవిని పీలుస్తూనే వున్నాయి. ఆగ్రహం యెక్కువయిపోతోంది. ఏవేవో తనకు జ్ఞాపకం వస్తూనే వున్నాయి. వాటిని భరించలేక పోతున్నాడు. సమన్వయం అంతకంటె చేసుకోలేక పోతున్నాడు. తాను కోరేది ప్రశాంతవాతావరణం. అది యింట్లో కనిపించక బైటకు వచ్చేశాడు. నీడలాగ తనను అశాంతి వెంటాడుతూనే వుంది. ఎక్కడకు పోయినా తాను తప్పించుకోలేని ఒక బాధమాత్రం వెన్నంటే వుంది. అది పోవటానికి నేనే ప్రయత్నాలు యేవీకూడా రవికి తృప్తిగా ఫలితాన్ని యివ్వలేక పోతున్నాయి.

మంచంమీదనుంచి లేచాడు చివాలున. గది తాళంపెట్టేసి బజార్లోకి వెళ్లాడు. అది సాయం సమయం. ఆ చల్లటి గాలులు శరీరాన్ని గిలిగింతలు పెట్టేస్తాయి. ఎర్రటి గులాబి రేకులు, ఎర్రటి సూర్య కాంతి, ఎదురుగా వున్న ఫౌంటెన్ నీళ్లలో ప్రతిబింబిస్తున్నాయి. ఆ నీళ్ళల్లో ఆ కాంతులన్నీ చిమ్ముకు పోతున్నాయి. పసిపిల్లలు పచ్చికబయళ్లమీద మొగ్గలు వేసుకుంటూ ఆడుకుంటున్నారు. ఎత్తుగా నిలబడ్డ సరివిచెట్ల వరసల్లోంచి రివ్వుమంటూ గాలి వచ్చేస్తోంది. ఆ ఫౌంటెన్ తుంపరలు రవిమీద అప్పుడప్పుడు పడుతూ హృదయాన్ని కలత పెట్టేస్తున్నాయి. ఇద్దరు వచ్చి రవిప్రక్కనే కూర్చున్నారు ఇంకో జట్టు యింకొంచెం యెడంగా వచ్చి కూర్చుంది. ఆ ప్రశాంత వాతావరణం, ఆ కమ్మటి గాలులు, చాలామందిని ఆకర్షిస్తున్నాయి. ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ పకపకలు నకనకలు కానిస్తున్నారు. తమ జీవితాన్ని సాంతం మరిచిపోయి ఆ క్షణంలో. అందరూ స్వర్గసౌఖ్యాల్ని అనుభవిస్తున్నట్లు అనుభూతి పొందుతున్నారు. రవి ఒక్కొక్కడే చూస్తూ ఆ పార్కంతా తిరిగేస్తున్నాడు. తాను యెటు పోతున్నాడో యేమి ఆలోచిస్తున్నాడో తనకేమీ తెలియటంలేదు. ఒక్క క్షణం కూడా పచ్చికమీద కూర్చోలేకపోయాడు. ఆ వాతావరణం చాలా వికృతంగా కనిపించింది రవికి. తన మనస్సు దేనిమీద కూడా లగ్నం కావటంలేదు. బైటకు వచ్చేశాడు తన రూములోకి వెళ్లిపోయి గదియ వేసుకుని దుప్పటికప్పుకుని నిద్రపోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు. నిద్రపట్టేటుందు యేదో మసకాస్తుగా జ్ఞాపకం రావటం మళ్లీ నిద్రాభంగం అవటం యిల్లా రెండు మూడు సార్లయింది ఆ కటికి చీకట్లో రిస్టువాచీలో నాలుగు అంకెలు మాత్రం కనిపించినాయి అటు యిటు త్రిప్పి తిరుగుపడి లైటు వేసి లైటు తీసేశాడు. చిన్న ముల్లు నాలుగుమీదకు వచ్చేస్తోంది. లైటు ఆర్పేసి మంచం గట్టిగా ముసుగు పెట్టుకున్నాడు. బైట ప్రపంచానికి దూరమైపోతున్నాడు. కలతనిద్ర పడుతోంది. ప్రక్కలో మసులుతూనే వున్నాడు

'......పెద్ద బంగళా. చుట్టూ మనిషికంటె ఎత్తైన ప్రహరీగోడ. దొడ్డినిండా పువ్వుల మొక్కలు. వాకిట్లో చెట్లు, తీగెలు, క్రోటన్లు. పున్నమిరాత్రి. మల్లెపందిరికు గజంయెడంలో రెండు మడతమంచాల మీద రవి మధు పడుకుని వున్నారు... ఏవేవో మాట్లాడుకుంటున్నారు. లోపల్నుంచి యేదో చప్పుడు వినిపించింది. మధు మనస్సు ఒక్కసారిగా మలినమై పోయింది. మధు తీవ్రంగా కనిపించాడు ఏదో ఆలోచిస్తున్నట్లు కూడా వున్నాడు. గుర్రు బుస్సుమంటున్నాడు...

...మల్లెమొగ్గల్ని జుట్టులో ముడుచుకుని తెల్లటిచీర నల్లటిజాకెట్టుతో వసంత మెల్లి మెల్లిగా నడుస్తూ వస్తోంది లోపల్నుంచి. రవి కళ్లార్పకుండా చూస్తున్నాడు. మధు నిప్పులు కక్కుతున్నాడు. రవికి ఆశ్చర్యంగా వుంది. వసంత దగ్గరకు వచ్చి మర చెంబుతో నీళ్లు పెట్టి లోపలకు వెళ్ళిపోయింది. రవి కళ్లార్పలేదు. మధు తలకాయ త్రిప్పలేదు. రవి చివాలున ఎడమప్రక్కకు తిరిగాడు. మళ్లీ సంభాషణల్లోకి దిగాడు. రవి హృదయం యెంతో ప్రశాంతంగాను, చల్లగానూ వుంది. గుండెమీద చెయ్యి పెట్టుకుని ఎడమప్రక్కకు తిరిగి పడుకున్నాడు. మధు కస్సుమంటూ వుండటం. రవి జాలిపడుతూ వుండటం.

...హఠాత్తుగా రవి మధుయింటికి వెళ్లాడు. వసంత వక్కర్తే యింట్లో వుంది. రవి హృదయం సంతోషించింది. శరీరం వణికింది. లోపలకు వెళ్లాడు. 'వెళ్లిండు' వసంత సమాధానం యిచ్చింది. రవి అప్పటికే ప్రశ్నలు వేస్తున్నాడు మెల్లి మెల్లిగా వసంత పరిచయస్తునితో చెప్పతగ్గ సమాధానాలే చెపుతోంది. మధు, వసంతల మధ్య భేదాభిప్రాయాలు రవికి యేవిధంగాను అంతుపట్టటం లేదు

ప్రక్కలో మెసులుతున్నాడు రవి మళ్లీ. మొహంలో చిరునవ్వు స్పష్టంగా కనిపిస్తోంది. అటు యిటు పత్తిగిలి మళ్లీ దుప్పటి పూర్తిగా కప్పేసుకున్నాడు

'.........నాకు యింత ఆస్తి వుంది యిన్ని సౌఖ్యాలు అనుభవించినదాన్ని, యీనాడు నేను యిక్కడ దాసిగా వుండటానికి నాకేమాత్రం యిష్టం లేదు. నేను చేసే ప్రతి చిన్నపని కూ నికి మీ నప్పు దల కావాలంటే మాత్రం సాధ్యపడదు...' వసంత గొంతులో యేమాత్రం పిరికితనం కనిపించటం లేదు.

'నీ యిష్టము వచ్చినట్లు యిక్కడ వుండటానికి వీల్లేదు. పెళ్ళయిన తర్వాతకూడా యిట్లా ప్రవర్తిస్తే లోకులు చూసి యేమనుకుంటారో యేమన్నా తెలుసా. మధ్య నేను సిగ్గుతో భయపడి చావాలిసి వస్తుంది...' మధు ప్రాధేయపడుతున్న వాక్యాలు.

'దేనికైనా హద్దు అంటూ వుండాలి. నే నేమి తప్పు చేశానని ప్రతిదానికి మీరు అడ్డు రావటానికి. ప్రొద్దస్తమానం ఆ సరితతో తిరుగుతూవుంటే నే నేమన్నా పట్టించుకున్నానా? మీమాదిరి మనస్సే నాదీ అవుతే యీపాటికి యెంతైనా అయ్యేదే. నా బాధ్యతలు నాకూ తెలుసు. మీరు నలుగుర్లో నన్ను అవమానించినట్లే మిమ్మల్ని యేదైనా యెవరైనా అంటే మీ కెట్లా వుంటుందో ఆలోచించుకున్నారా?...' వసంత తీవ్రంగానే అనేస్తోంది.

'వసంతా ... రాగారాగా నీకు నలుగురిలో నన్ను అవమానం చేద్దామనికూడా వుందా? ...' మధు సమాధానం.

'మీరు యేదైనా అనుకోండి. నా స్వేచ్ఛను, నా గౌరవాన్ని నా పరువును మీరు గౌరవించలేరు. ఎంతసేపటికి మీ గౌరవం, మీపరువు, మీమాటే. అంత నీచంగా భార్యను చూద్దామనుకోవటం...' వసంత ఆక్షేపించింది.

సంభాషణలు తీవ్రం అవుతూనే వున్నాయి. రవి మొహంలో ఒకవిధమైన ఆవేదన కనిపిస్తోంది. మెసలకుండా అట్లాగే పడుకుని వున్నాడు.

'మధూ...' అంటూ గభాలున లేచాడు రవి పక్కమీదనుంచి. ఎదురుగుండా కిటికీ చువ్వల్లోంచి వస్తున్న సూర్యకిరణాలు రవి కళ్ళల్లో పొడిచినాయి. కళ్లు గభాలున మూసేసుకున్నాడు. ప్రక్కకు తిరిగి కళ్లు నలుపుకుంటూ ప్రక్కమీదనుంచి లేచి నిలబడ్డాడు. తానున్నగది జ్ఞాపకం వచ్చింది.

ఈ కలకు అంతరార్థం యేమిటి? మధుకు పెళ్లయిపోయిందన్నమాట. మధు భార్యతో అవినయంగా ప్రవర్తిస్తున్నాడా. మధు అలాంటివాడు కాడే. ఎన్నో ప్రశ్నలు రవిని బాధించటం మొదలు పెట్టినాయి. రవికి యెంతసేపు ఆలోచించినా యేమీ అంతు పట్టటం లేదు. ఆ కల యెప్పటికప్పుడు జ్ఞాపకం వస్తోంది. ఇక అవూళ్లో ఒక్క క్షణంకూడా వుండలేకపోయాడు రవి. వెంటనే బెడ్డింగు సర్దుకుని రైలుస్టేషనువైపుకు ప్రయాణమయి పోయినాడు.

స్టేషన్లో దిగేసి మెల్లిగా కాళ్లీడ్చుకుంటూ బైటకు వచ్చేశాడు రవి. అటు యిటు చూసి నిరామయంగా నుంచోనిపోయాడు. అందరూ యెవరి దారిన వాళ్లు వెళ్లిపోతున్నారు. కొద్ది క్షణాల్లోనే ఆ జనసమ్మర్దం అంతా సద్దుకుపోయింది చివరకు తానొక్కడే నిలబడి వున్నట్లు గ్రహించి గభాలున వులిక్కిపడి చకచక ఒక బండీలో బెడ్డింగు పడేశాడు. తాను యీవిధంగా యెన్నాళ్లు గడపకలుగుతాడు? ఎక్కడికని వెళతాడు? చివరకు యేం చేద్దామనుకుంటున్నాడు? యీ ప్రశ్నలన్ని ఇప్పుడిప్పుడే రవికే యేదోగా అనిపిస్తున్నాయి. తనను వెక్కిరిస్తున్నాయేమో అని కొంచెం భయంగా కూడా వుంది. బండీవాడు యెక్కడ ఆపమంటారు. అంటున్నాడు. రవికి మెలుకువ వచ్చింది. బండీ దిగేసి, బెడ్డింగుతో ఒక హోటలులోకి వెళ్ళబోతున్నాడు. హోటలునుంచి వస్తున్న శేఖర్‌ను చూసి రవి ఆశ్చర్యపోయాడు. శేఖర్ యెంతో సంతోషంతో 'రవీ యెప్పుడు రావటం? యెక్కడనుంచి వస్తున్నావు. ఎక్కడుంటున్నావు. ఒక్క పుత్తరం

ముక్కున్నా ప్రాణాపు కాగు!' ఆప్యాయంగా వూపిరి ఆపకుండా అడిగేస్తున్నాడు శేఖర్.

రవి నిబ్బరంగా సమాధానం కనక యివ్వకపోతే శేఖర్ అనుమానపడతాడని రవికి బాగా తెలుసు. ప్రశ్నలకు సమాధానాలు కొంచెంసేపు ఆలోచించినా శేఖర్‌కు తృప్తిగానే వున్నాయి.

ఈ వూరు చూద్దామని వచ్చాను అని అన్న మాట మాత్రం శేఖర్‌కు అంత తృప్తియివ్వలేకపోయిందే అని రవి కొంచెంగా బాధపడ్డాడు. కాని తప్పనిసరి అయిపోయింది. సరాసరి శేఖర్ యింట్లోకి వెళ్ళారు.

వల్లి కాళ్ళు కడుక్కోవటానికి నీళ్ళు తెచ్చి, తలుపుచాటున పెట్టి, సమిట భుజానికి పూర్తిగా కప్పుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది. శేఖర్ నీళ్ళ చెంబు రవికి అందిచ్చాడు. ఆ చల్లటి నీళ్ళతో కాళ్ళు మొహం కడుక్కునేటప్పటికి అదో విధమైన హాయి నిచ్చింది రవికి. డ్రాయింగు రూములో వేసిన కుర్చీలలో శేఖర్, రవి కూర్చున్నారు. రవి అట్టే శేఖర్ మొహంలోకి చూస్తున్నాడు.

'ఏమిటి అట్లా తీక్షణంగా చూస్తున్నావు నా వంక

'మనం కలుసుకుని రెన్నాళ్ళయింది. అనుకోకుండా యీనాడు యిట్లా కలుసుకోవటం తలుచుకుంటే చాలా ఆశ్చర్యంగా వుంది! అన్నాడు రవి ముక్తసరిగా.

శేఖర్ నవ్వి వూరుకున్నాడు.

లోపలికి తేరిపార చూసి ఇప్పుడే వస్తున్నా అంటూ శేఖర్ యింట్లోకి వెళ్ళి రెండు కప్పుల కాఫీ తీసుకువచ్చి, రవి చేతికి ఒకటి అందిచ్చాడు.

రవి యేమి అడగబోతాడో అని గాబోలు, శేఖరే కల్పించుకుని పంచదార కావాలా అంటూ అతికడనుకున్న ప్రశ్న వేశాడు.

తలతోనే సమాధానం చెప్పేసి, రవి కప్పును ఖాళీ చేశాడు.

మధ్యాహ్నం తీరికగా కుర్చీలో కూర్చుని వున్నారన్న మాటేకాని రవికి మాత్రం తీరని బాధగానే వుంది. వల్లి పల్లెత్తుమాటకూడా మాట్లాడక పోవటం అంతకంతె ఆశ్చర్యంగా వుంది రవికి. సుజాత క్షణంలోకి జ్ఞాపకం వచ్చింది. సుజాతకు వల్లికి చెప్పలేనంత తేడా కనిపిస్తోంది. శేఖర్ కనుసంజ్ఞలో వల్లి పనులన్నీ పూర్తిచేస్తోంది. అంత దాసీగా, శేఖర్ వల్లిని చూడటం ఆ క్షణంలోనే రవికి చాలా వికృతంగా కనిపించింది. ఏదో తనకు బాగా అంటుపట్టని ఆవేశం రవికి ఎక్కువయిపోయింది. శేఖర్‌తో యేదో విషయంలో యీ ప్రస్తావన తీసుకువద్దామనుకున్నాడు. కాని శేఖర్ మాత్రం ఆ ప్రస్తావన వచ్చే వేళకు ఏదో విషయాన్ని గురించి మాట్లాడటం ప్రారంభిస్తున్నాడు.

ఆ సాయంత్రం సినిమాకు వెళ్ళేటప్పుడుకూడా వల్లి విషయాన్ని శేఖర్ యెత్తనేలేదు. రవి మనస్సుకు బాధగా వుంది. పాపం ఒక్కతే యింట్లో కూర్చుని వుంటుంది, మేము యెప్పుడొస్తామా అని యెదురు చూస్తూ. తనమూలానే వల్లి బాధపడుతోందేమో అనే సంకోచంకూడా రవికి వుంది. కాని తానేమీ చెయ్యలేకపోతున్నాడు. ఒక్క నిట్టూర్పు విడిచి వూరుకున్నాడు. బైటకు వెళ్ళేటప్పుడు మాత్రం టూకీగా శేఖర్‌ను అడిగాడు.

'రాదులే యింట్లో యేవో పనులుంటాయి' అన్నాడు అతి తేలికగా శేఖర్.

రవికి ఆ జవాబు నచ్చలేదు. ఇంకా అడుగుదామనుకున్నాడు. కాని అవకాశం చిక్కనేలేదు. సినిమాలో కూర్చున్నంతసేపుకూడా రవికి వల్లివిషయమే జ్ఞాపకం వస్తోంది. వల్లినిగూర్చి ఆలోచిస్తున్నాడు. శేఖర్ అప్పుడప్పుడుమాత్రం సినిమాను గురించి యేదో చెప్తూనేవున్నాడు. సరాసరి యింటికి వచ్చేశారు. వల్లి దీపంయెదుట మూసుకుపోతున్న కళ్ళను బలవంతంగా నిలుపుకుంటూ చూస్తూ కూర్చుంది. అడుగులచప్పుడు వినపడగానే చివాలున లేచి నుంచుంది. రవి నిలువునా నీరయిపోయాడు.

శేఖర్ సినిమానుగురించి తాపీగా మాట్లాడే ధోరణిలోకి పోతున్నాడు. రవి వినీ వినకండా 'ఊఁ' కొడుతున్నాడు. స్నేహితుని యింటికి వచ్చి తానే భోజనానికి లెమ్మనటం బాగుండదేమోనని వుక్కిరిబిక్కిరి అయిపోతున్నాడు. తలుపుసందులోంచి వల్లి కునికిపాట్లుపడటం రవికి బాగా కనిపిస్తోంది. నిజాన్ని చెప్పి శేఖర్‌ను లెమ్మనమనే

సాహసం రవిలో లేదు. చెప్పబోయే అబద్ధం శేఖర్ నమ్ముతాడని రవికి విశ్వాసంలేదు. మధ్యరకంగా రిస్టువాచి చూసుకున్నాడు రవి.

'ఎవరైనా స్నేహితునితో సినిమాకు వెళితే పస్నెండవందే లేవను...' అంటూ యేదో ఘనతగా చెప్పుతున్న శేఖర్‌ను చూసేటప్పటికి రవి మనోభావ హెచ్చిపోయింది.

నాకు నిద్రవస్తోంది అనటంకంటె యింక యెక్కువ అనలేకపోయాడు రవి. ఆమాటవల శేఖర్ అప్పటికేనా లేవకలిగాడు.

భిన్నమైన తెల్లవారేలోగా రవి యెన్నో విషయాలు యెన్నోరకాలుగా ఆలోచించుకున్నాడు. కలలో కనపడ్డ వసంతమీద, యిక్కడ వల్లిమీద తనకు యెంతో జాలి సానుభూతి వున్నట్లు రవి అనుభూతి పొందుతున్నాడు. వాళ్ళిద్దరిమధ్య సుజాతకూడా జ్ఞాపకం వస్తూనేవుంది. సుజాతమాట అనుకుంటు న్నప్పుడు రవికి అదివరకు వున్నంత తీవ్రమైన భేదాభిప్రాయం యేమీ కనిపించడంలేదు. పైపెచ్చు సుజాతనుసురించే యెక్కువగా ఆలోచించటం మొదలు పెట్టాడు. కాని యేనిశ్చమైన సమాధానానికి ఒక్కపెట్టున రాలేకపోతున్నాడు రవి.

'కాఫీ తొందరగా కానీమని చెప్పలేదూ...' శేఖర్ గట్టి గొంతుక దగ్గరవున్న రవినే వులిక్కిపడేటు చేసింది.

'తెస్తున్నా అన్న సన్నటి గొంతుక లోపల్నుంచి వచ్చింది.'

నువ్వు చదువుకునేరోజుల్లోకంటె యిప్పుడు చాలా మారిపోయినావు...' రవి మెల్లిగా అన్నాడు.

'వయస్సు వస్తున్నకొద్దీ మనిషి మారిపోడేమిటి? ఇంత చిన్నవిషయానికి యింత గొప్పగా ఆశ్చర్యాన్ని వెళ్లబుచ్చావు...' శేఖర్ నవ్వుతూ అన్నాడు.

'అదికాదులే నీ ప్రవర్తన యింట్లో అదో తమాషాగా వుంది. అందుకని అన్నాను. నువ్వు యీ విధంగా వుంటున్నావంటే నేను నమ్మలేకుండా వున్నాను...' రవి శేఖర్ కళ్లల్లోకి చూశాడు.

'ఇంకో గ్లాసు కావాలా...' శేఖర్ మాటను తప్పించటానికి ప్రయత్నించేశాడు.

'నేను అనుకుంటాలే కావాలసివస్తే...నాకు మాత్రం నీ ప్రవర్తన చాలా బాధగానే వుంది. అంత హీనంగా భార్యను చూడటమనేది వుందే అది మన సంస్కృతికి, మన విజ్ఞానానికే దెబ్బ. అంతకంటె యేం లేదు. ఎవరిమీదనో అధికారము చెలాయిస్తున్నానని అనుకోవటం మన తెలివితక్కువ. మన అజ్ఞానాన్ని బైట పెడుతున్నామన్న మాట ...నా కడుపులో దహించుకుపోతున్నమాటల్ని ఆంతరంగిక స్నేహితుడవు కాబట్టి నీతో చెపుతున్నాను. నువ్వు వేరేవిధంగా యేమీ అనుకోక...' రవి చాలా నిదానంగానే చెప్పాడు శేఖర్‌తో.

శేఖర్ కొద్దిసేపటివాకా మాట్లాడలేదు.

రవి మళ్ళీ ఆ విషయాన్నే తీసుకువచ్చాడు.

శేఖర్ యీసారికూడా యేమి మాట్లాడలేదు.

రవి మళ్లీ ఆ విషయాన్ని తీసుకురాదలచుకో లేదు.

ఆ రాత్రంతా శేఖర్ చెవుల్లో 'మన సంస్కృతికి, మన విజ్ఞానానికే దెబ్బ' అన్న రవిమాటలుమాత్రం గింగురుమంటూనే వున్నాయి. శేఖర్ మెదడును ఆ మాటలు బాగా తొలిచేస్తున్నాయి. నిద్రపట్టటం లేదు. ఈ మాటల్లో యెంతో అర్థంవుందని యెంతో సత్యంవుందని నమ్మటానికి ప్రయత్నించేస్తున్నాడు. ఇలాంటి అభిప్రాయం అదివరకు తనకు తట్టనూలేదు. ఇంకా యెవ్వరూకూడా చెప్పనూలేదు. రవిమీద యెంతోగౌరవం యేర్పడిపోతోంది. వల్లి తన ముందు నిలబడి తనను ఒక మనిషిగానే చూడమని జాలిగా ప్రాధేయపడుతున్నట్లనిపించింది శేఖర్‌కు. తనకళ్లల్లో నీళ్లు గిర్రున తిరిగినాయి తాను చదువుకున్నవి తాను తెలుసుకున్నవి యెన్నోవిషయాలు శేఖర్‌కు గుర్తుకు వస్తున్నాయి. శేఖర్ ప్రక్కమీద ఆ రాత్రంతా మెసులుతూనే వున్నాడు.

రవికికూడా నిద్రపట్టటంలేదు. కలలోవచ్చిన వసంత శేఖర్‌భార్య వల్లి యీ యిద్దరికంటె సుజాత అతి సన్నిహితంగా తనను పలకరిస్తున్నట్లనిపిస్తోంది.

సుజాత అన్నమాటలు, ఆమె విజ్ఞానం, ఆమె ప్రవర్తన, యెంతో వున్నతంగా కనిపిస్తున్నాయి. తన

అజ్ఞానాన్ని అవి వెక్కిరిస్తున్నట్లు బాధపడు తున్నాడు. సుజాత మూర్తిముందు తాను చాలా తక్కువగా కనబడ్డట్లు వూహించుకుంటు న్నాడు. రవి సిగ్గుపడిపోతున్నాడు. ఎప్పుడు సుజాతను చూద్దామా అనే ఆవేశంలో ఆరాత్రి రవి కంటి మీద కునుకురాలేదు.

మర్నాడు ప్రొద్దున బండీకే రవి యింటికి బయలుదేరాడు. శేఖర్ వల్లి యిద్దరూ స్టేషనుకు వచ్చారు. వల్లిదగ్గరకూడా శెలవు తీసుకుని శేఖర్ రైలులో పడ్డాడు.

రైలు దిగగానే మధు హడావిడిగా స్టేషనువైపుకు వస్తున్నట్లు రవి చూశాడు. మధు వెనకాలే ఒక స్త్రీకూడా ఆదుర్దాగా వస్తోంది—మధు తనను చూడకుండా రవి జాగ్రత్త తీసుకున్నాడు. ఆ స్త్రీ యేదో ప్రాధేయపడుతోంది జాలిగా. మధు అతి కోపంగా ముందుకు వచ్చేస్తున్నాడు. ఆ స్త్రీ మెల్లిగా యేదో అన్నది మధుతో.

'అనుభవించేవాళ్లకు తెలుస్తుంది. నేను యీ యింట్లో వక్కక్షణం వుండలేను. నేను ఆ గడప దాటిననాడే నాకు శాంతీ సౌఖ్యమూనూ' మధు నిక్కచ్చిగా చెప్పినమాటలు రవి పూర్తిగా విన్నాడు.

రవిలో ఆవేశం పూర్తిగా ప్రవేశించింది. రవికి పూర్తిగా అర్థమయినట్లనిపించింది. గబగబ మధు దగ్గరకు రవి పరుగెత్తాడు. రవిని చూసి మధు రోషంగా పరుగెత్తాడు. మధును చూసేటంతోనే తన నిశ్చయం యింకా బలపడ్డట్లయింది.

'మధూ ..నువ్వెళ్లొద్దు. నేను చెపుతున్నాను. నామాట విను. నేను తెలుసుకొని వచ్చాను... నువ్వెళ్లొద్దు...' అంటూ గట్టిగా అరిచాడు రవి, రైలు పెట్టెదగ్గరకు పరుగెత్తుతూ.

రైలు పెట్టెలోంచి మధు అన్నమాటల్ని గార్డు విజిల్ యెవ్వర్నీ విననీయలేదు.

# కొండవీటి రెడ్డినృపతులు

శ్రీ కోన వేంకటరాయశర్మ

కొండవీటి దుర్గము గుంటూరుసీమలోనిది. మహా బలాఢ్యమైన దుర్గము. దీని చుట్టుకొలఁత రమారమి ముప్పదిమైళ్లు. ఈ పర్వతాగ్రము దాదాపు రెండువన్నరమైళ్లు ఎత్తుగలది. ఈ పర్వతమున నేఁబది శిఖరములు గలవు. అందు నాల్గు ముఖ్యమైనవి. ఈ నాల్గు శిఖరములకుఁ బశ్చిమ భాగమున మూఁడుమైళ్ల చదరముగల విశాల సమప్రదేశము గలదు. ఈ సమ ప్రదేశమునకును ఆ నాల్గు శిఖరములకును జుట్టును దుర్గ మేర్పడినది.

శత్రు దుర్భేద్యమై, బలిష్ఠమై, యొప్పును ఈ దుర్గము చూపఱుల కత్యాశ్చర్య మొదవించు చుండు ననుట సత్యదూరము గాదు. ప్రతి శిఖరమునకును బురుజు కలదు. అట్టి బురుజులు మొత్తముమీఁద నిఱువది యొకటి కలవు.

ఈ దుర్గమునకుఁ గ్రిందిభాగమునఁ గొండవీఁడు పట్టనము గలదు. ఈ పట్టనము రమారమి నాలుగైదుమైళ్ల వైశాల్యమును ఏఁడు వాడలు గల్గి యున్నట్టు లగపించు చున్నది. కాకతీయాంధ్రచక్రవర్తి కాలమున నిది రాజధానిగాఁ జెజరిల్లియుండుటచే బహుప్రాచీన మైనదని చెప్పకతప్పదు.

తెలుఁగు మన్నీలలో రెడ్డిభూరమణులు బల దర్పములు గలవారు. క్రీ. శ. 1330 దవ సంవత్సర ప్రాంతమున నోరుగల్లులోని కాకతీయాంధ్ర చక్రవర్తులు నామరూపక్రియలు లేకుండఁ బోయినతర్వాత ఈ రెడ్డినృపతులు ప్రాముఖ్యమునకు వచ్చిరి. ఇద్దరారమణులెల్లఱును భాషాపోషకులే!

కాకతీయాంధ్ర చక్రవర్తులలో చివరివాఁడగు ప్రతాప రుద్రావనీశు నొద్దఁ దొల్తఁ గోమటి ప్రోలయ రెడ్డి సేనానిగా నుండి యవల రెడ్డిసామ్రాజ్యము నెలకొలిపి క్రీ. శ. 1820 దవ సంవత్సరమున "అద్దంకి" రాజధానిగాఁ బరిపాలన మొనర్చిన తర్వాత రాజ్యమునకు వచ్చినవాఁడు ప్రోలయ వేమారెడ్డి. ఇతఁడు కొండవీఁడు, ధాన్యవాటి, కొండపల్లి వంటి ప్రదేశములలో నిఱువది నాల్గు దుర్గముల నిర్మించి, శివక్షేత్రములలో మిఁవులఁ బ్రసిద్ధిఁజెందిన శ్రీశైలమందలి పాతాళగంగకు మెట్ల నేర్పాటు సేసినాఁడని "శృంగార దీపికా" వ్యాఖ్యాన ప్రస్తావన శ్లోకములం బట్టి తెలియనగుచున్నది. ప్రోలయవేము నాస్థానమున లొల్ల మహాదేవకవియను సంస్కృత పండితుడు కలియట్టు—

"యః కర్ణాట వసుంధరాధిప
మహాస్థానే సువర్ణాయితో,
యో నిత్యం నికషాయితో నృప
గృహే వేమాఖ్య పృథ్వీశితుః
శ్రీమ ల్లొల్లట భట్ట శిష్య ఇ
తియో లోలాఖ్యయా శ్రూయతే,
శ్రీ శేషాన్వయ శేఖర స్సహి
మహా దేవో విపశ్చి న్మహాన్"

—అను వాక్య మగపత మొనర్చుచున్నది. ఈ మహాదేవభట్టు తెనాలి తాలూకాయందలి 'కొల్లూరు' వాస్తవ్యుఁడు.

ప్రోలయ వేముఁడు బహు ప్రకారంబులఁ బండితులఁ, గవుల, గౌరవించి, సమ్మానించి, యశోరమను జేఁబట్టినవాఁడు. ఒంగోలు తాలూకాలోని "చెవలువాడ" వాస్తవ్యుఁడగు నెఱ్ఱాప్రెగ్గడ మహాకవిని దన యాస్థానమున నిలిపికొని వలయమందలి మణింబలె మెలంగిన యుద్దండుఁడు. ఇతఁడు క్రీ. శ. 1350 వ సంవత్సరము వఱకును బరిపాలించిన తర్వాత ననపోత రెడ్డి రాజ్యమునకు వచ్చి క్రీ. శ. 1356వ సంవత్సరము దాఁకఁ బటునాటోంక్లు పరిపాలించినాఁడు. ఇయ్యన పోతరెడ్డి కాలమున శాసనముల వ్రాయుటలో నిష్ణాతుఁడయిన బాలసరస్వతీ మహోపాధ్యాయుడు అనపోతరెడ్డి యొనరించిన దాన ధర్మముల నతి నిపుణతతో

సంస్కృతభాషలో నభివర్ణించినవాఁడు. అనవోత రెడ్డిని వర్ణించు పట్టున—

"హేమాద్రి దానై ర్ధరణీసురాణాం
మహోచలం హ స్తగతం విహాయ।
య శ్చారు సోపాన పథేన చక్రే
శ్రీ పర్వతం సర్వజన ప్రగమ్యమ్."

—అను వాక్య మగపడుచున్నది. దీనిం బట్టి యనవోతరెడ్డి బ్రాహ్మణులకు లెక్కలేని సువర్ణదానములఁ జేయుచుండె ననియు, నతఁడు నేఁజిక్కిన మహానగరంబును జాఱవిడచె ననియుఁ, శ్రీ పర్వతమునకు సోపానముల నేర్పఱచె ననియుఁ,— దెలియనగుచున్నది.

ఇతని యనంతర మీతని కొమారుఁడు కుమారగిరిరెడ్డి యనువాఁడు అప్రాప్త వ్యవహారదశ (*Minority*)లో నుండుటచే నన వేమారెడ్డికి రాజ్యము సంక్రమించినది ఇ య్యనవేమునే ధర్మవేముఁడని యందురు. ఈ పృథ్వీపని కాలమునఁ ద్రిలోచనాచార్యుఁడను సంస్కృత పండితుఁడు శాసనముల వ్రాయుచుండెడి వాఁడు. ఈ ధర్మవేముఁడు క్రీ. శ. 1383వ సంవత్సరముదాఁకఁ బరిపాలించినాఁడు. ఇతని దర్బారు కొండకు నడిమి భాగమున విశాల సమతల ప్రదేశంబునం గల యొకయున్నత హర్మ్యములో నుండెడివి. దిగువ గజాశ్వశాలలు గలవు. వాని కొను కొనియే యంతఃపుర మందిరములు, ధనాగారములు, పరిచారకుల గృహములు, మంగుకొట్లు, అమర్పఁబడి యుండెను. వీని కన్నిఁటికి మధ్యభాగమున అగాధ జలపూరితంబగు నొక సరస్సు కలదు. ఆ సరస్సున కెడమవైపున నిఱువదిబాఱల దూరమునఁగల బ్రహ్మాండమైన మందిరమే చెఱసాల. రెడ్డినృపతి కొలువుఁ దీర్చినహర్మ్య మీమధ్య భాగమునఁగలదు.

"తన బ్రదుకు భూమి సురలకుఁ
దన బిరుదులు పంట వంశ ధరణీశులకు
న్దన నయము భూమి ప్రజకే
యన వేమన యిచ్చెఁ గీర్తి యల్లికొనంగన్."

—అను "విష్ణు పురాణము"లోని పద్యమును బట్టి యన వేమన కవులపాలిటి కల్పకమని విదితము కాఁగలదు. కవియొక్క వాక్చాతుర్యమునకు మెచ్చి బహుమతులొసంగుటయం దావేశ మతిశయముగాఁ జూపించువా రాంధ్ర నృపతులే! అంగుటను అనవేమ మహీపాలుని మున్ముందుగఁ జెప్పవలయును.

"ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవి నికర సంభృత వాక్య
స్మృతి గోచరాంచ విశంకిత
చతురాంతఃపుర వధూ ప్రసాదవశనికా!"

అను పద్య మీయన రసగ్రహణ పారీణతను దెలుపుచున్నది. ప్రతి సంవత్సరము వసంతోత్సవముల జరపించుటకుఁ గారణమైనది ఈయన రసగ్రహణము. ప్రథమమున వసంతోత్సవము జరపింపవలయునను బుద్ధి యీతనికే కలుగుట ఆంధ్రజాతి తపః ఫలమని వచింతును.

వసంతోత్సవములలో వివిధ ప్రాంతములనుండి యరుగుదెంచిన మనీషులచేఁ గావ్యగానము సలుపఁబడుచుండెడిది. ఈ పాతకజాతి యా సమయమునఁ గావ్యగానముఁ జేయుచుండెను. అనవేమారెడ్డి వసంతోత్సవములఁ జాగించి "వసంతరాయ—కర్పూర వసంతరాయ" బిరుదముల నందకొనియెను భోజన్పాలుని నాఁట "ధారా" నగర మెట్లుండెనో అనవేముని కాలమున సంస్కృతాంధ్ర వల్లగులకుఁ "గొండవీడు" అట్లు ప్రధాన ఆలవాలమైనది. సువర్ణ దాన జలధారా సంసిక్తమైనకవి కృతజ్ఞతా హస్తము య్యాని నన వేమునకొక్క కావ్యమును నిబంధించి యొసంగఁడా? యని తోఁచెడిని. కాలచక్ర పరిభ్రమణమున నేమయ్యెనో ఏమి జరగెనో ఎవరి కెఱుక.

సంగీత సాహిత్య విద్యావినోదియై యనేక విధాల దాన ధర్మములఁ గావించి తనకుఁగల త్యాగ సంశీలతను వేమారెడ్డి యగపఱచినాఁడు. కంచి, పొన్ని, పేరి యను కలావిదుల భరతవిద్యా ప్రాశస్త్యమునకు మెచ్చుకొని 'కంచి' యను నామెకుఁ "గంచికచర్ల" అను గ్రామమును, 'పొన్ని' యను నామెకుఁ "పొన్నవరము"ను, 'పేరి' యను నామెకుఁ "పేరుకలపూఁడి" యను గ్రామమును, నొసంగి తన విద్యాభిలాషను, తదనురక్తిని, ప్రకటించినట్లు "స్థానిక చరిత్ర" వాకొనుచున్నది. ఇతని 'వానపల్లి' శాసనమునుబట్టి యీతని యాస్థానమున నిరంతరము జరుగు కార్యప్రణాళిక అవగతము కాఁగలదు. ఈ శాసనము శా. శ. 1300 నాఁటిది.

# కొండవీటి రెడ్డినృపతులు

ఆనాఁటి గ్రామసభల న్యాయపరిపాలనము మొదలగునవి ఈ శాసనము మెఱుఁగజేయుచున్నది. పరిపాలనా విధానమునకంతకును గ్రామమే ప్రాతిపదికయని యీ శాసనము దెలుపుచున్నది. పల్లెపట్టులే ఆ కాలమున రాజ్యపరిపాలనా విధానమునకు మూలకందమైనవి. ఈ పల్లెలు సర్వస్వతంత్రములుగను, చాలవఱకు స్వయంపోషకములుగను, నుండెడివి. గ్రామపంచాయతీ విధానము తన పూర్వ ప్రాభవ కీర్తులను, సంప్రదాయమును, గోల్పోవక చెక్కు చెదర కుండెను. దేశరక్షణ, విశేషాంగ వ్యవహారములు దప్పఁ దక్కిన ప్రభుత్వ కార్యకలాపమంతయును వికేంద్రీకరణ పద్ధతిని సర్వాధికారములు గల స్థానిక సంస్థలచే జరపఁబడెడిది.

అనవేమారెడ్డి తన పరిపాలనలో నున్న ప్రజలకండఱకును సంతృప్తికరముగా నుత్తమస్థాయిలో బ్రదుకుఁదెరువు జూపుటయే, చూచుటయే, ప్రభుత్వ లక్ష్యముగాఁ, బరమ ప్రాప్యముగాఁ, బెట్టుకొనినట్టు శాసనాద్యాధారము లగపించు చున్నవి.

కౌటిల్యుఁడు చెప్పినట్టు ప్రజల సుఖమే రాజు యొక్క సుఖమనియుఁ, ప్రజల సంతోషమే రాజు యొక్క సంతోషమనియు, భావించి వర్తించుచుఁ దన ప్రజలెవ్వరును దిండిలేక, మందు మ్రాకులు లేక, చదువు సంధ్యలు లేక, చావకూడదను పట్టుదలతో, దీక్షతో, నుండి యుండెను.

పరిపాలనా సౌలభ్యము కొఱకుఁ దన క్రిందనున్న భూభాగమును విషయములుగా, నాడులుగా, విభజించి ముఖ్య విషయములలో వృద్ధుల సలహాలఁ గైకొనుచు, దూరదార్శనిక పరిజ్ఞాతలగు సచివోత్తముల సంప్రదించుచు, వారి యుపజ్ఞ ననుసరించి యేల్బడిఁ జాఁగించుచుండెడివాఁడు అనవేమారెడ్డి.

కృష్ణానదీ పరిరక్షితము, శాత్రవసమీపస్థము, దృఢతమము, నగు "కొండవీటి" కిం దన రాజ్యమును మార్చి నిజపరాక్రమము నలయించి పరిపాలించెనని—

"తస్యో౽న్న వేమ నృపతిః
పరిపాలన కర్మణి,
అపాలయ త్తస్య పుత్త్రః
తదింతేంద్ర వసుంధరాం,
కొండవీడుం రాజధానిం
సచిత్రాం పరికల్పయత్."—

అను పంక్తు లవగాహ మొనర్చుచున్నవి. "ఉప్పుగల్లు" శాసనపంక్తులవలనఁ గొండవీఁడు దుర్గము నే యనవేమారెడ్డి పరిపాలించెనని విదితమగుచుండినను అతఃపూర్వమే కొండవీటనొక దృఢతరమైన దుర్గము గలదనియుఁ, గొన్నాళ్లు చళుక్యరాజ ప్రతినిధియుఁ, గొన్నినాళ్లు కాకతీయాంధ్ర చక్రవర్తుల ప్రతినిధియు, నా దుర్గమును బరిపాలించినట్టు "స్థానిక చరిత్ర" వాకొనుచున్నది.

అనవేమారెడ్డి నాఁటికే "కొండవీటి" దుర్గము శాసనస్థమై యగపడుచుండుటచే ననవేమారెడ్డి కొండవీటి దుర్గమును బునరుద్ధరించినట్టు లూహింపఁదగును.

ప్రోలయ వేముని తమ్ముని కొమరుండగు పెదకోమటి వేమారెడ్డి రాజ్యమునకు వచ్చి సంస్కృతాంధ్ర భాషల రెండును అభివృద్ధి నొందించెను. ఇతఁడు గొప్ప విద్వాంసుఁడు. వీనినే వీరనారాయణుఁడనియు నందురు. ఇతని విద్వత్తునకు, నుపజ్ఞకు, మెచ్చికొని విద్వద్గణములు "సర్వజ్ఞచక్రవర్తి" యని యాతనిఁ బిలుచు చుందురని—

"మాండామణి ర్నృపాణాం
దుర్మద పరిపంథి శిఖరి దంభోళిః,
సర్వజ్ఞ చక్రవర్తీ పెద
కోమటి వేమభూపతి ర్జయతి"—

అను వాక్యము తెలుపుచున్నది. ఇతని యాస్థానమున "గద్య కవిసార్వభౌమ" బిరుదముంగొన్న వామనభట్ట బాణుఁడను గీర్వాణకవియు, దివిజకవివరు గుండియ ల్దిగ్గరనఁగఁ జేజరిల్లిన శ్రీనాథకవిసార్వభౌముఁడును, గలరు.—

పెదకోమటి వేముని కాలమునఁ గల శాసన మొకటి శ్రీనాథమహాకవి విద్యాంగ మహామాత్యుం డనియు, బహుళ గ్రంథకర్తయనియు,— వాకొనుచున్నది. పెదకోమటివేముఁడు రచించిన "శృంగార దీపిక" యను 'నమరుశతక' వ్యాఖ్య దక్షిణాపథమంతను బ్రసిద్ధిఁ గాంచెను. కుమారస్వామి "సాహిత్య చింతామణి" యను నలంకారశాస్త్ర గ్రంథమును రచించెను. హాలుని సప్తశతిపయి నొక వ్యాఖ్యానమును పెదకోమటివేమన రచించె నని—

"హాలః ప్రాకృత సప్తశతీం
గాథా కోటే ర్వ్యధత్త సంప్రతితు
సోయం వేమనృపాలః
తస్యాపి శతక మహర త్సారం."—

అను వాక్యముంబట్టి విదితమగుచున్నది. ఇంతియేకాక ఇతఁడు "సంగీతచింతామణి", "శీరనారాయణచరిత" అను గ్రంథముల రచించినాఁడు. వామనభట్టు పార్వతీపరిణయము, శృంగారభూషణ భాణము, రఘునాథాభ్యుదయము, నలాభ్యుదయము, వేమభూపాలచరిత్ర, శబ్దరత్నాకరము, శబ్దార్థచంద్రిక,—అను గ్రంథముల విరచించినాఁడు.

శ్రీనాథకవిసార్వభౌముని యొరవడియే తదువాతి వారి కొజ్జబంతియైనది. యశస్విలకుఁడు గదా! పెదకోమటి వేమన ముఖ్యమంత్రియైన మామిడిసింగన జ్యౌతిషమున గొప్ప పరిశ్రమ చేసినవాఁడు. కాఁగాఁ, క్రీస్తుశకము 1418 వ సంవత్సరమున "సోమసిద్ధాంతము" అను జ్యోతిషగ్రంథవ్యాఖ్యను రచించి విఖ్యాతుఁడయ్యెను. కోమటివేమన ప్రభుత్వము క్రీ. శ. 1420 వ సంవత్సరముతోఁ దుదముట్టెను. కాఁబట్టి కొండవీటి రెడ్డి మన్నీల సామ్రాజ్యము క్రీ. శ. 1424 వ సంవత్సరముతో నంతమందిన దనవచ్చును. ఈ సామ్రాజ్య ముత్సన్నమైనపిదప శ్రీనాథమహాకవి మాత్రము రాణ్మహేంద్రవరమును జేరికొనినట్టు లగపించుచున్నది.

కొండవీడు రాజధానిగాఁ బ్రాగాంధ్రమును బరిపాలించిన కొమరగిరిరెడ్డి "వసంతరాజు" అని బిరుదమందినట్టు—

"శ్రీకృష్ణేన సమః కుమారగిరి భూ
పాలో నృపాలోత్తమః,
స్వామీ యస్య "వసంతరాజ" బిరుదో
వీరాన్న పోతాత్మజః,"—

అను "శాకుంతలనాటక" పీఠికవాక్యము అవగతమొనర్చుచున్నది. ఇతఁడు కవి, భోగి, త్యాగి యౌట వలనఁ "త్యాగభోగ వసంతరాయఁడు" అను నభియుక్తోక్తి వీనికిఁ గల్గినది.

"సోఽయం వేమవిభుః కుమారగిరిణా
రాజ్ఞా నియుక్తః కృతీ,
నాట్యానాం త్రితయం కృతం కృతధియా
శ్రీకాళిదాసేన యత్,
తస్యోదీర్ణ రసార్ణవస్య రసిక
శ్శాకుంతలాదేస్స్వయం,
వ్యాఖ్యానం కురుతే కుమారగిరి రా
జీయాఖ్య మస్మై హితం.—"

అను శ్లోకము వసంతరాజు "రసార్ణవ సుధాకరము"ను జదువుటయే గాక తన బావచేఁ గూడఁ జదివించెనా యని స్ఫురింపఁజేయుచున్నది. దీనింబట్టి కుమారగిరికి సర్వజ్ఞసింగభూపతి సమకాలికుండని విదితము కాఁగలదు. సింగభూపతి క్రీ. శ. 1383—1400 సంవత్సరముల నడుమ రాజ్యమేలుచుండెను. కుమారగిరిచే గౌరవింపఁబడుట సత్యదూరము గాదు. ఈ కాలముననే హరిహరరాయలు విజయనగరసామ్రాజ్యము నేలుచుండెను. క్రీ. శ. పదునాలవ శతాబ్దారంభమున నోరుగల్లు నేలుచున్న రెండవ ప్రతాపరుద్రుఁడును, ఆ శతాబ్ద మధ్యమున విజయనగరము నేలిన బుక్క నృపతియుఁ, గొండవీఁడును రాజధానిగాఁ బరిపాలించిన కుమారగిరిరెడ్డియు,— సంస్కృతభాషాభిమానులే!

"మునీనాం భరతాదీనాం
భోజాదీనాం చ భూభుజాం,
శాస్త్రాణి సమ్యగాలోచ్య
నాట్యవేదార్థ వేదినామ్;
"ప్రోక్తం వసన్తరాజేన
కుమారగిరి భూభుజా,
నామ్నా వసన్తరాజీయం
నాట్యశాస్త్రం యదుత్తమం;—

అను వాక్యములఁ బట్టి "వసంతరాజీయము" అను నుత్తమ గ్రంథమును కుమారగిరిరెడ్డి రచించినాఁడని తెలియనగుచున్నది.

రాజ్యమున శాంతిభద్రతల నెలకొల్పిన కాటయవేముని బావమఱంది యగు నీ కుమారగిరి తన పరిపాలనాభార మంతయు గాటయవేమునిపయిం బెట్టి వసంతోత్సవముల జరపించుటయందును, భాషాసేవయందును, గాలము గడపెను. కుమారగిరి "త్రిలింగాధీశ్వర" "రత్నసింహాసనాధ్యక్ష" "జగదగోపాలరాయ వేశ్యాభుజంగ" "పల్లనాటిస్వ" "జంబూద్వీపేశ్వర" బిరుదాంకుఁడు. కొపరట్టుకెక్కిని, బాపట్ల భావనారాయణస్వామి దేవదాసియైన వల్లెమునును,—బుట్టిన లకుమాదేవి ఈ భోగసంక్రందనుని ప్రేయసియే! దారపరెడ్డి సేనాని కాన్కగాఁ గుమారగిరికి లకుమాదేవిని సమర్పించెనఁట!

లకుమాదేవి చక్కఁదనాల చుక్క. నాట్యశాస్త్రవిశారద. కుమారగిరి కొల్వుకూటమున మంత్రి

సామంతాది మహాజనుల సమక్షమున లకుమాదేవి సహస్రవిధముల నభినయచాతుర్యము నెఱపుచుండెడిది. అర్థుల కండఱకు వెలకొలఁద ద్రవ్యము నొసంగుచుండెడిది. కావుననే కాఁబోలు కాటయవేమఁడు దన "శాకుంతలవ్యాఖ్య" లో—

"జయతి మహిమా లోకాతీతః
కుమారగిరి ప్రభో,
స్సదసి లకుమాదేవీ యస్య
ప్రియా సదృశీ ప్రియా,
నవ మభినయం నాట్యార్థానాం
తనోతి సహస్రధా,
వితరతి బహూ నర్థా న్నర్థి
ప్రజాయ సహస్రశః."—

అని వ్రాసినాఁడు. లకుమాదేవి క్రీ. శ. 1402 వ సంవత్సరమునఁ దన తలిదండ్రులకుఁ బుణ్యావాప్తికయి "దాక్షారామ" భీమేశ్వరునకు అఖండ దీపదానము చేసినది.

దేవాలయమున 'నందా' దీపమును వెలిఁగించుట పుణ్యాతిపుణ్యములయిన కార్యములలో నొక్కటి యని కవిబ్రహ్మ తిక్కన తన భారతమునఁ దెలిపియున్నాఁడు. అంగతమస్సను నరకము కలదనియు, దక్షిణాయనము పాపకాలమనియు, నందువలన దక్షిణాయన పాపకాలమునుండియు, నంధతమస్సను నరకమునుండియుఁ, దప్పించుకొని తరించుటకు నుత్తరాయనమున జ్యోతిర్దానము సేయుట యత్యుత్తమ కార్యమనియుఁ,—దెలియనగుచున్నది.

ఈ కారణముననే తెలుఁగునాఁట గల శిలాశాసనములఁ బరిశీలించిన దీపదానము లుత్తరాయన పుణ్యకాలమునందె చేయఁబడినట్టు లవగతమయ్యెడిని.

ఈ దృక్పథముతో, ఈ యభిప్రాయముతో, లకుమాదేవి తన తలిదండ్రుల పుణ్యలోకావాప్తి నిమిత్తము అఖండ దీపదానమొసంగి విఖ్యాతిఁ జెందినది.

కుమారగిరి లకుమాదేవితో వసంతోత్సవములలో విహరించుచుండువాఁడఁట! లకుమ తన నృత్యముతో నెల్లఱ ముగ్ధుల నొనర్చుచుండెడిది. కుమారగిరి అనేక జలక్రీడాగారముల నిర్మించి, వసంతోత్సవములలోఁ దన యంతఃపుర స్త్రీలతో నందుఁ గ్రీడించుచుండెడి వాఁడు. ఈ యుత్సవములకుఁ దెలుఁగుదేశపు నాల్గుచెఱఁగులనుండి యనేకు లరుగుఁదెంచి పాల్గొనుచుండిరి. కావుననే కుమారగిరి కాలములో రాజ్యము సందంతయు గజ్జెలక్ష్మి లాస్య మొనర్చిన దనవచ్చును. క్రీడార్థమై కుమారగిరి నిర్మించిన సౌధములలో "గృహరాజసౌధ" మొకటి యని "కొమరగిరి" శాసన పంక్తు లెఱుంగఁజేయుచున్నవి. లకుమాదేవి తన ప్రియుండగు కుమారగిరితో ఈ సౌధమున విహరించిన దనవచ్చును. ఇప్పటికిని గొండవీఁట "గృహరాజదిబ్బ" కలదు.

కుమారగిరిరెడ్డితో మహా సంపదతోఁ దులదూఁగిన లకుమాదేవి ఆతని తర్వాత నున్నయట్టు లగుపడదు. ప్రేయసీ ప్రియు లిర్వురును నొకే పర్యాయము అనంత కాలగర్భమున లీనమయిరేమో! ఆనాఁటి కొండవీఁటి వైభవము—

"పరరాజ్య పరదుర్గ పరవైభవ శ్రీలఁ
గొనకొని విడనాడు కొండవీడు
పరిపంథి రాజన్య బలముల బంధించు
గుఱుతైన యురిత్రాడు కొండవీడు
ముసురు రాజులకును మోహంబుఁ బుట్టించు
కొమరు మించిన వీడు కొండవీడు
చటుల విక్రమ కళా సాహసం బొనరించు
కుటిలారులకు జోదు కొండవీడు
జవన ఘోటక సామంత సరస వీర
భట నటానేక హాటక ప్రకట గంధ
సింధురార్భటీ మోహన శ్రీలఁ దనరు
కూర్మి నమరావతికి జోడు కొండవీడు"

# విభావరి

శ్రీ దిగుమర్తి సీతారామస్వామి

అలసిన ప్రొద్దు గ్రుంక దెసలన్నియుఁ జేర్చెడి సంజగాలుల౯
దెలిసి వహించి క్రమ్ముకొను నీలిమఁ జుక్కలు పుక్కిలించి మ
త్తిలినవి ; యెల్ల ప్రాణులకుఁ దియ్యని మానము తామసీకరో
చ్ఛలితముగా లభించినది ; శాంతికిఁ జీకటి కింత నెయ్యమా ?

అనలీ లోకము వెల్గులెంకయయి హింసాయామ సుర్ జాగ్రతన
వసివాళ్ వాడెడు; చీకటుల్ బలిసి పైపై మబ్బు మేల్కట్ల సు
ప్తి సుఖంబున్ జవిచూచి కోలుకొనినన్ ప్రేమించుటంగాక మా
నస మన్యంబున కుత్సహించునె వసంతస్వప్న పాథేయమై !

తారుణ్యంబును గోలుపోయినది నిద్రాశూన్యమీలోక; మే
దో రవ్వంత కనుల్ మొగుడ్చ వెడగొంతుల్ పిచ్చివై తాళికుల్
ప్రారంభింత్రు ప్రబోధ గానములు - వాగ్వ్యాపార మీనాడు ఘో
షారంగంబుగ మార్చె నీ జగతి నాశ్వాసాంత మేనాటికో?

క్షిప్త మానవతకు వలసినది నిదుర—
అదియు దేవతావరముగఁ బ్రాప్తమైనఁ
గాక ముచికుందయుగ నిద్రగా నహంయు
కాలయవనాంతకృద్ దృష్టిగా వెలుగదు.

మ్రోగెడు కాకిమూకలకు మూగతనంబు ఘటింప నుత్పల
ప్రాగుపనీత సౌరభకరంబిత నీలదుకూలవాచు ను
ద్వేగ కరప్రజాగరిత విశ్వము సుప్తికిఁ దార్పఁ జల్లగా
రాగిలి వచ్చు నీకయి శిరంబును వాల్చి నమింతు యామినీ !

# కలగూరగంప

## శత్రుదమన దేవగిరి దూగామ్ శాసనము

### శ్రీ కట్టి సాంబమూర్తి శాస్త్రి

**1955** మార్చి నెల భారతిలోఁ బ్రకటింపబడిన, పి. భానుమూర్తి గారి వ్యాఖ్యానముతోడి పై శాసనమును దురదృష్టవశమున నేటికిగాని చూడజాల నైతిని. అతి ప్రాచీనమైన ఆ శాసనము ప్రకటింప బడుట సుదావహమైనను వ్యాఖ్యానము బహు ప్రమాదములతో నిండియుండుటచే విమర్శనావసరము సంభవించినది.

**శాసనోపలబ్ధి:**

నరసన్నపేటకు 5 మైళ్లదూరమున "దూగాము"ను గ్రామమున నొక బీడుభూమి దున్నుచుండగా నీ శాసనము బయలుపడినది. ఆ రైతు ప్రొఁతరాగిక్రింద నరసన్నపేట వర్తకున కమ్మగా నేను దానిని చూచి యావర్తకునకు రెట్టింపులాభము (రూ/12) ఇచ్చి కొని కడియము నతికించి, కాల్పించి, ద్రావకములో ముంచి, తోమి, పెక్కువిధముల నుపచరింపగా శాసనము స్ఫుటముగా చదువుట కనువైనది. దానికి నేను ప్రతి వ్రాసికొని వ్యాఖ్యానమువ్రాసి భారతికి బంపుట కుద్యమించునప్పటికి అధిక వ్యయప్రయాసములు కాలముగూడా బట్టినది. అంతలో 54 గత ఆగష్టు మొదటి తేదీని అప్పటి శ్రీకాకులం కలక్టరు శ్రీ, యమ్. పి. కరియప్పగారు మాయూరి కాంపులో నుండి నాకడ మూడు శాసనము లుండుట తెలిసికొని నన్ను పిలిపించుకొని, ఆ శాసనములను శ్రీ. యన్. రమేశన్ గారిచే ఇంగ్లీషు వ్యాఖ్యలతో అక్టోబరు మొదటి తేదీకి ఆంధ్రరాష్ట్రావతరణ వార్షికోత్సవమునాటికి ఆంధ్రదేశీయైతిహాసిక పత్రికలో బ్రకటింపింతుమనియు, ప్రతిబింబములను, మూలశాసనములు నాకు తిరిగి పంపెదమనియు దరువాత తెలుగులో బ్రకటించుకొన వచ్చుననియు వాగ్దానముచేసి తీసికొన్నారు. వారన్న ప్రకార మిప్పటికైన నవి A. H. R. J. లో ప్రకటింపబడిన ట్లగపడలేదు. కాని యీ భారతిలోని శాసనము మాత్రము మా కాశ్చర్యము కలిగించినది. దీని ఉపలబ్ధి ప్రకార మిది ఇల్లు కట్టుచున్నపుడు భూగర్భమునుండి బయల్పడినది కాదు.

**రాజనామము:**

"శత్రుదమను"డనునది బిరుదమును "దేవగిరి" యనునది రాజనామము కాఁదగునని శ్రీ పంతులు గారు నిశ్చయించిరి. ఇది సరికాదు. "దేవగిరి" యనునది శాసన ప్రకటనావసరమున రప్పింపబడి, శాసన విషయము తెలుపబడిన సద్బ్రాహ్మణాదుల నివాస గ్రామములలో నొక గ్రామము. ఆ గ్రామమునకు "దేవాద్రి"యని ప్రసిద్ధనామము. ఇపుడు "దేవాది"గా నున్నది. అత్యంత సమీపమున నున్న "దేవాది" శ్రీ పంతులుగారికి గోచరింపకుండుట విచారింపదగినదే.

**దత్తభూమి:**

శ్రీ పంతులుగారు దత్తభూమి విషయమునగూడ చాల పొరబడినారు. దుహాగ్రామమున రెండుపాళ్లు "శర్వశర్మ"కును, ఒకపాలు "వప్పశర్మకు"ను దాన మిచ్చినాడని వ్రాసినారు. అది సరిగాదు. దానమిచ్చిన గ్రామములు మూడు సమానమయిన ఫలితమిచ్చునవి. వానిలో శర్వశర్మకు రెండు, నొకటి బప్పశర్మకు నిచ్చినట్లు "త్రీణ్యపిగ్రామకాదత్తా" "అత్ర శర్వశర్మణాయ వృత్తిద్వయం, వప్పశర్మణాయ చ వృత్తి రేకా". అను వాక్యమువలన దెలియుచున్నది.

**గ్రామనామములు:**

దత్త గ్రామములను దత్పరిసరగ్రామములను సరిగా గుర్తింపజాలక "దేవాది'కి మాఱుగ "దేవగిరి"ని రాజనామమున కంటగట్టి గోవాటకే గోసమృద్ధమును, వసువాటకే = వసుసమృద్ధమును, కళింగవర్ధమానాగ్రహారే = కళింగదేశమందు వృద్ధిచెందుచున్నది యను నర్థములు వ్రాసిరి. గోవాటక, వసు

వాటక శబ్దములందలి వాటక శబ్దమునకు "సమృద్ధిగల" అను అర్థ మెట్లు వచ్చినది. వాటక, వాటికా శబ్దములు స్థలపర్యాయపదములుగా నున్నవి కావా? విజయ వాటికా, పుష్పవాటికా, ఋషివాటికాదులు లిప్పుడును వ్యవహారమున గలవే. వాని కిట్టి యర్థము పొసగునా?. వాస్తవమున కివియన్నియు గ్రామనామములే. "దేవాదియందు, కళింగమునందు (ఇప్పటికళింగపట్నముగాని, పూర్వపు కళింగనగరముగాని) వర్ధమానాగ్రహారమందు దుహాగ్రామమందు, వసువాటమందు, గోవాటమందుగల పెద్దలను" అని యర్థము.

## దుహాగ్రామము:

దుహాగ్రామము బరంపురముకడ నిప్పుడును గల దని శ్రీ పంతులుగారు చెప్పుచున్నారు. దానికి "దుహా"అను పేరు కలదా? "దుహాగ్రామ"మను పేరు గలదా? పంతులుగారి వ్రాతవలన "దుహా"అనిమాత్రమే నిశ్చితము. అది శాసనమునకు సరిపడదు. శాసనము లభించిన (పెద్ద) దూగామే అప్పటి దుహాగ్రామము. అదియే వ్యవహారమున దూగాముగా పరిణమించినది. పెద్ద, చిన్న దూగాములు రెండు గలవు. ఏదియైనను నప్పటి దుహాగ్రామమగును. లేదా అప్పు డొక్కటిగా నుండి కొంతకాలమునకు రెండుగా విభాగమైన బొంది యుండును. పెద్ద దూగాము చిన్న దూగాములకు నడుమ నున్న భూమియందే శాసనము లభించినది.

## దమనేశ్వరుడు:

దాత యిష్టదైవమగు దమనేశ్వరునికై శ్రీ పంతులుగా రతిమాత్రముగా నన్వేషించియు పట్టలేకపోయిరి. సింగుపురమందలి ఆలయము, శాసనములు పరిశీలించిన కొండపోలి, హాటకేశ్వరులు కనబడిరి. కాని దమనేశ్వరు డగపడలేదు. శాసనకాలమున నుండె నేమోయను నూహతో విరమించిరి.

దమనేశ్వరుడు రాజున కిష్టదైవము. సింహపుర మతని రాజధానీ నగరము. దానియందే యా దేవర యుండవలయునను నియమమేమి కలదు. మహేంద్రాచల శిఖరవాసియగు భగవద్గోకర్ణేశ్వరుడు గాంగ గంగ వంశముల రాజు లెల్లరకు నిష్టదైవమే యైనను, వారిలో నొక్కరి రాజధానియు మహేంద్రాచలమున లేనే లేదుకదా?. అట్లే యితని యిష్టదైవమును రాజధాని యందు లేడు. దత్తగ్రామములలో నొకటియగు దుహాగ్రామమునందే కలడు. దుహాగ్రామము దూగాముగా మారినట్లే దమనేశ్వరుడును జనవ్యవహారమున దానేశ్వరుడుగా పరిణమించినాడు. ఆ దేవర ప్రాచీనాలయము శిథిలముగాగా గ్రొత్తగా నొక తెలుగులభక్తుడు పునర్నిర్మాణము గావించినాడు. దేవుని భోగములకు భూములును పాడులు మొదలగు లక్షణములన్నియు నిప్పటికిని గలవు. ప్రతిగ్రహీతలగు శర్వ, వసుశర్మలు బహుశః ఆ దేవుని యర్చకులై యుందురేమో? ఆకారణముననే వారికి దానమిచ్చియుండవలెను. అది దక్క నితర కారణమేదియు నగపడదు. శ్రీ భానుమూర్తిగారు కారణము కనబడమిచే వేదాధ్యయనమునకై దానమిచ్చినాడని వ్రాసినారు. వేదాధ్యయనమునకై యను మాట శాసనమందెక్కడ నగపడదు. "తైత్తిరీయస బ్రహ్మచారిణే" యను విశేషణమున వారట్లు భ్రమించిరి. ఆ విశేషణము వారికి వంశానుగతమగు నన్వాతను బ్రకటించునే గాని ప్రతిగ్రహణకారణమును సూచింపదనుట సామాన్యులకును తెలియునదే. కనుక దైవారాధకులనుటయు, రాజునకు పరిగ్రాహకులనుటయు గారణములుగా వారికీ గ్రామము లీయబడినదని యూహించుటే సమంజసము.

రెండవది:— "ఆత్మనః పుణ్యాప్యాయన నిమిత్తం" అని కంఠరవమున కారణము చెప్పబడియే యున్నది. దీనివలన దమనేశ్వరుడు నాడు నేడును గూడ గలడు. కొంచెము మార్పునందినాడు. అతడున్న గ్రామము దానవిషయమే. అందే శాసనము లభించినది.

## శత్రుదమనుని కాలము:

శత్రుదమనుడు విజయసింహపురమున నుండి పాలించుకాలము నిర్ణయించుట కాధారములేవియు లేవు. అతిప్రాచీనమయిన లిపి మాత్రమే కొంత సాధనము. అయినను శ్రీ భానుమూర్తిగారీతనిని సముద్రగుప్తునకు ప్రతిభటునిగా "దమన" పదముచే సాధింప జూచిరి. ఇది సాహసమేమోయని తోచుచున్నది. శ్రీ వారు రాజునామము దేవగిరియనియు, శత్రుదమనుడను నది బిరుదమనియు పేర్కొని మరల దమనపదమును నామముగా మార్చజూచుట విరుద్ధము కాదా?. శత్రుదమనుడనునది పేరైన దేవగిరిపదము దానితో నెట్లుదుకుపడును. దేవగిరియే పేరైన శత్రుదమనుడను పదమంతయు బిరుదముగనుగాని, కేవలము "దమన"

పదము గాజాలదుకదా?. రాజు తనబిరుదము తాను చెప్పుకొన్నను దన ప్రత్యర్థి, అందును విజేతయునగు సముద్రగుప్త డట్టితనిని బిరుదముతో బహుమానించునా?, యని సంశయింపవలసియున్నది. ఇంతియ కాక సముద్రగుప్తుని శాసనమున నేరండపల్లి దమనకుడు పేర్కొనబడినాడు. ఇతడో విజయసింహపుర శత్రుదమనుడు. ఏరండపల్లి మహారాష్ట్రము నందలి దని చారిత్రకులు చెప్పుచున్నట్లు శ్రీ భానుమూర్తిగారే వ్రాయుచున్నారు. అయినను ఇప్పటి "ఆమదాలవలస"యే అప్పుడు సంస్కృతీకరింపబడిన ఏరండపల్లిగా పలువురు చారిత్రకులు అంగీకరించినట్లును వ్రాయుచున్నారు. ఇది వింత విషయమే. మొన్న మొన్న తురకల రాజ్యమున "అహమ్మదాలీ"యను తురక సర్దారుపేరున నిర్మింపబడి వ్యవహారమున నించుక మార్పుజెందిన యీ ఆమదాలవలస నాటి యేరండపల్లియే యనుట కిప్పటి యీ చిన్న "దమన" పదము దక్క నితరాధారము లేవియు లేవు. దీనికి ప్రాంతముల నున్న శ్రీకాకులము, సాలెహుండము, సింహపురము, దంతపురపుకోట, మొదలుగు తావులందు ప్రాచీనవస్తు శకలములు కుప్పలు తిప్పలుగా నుండగా నీ యామదాలవలసయం దేదియు లేదు. రైలుస్టేషనునకు సమీపమున నుండి పలుప్రాంతముల రాదారులకు కూడలి యగుటచే, కొలదికాలమునుండి యీ చిన్నపల్లె క్రమాభివృద్ధి నొందుచున్నది. ఇది కేవల మొక కుగ్రామముగా నుండిన దినములు కడచి యెంతో కాలము కాలేదు. ఇది సముద్రగుప్తునికాలమునాటి యొకరాజునకు రాజధానియనుట కెవ్వరికిని మనసొప్పదు. ప్రాచీన వైభవము గలిగి యిపుడు శిథిలములయిన తావులందెల్ల నిప్పుడును ప్రాచీనతాసూచకములగు వస్తువు లగపడుచున్నవే? ఈ యామదాలవలసయం దవియేవి? కావున నిది యది కాజాలదు. ఒకవేళ నిదియే యదియని యంగీకరింతుమన్న మరియొక చిక్కు కలుగుచున్నది. శత్రుదమనుడు తన రాజధాని విజయసింహపురమని సోత్కర్షముగా వర్ణించుచున్నాడు. ఇతరులనేకు లీ విజయసింహపురమును పేర్కొన్నారు. సముద్రగుప్తుడు ప్రసిద్ధ రాజధానియగు దీనిని విడచి యేరండపల్లి నేల పేర్కొనును. దమనుడీత డేయైనను నాతడు సింహపురమువాడే కాని యేరండపల్లివాడు కాడు. సముద్రగుప్తుని శాసనము చదివినవారు "ఈరండపల్లి" యని చదివినారు. అప్పుడా నామ మీ గ్రామమునకు సరిపోదు. మఱియు ఇంకొక చిక్కు. విజయసింహపురము సింగపురమని కొందరును, దంతపురమని కొందరును (భిన్నకాలములందు) చెప్పినారు. ఆ రెండింటిలో నేదియైనను రాజధాని సింహపురము గావచ్చును గాని, ఆ రెండింటికి నడుమ నాతిదూరమునగల యీ చిన్న వలసయు వానితో సమానముగా నాకాలమందే రాజధాని కాగలదా? గిరికొత్తూరు సముద్రగుప్తుడు జయించినది యీ ఆమదాలవలసకు పది, పదునేను క్రోసులదూరమున నే కలదు. ఏకకాలమున దగ్గరదగ్గరగా రెండు మహారాజ్యములు, నిరువురు మహారాజులు నుండుట సంభవమా?. చిన్న చిన్న రాజ్యములు చిన్నరాజులు నందమన్న నిట్టియల్పులను జయించుట సముద్రగుప్తుడొక ఘనవిజయముగా భావించి ప్రకటించుకొనునా?. కావున సముద్రగుప్తుడు కళింగము నేలు గిరికొత్తూరు స్వామిదత్తునొక్కనినే యోడించెను గాని యీ దమనుని కాదు. అతడేరండపల్లి రాజగు వేరొక దమనకుని జయించినవాడు. ఆ యేరండపల్లి చారిత్రకులు చెప్పుచున్నట్లు మహారాష్ట్రమునందలిదే యైయుండును. దీనినిబట్టి పర్యాలోచింపగా సముద్రగుప్తుడు జయించిన యేరండపల్లి దమనకు డీతడు గాడనియు, నాకాలమున నీతడు లేడనియు గాలాంతరమున విజయసింహపురము నేలిన మహారాజనియు నిర్ధారితమగుచున్నది. అయిన నీతడు ప్రాచీనుడుమాత్రము కాకపోడు. ప్రాచీనతామ్రశాసనములు కూర్పబడిన రాగికడియమునందలి దిమ్మపైని వరాహవృషభాంకుశాది చిహ్నములేవియు నగపడవు. కొన్నింటిపైని "త్రిభువనాంకుశ" మొదలగు రాజనామములో బిరుదములోమాత్ర ముండును. ఇతని శాసనముద్రికయందును చిహ్నము లగపడలేదు. అక్షరములేవేని చెక్కబడి అఱిగిపోయినవో లేక చెక్కబడలేదో గాని యది నున్నగామాత్ర మున్నది. ప్రాచీనులు తమ కులగోత్రాదులు చెప్పుకొనక ప్రతిగ్రహీతలప్రశస్తి వర్ణింతురు. ఇతడు నట్లే చేసెను. ప్రాచీనులు శకవర్షములను పేర్కొనక తమ రాజ్యకాలము నే పేర్కొందురు. ఇతడును తన రాజ్యవత్సరములే పేర్కొనెను.

ఇంద్రవర్మయనురాజు 146సం॥ లోను 122 సంలోను రెండు శాసనములిచ్చెను. 91 సంవత్సరములో

గంగమహారాజగు ఇంద్రవర్మ రాజసింహుని శాసన మొక్కటి కానవచ్చుచున్నది. కళింగాధిపతి ఇంద్రవర్మ అచ్యుతాపురశాసనమువలన 87 సం॥న సిద్ధార్థక గ్రామము దానముచేసెను. 91-87 సం॥ ల దాతయొక్కడే. హస్తివర్మ ఉర్లాము శాసనము 80 సం॥ నాటిది. నరసింగపల్లి శాసనము 79 నాటిది. హస్తివర్మ శాసనములను ఇంద్రవర్మ శాసనములను లిఖించిన వాడు వినయచంద్రుడే. ఈ రాజులు పేర్కొన్న కాలము, కేవలము తమ పాలన కాలముగాక వారి వంశము వారి పాలనారంభమునుండి వచ్చునదియని సులభముగా దెలిసికొనవచ్చును. ఇంద్రవర్మ విజయ రాజ్యవత్సరములు — 146-122

| | |
|---|---|
| ఇంద్రవర్మరాజసింహుడు— | 91-87 |
| హస్తివర్మ-ఉర్లాం— | 80 |
| నర్సింగపల్లి— | 79 |
| ఉమావర్మ— | 30 |
| తిర్లింగి శాసనకర్త— | 28 |
| శక్తివర్మ— | 13 |
| శత్రుదమనుడు— | 9 |
| చండవర్మ— | 6 |

పై పట్టిక ననుసరించి విజయరాజ్యవత్సరములలో చండవర్మయే మొదటివాడో లేక రెండవవాడో యైయుండును. అతనికి తరువాతివాడే మన శత్రుదమనుడు. కాబట్టి యితడత్యంత ప్రాచీనుడనుటకు సందియము లేదు. సముద్రగుప్తునిచే జయింపబడిన గాంగేయక హస్తివర్మయు ఉర్లాం నర్సింగపల్లి శాసనముల దాత గాంగేయక హస్తివర్మయు నొక పురుషుడేయను వాదమొకటి కలదు. దానిని ప్రమాణముగా నంగీకరించినవారెవ్వరును లేరు. ఒకవేళ మనమంగీకరించుచో మన "శత్రుదమన దేవగిరి" సముద్రగుప్తునికంటెను 70 ఏండ్లు ప్రాచీనుడే యగును. కాని యీ ఊహాగానమున వాస్తవికాంశములు లేవుకదా?

## ఇతడేవంశమువాడు?:

వేంగీ చాలుక్యలిపిలో శాసనములు లిఖించిన కళింగాధిపతులు హస్తివర్మ, ఇంద్రవర్మాదులు తాము గాంగామలకుల ప్రతిష్ఠాలమని తమ కులము చెప్పుకొన్నారు. వారికి పూర్వులగు చండవర్మాదులు తమ కులములు చెప్పుకొనలేదు. వీరిలిపి, భాషా సంప్రదాయము, బప్పభట్టారకపాదానుధ్యాతత్వము, పితృభక్తిత్వము మొదలగు నంశములు సర్వాత్మనా వేంగీ పాలకులగు శాలంకాయనుల ననుసరించుచున్నవి. ఐనను వీరు కులముల పేర్కొనలేదు. తక్కిన లక్షణములలో శాలంకాయనులలో భేదములేదు. శాలంకాయనులలో గొందఱు దక్షిణ కళింగము నేలియుండుట సుప్రసిద్ధమే. కావున వీరు శాలంకాయనులనుండి చీలిపోయి తొలిసారిగా కళింగమున కొంతభాగ మాక్రమించి పాలించినవారై యుందురు. కాలక్రమమున వీరే గాంగవంశజులలో గలసిపోయి యుందురు. వీరివలననే కళింగమునకు వేంగీలిపి వచ్చుటయు సంభవించినది. శత్రుదమనుడును శాలంకాయనానుషక్తమయిన భట్టారకపాదపరిగ్రహీతత్వవిశేషణము నుపయోగించుకొన్నాడు. ఇతడు భట్టారకునకు బప్ప శబ్దము లేకున్నను ప్రతిగ్రహీత బప్పశర్మ యుండినే యున్నాడు. ఆ బప్పనామేశ్వరశబ్దము లిప్పటికిని ప్రాంతమున నేకులకు నామధేయములుగా వచ్చుచున్నవి. భట్టారకుడన గురువు, పురోహితుడును. ఇన్నయభట్టారకుడు రాజరాజనరేంద్రునకు కులబ్రాహ్మణుడు. బప్పభట్టారకులు శాలంకాయనుల కులగురువులు. ఈ రాజు తన గురుపురోహితులకే దానమిచ్చినాడు. కాబట్టి దక్షిణ కళింగమును బాలించిన శాలంకాయనులలో నితడొక్కడు కావచ్చును.

శ్రీ భావనమూర్తి గారు ఆఖరు పేరాలో "వ్యాకరణదోషములున్నవని సంస్కృత పండితులు చెప్పినను శాసనకర్త అభిప్రాయము సుస్పష్టముగ మన్నది." అని తమకు సంస్కృతభాషాపరిచయ మంతగా లేనట్లు సూచించుచున్నారు. కాని వారు భావమును గూడ సరిగా గ్రహింపలేదని తేలుచున్నది. సముద్రగుప్తుని శాసనము వివరించుచు: "పై శాసనభాగము మిగిలినవారిలో గూడా నలుగురు కళింగరాజులను తెలుపుచున్నది. మహేంద్రుడు, స్వామిదత్తుడు, దమనుడు, కుబేరుడు. ప్రస్తుత శాసనమువలన పిష్టపుర రాజు పేరును

* శాలంకాయనులలో మొదటి నందివర్మకు కుమారుడు, రెండవ నందివర్మ జనకుడునగు నొక చండవర్మ కలడు. పై పట్టికలో నతి ప్రాచీనుడు చండవర్మ కలడు. ఆ యిరువురు నొక్కరే యగుదురేమో పరిశీలింపవలసి యున్నది.

తెలిసికొనుట కుపయోగించును. 'పైష్ఠపురక మహేంద్రగిరి కొత్తూరకస్వామినాథ' అను వాక్యములో మహేంద్రగిరిపై నున్న పిష్ఠపురపురాజనియు చెప్పబడెను. కాని మహేంద్రుడు పిష్ఠపురరాజనియు స్వామిదత్తుడు గిరికొత్తూరులో రాజనియు తలంపబడెను. రెండవవ్యూహాకు కారణములు:— ఆంధ్రదేశములో "కొండగుడి, కొండకంచేరు" అను గ్రామము లుండుటయే. గిరికొత్తూరు లేక కొండకొత్తూరయి యుండవచ్చును. కాని ప్రస్తుత శాసనకర్త శత్రుదమన దేవగిరి యను నిర్ణయమునకు వచ్చిన మహేంద్రగిరియను నామము నాల్గవశతాబ్దిలో వాడుకలో నుండి యుండవచ్చుననియు మహేంద్రగిరి పిష్ఠపురపురాజనియు చెప్పినఅసమంజసము కాదు."అనిరి. పై భావమెంతటి దారుణమైనదో విజ్ఞులూహింతురుగాక! నేటివఱకును సముద్రగుప్తుని శాసనమును చూచిన చారిత్రకు లెల్లరును పిష్ఠపురరాజు మహేంద్రుడనియు, గిరికొత్తూరురాజు స్వామిదత్తుడనియే తలంచి సిద్ధాంతీకరించిరి. శ్రీమూర్తిగారి భావము దానిని ఛిన్నాభిన్నము గావించి మహేంద్రగిరిపై నున్న పిష్ఠపురపురాజు నొకని సృష్టించి సనాతన సిద్ధాంతమును రెండవవ్యూహాగ గణించి ఖండించి వేసినది. తమసిద్ధాంతము "ప్రస్తుత శాసనకర్త శత్రుదమన దేవగిరి యను నిర్ణయమునకు వచ్చిన నే యని యించుక సంశయమును వెలిబుచ్చియు, దేవగిరినామము సాధించి తన్మూలమున మహేంద్రగిరి నిల్పుటకై కొండతొండవము "తెలివాహ" (తేజ్) నదీ తీరమున బౌద్ధజాతక గాథా ప్రసక్తమైన దేవగిరియందు విశేషము గావించినది. కాన దీనిని విజ్ఞులు బాగుగ విమర్శింపవలసియే యున్నది.

శాసనము చదువుటలో రెండవరేకు మొదటి పెడలో రెండవబంతి చివర "మయా గ్రామకొత్మన పున్యాధ్యాయన"అని చదివిరి. దానివలన నే వారు వేదాధ్యయనముకొఱకు దానము గావింపబడినట్లు వ్రాసినారు. ఆ పాఠము తప్పు "పుణ్యాప్యాయననిమిత్త" అను పాఠము బహుపరిశోధనమున నేను నిశ్చయించితిని. "పుణ్యాధ్యాయన" అను పాఠమే సరియగుచో "ఆత్మన" అను శబ్దమునకు శాసనమున సంబంధమే లేకపోవును. తనకుగాని, తన తలిదండ్రులకుగాని పుణ్యయశోభివృద్ధికయియే దాతలందఱు దానము చేయుట సుప్రసిద్ధము. కాని తన వేదాధ్యయనము కొఱకు దానమిచ్చుట యిందుదక్క నెందు నుండదు. అసలే విలక్షణమగు నీ శాసనమునకు శ్రీమూర్తిగారి పాఠము మరింత వైలక్షణ్యము కూర్చినది. శ్రీవారి యిష్టము ననుసరింపవలయునన్న "ఆత్మన పుణ్యాధ్యాపననిమిత్త" అని చదువుచో తనకు వేదగురువులగు వారికి దానమిచ్చినట్లు కొంత మేలుగా నుండును.

చిట్టచివరగల "దూతో వైద్యకృష్ణదత్త" యను వాక్యమును బట్టుకొని దూతయంగీకారము చూపబడినదనియు, ఇదికూడ క్రొత్తవిషయమేయనియు దూత రాజధానియందేల యుండవలయునో తెలియలేదనియు చిన్నవిమర్శ గావించియున్నారు. ఆ వైద్యకృష్ణదత్తుడు ఆజ్ఞప్తియో, లేక లేఖకుడో, లేక గ్రంథసంధాతయో అయియుండును. కాని "దుత"గానో "దూతి"గానో ఉల్లేఖింపబడినాడు. వ్రాతకాడు తాను వ్రాసెడి దేభాషయో తెలియక నే తాను వ్రాసినదానివలన శాసనభావము బోధపడునో పడదో యను నాలోచన లేకయే సర్వవిషయములు నపభ్రష్టములుగా లిఖించినాడు. అయినను ప్రాచీనాక్షరములు రాజ్యకాల నవమవత్సరమును తెలిపినవాడగుట మనకు మిక్కిలి వంద్యుడు. ఈ లేఖామూలమున నాతడును శత్రుదమనునితోపాటుగ నతి ప్రాచీన స్థానమున వెలుంగును.

## ఆంధ్రానువాదము:

శ్రీ. వి. భానుమూర్తిపంతులుగారి వ్యాఖ్యానమున శాసనమున కాంధ్రానువాదము ప్రకటింపబడియుండిన పాఠకుల కుపయోగించెడిది. అది లేనిచో సంస్కృతభాషాపరిచయము లేనివారు సరిగ విషయము గమనింపజాలరు. కావున నాంధ్రానువాద మీక్రింద పొందుపఱచుచున్నాను.

ఓం. విజయసింహపురమునుండి భగవంతుడగు దను నేశ్వరస్వామిపాదములు ధ్యానించువాడు, భట్టారకపాదులచే పరిగ్రహింపబడినవాడునగు మహారాజశ్రీ శత్రుదమనుడు దేవగిరి (దేవాద్రి,* దేవాద్ధి, దేవిడి) యందును కళింగమందును, వర్ధమానాగ్రహారే (బద్దవాని పేటయందు) దుహాగ్రామము (దూగాము) వసువాటకము (బసివాడ)నందు, గోవాటకము (గొట్టి

* పై గ్రామములన్నియు నొకదానికొకటి చేరువనే యున్నవి.

వాడ) నందు నివసించు సద్బ్రాహ్మణులు మొదలగు గ్రామీణులను శరీరాదులందు కుశలము ప్రశ్నించి వ్రాయించుచున్నాడు. నాచే నీ గ్రామములు నాకు పుణ్యాహ్యాయన నిమిత్తముగ బ్రాహ్మణులు పట్టువ గ్రామవాస్తవ్యుడు, కౌండిన్యసగోత్రుడు, తైత్తిరీయ శాఖాధ్యాయి, యజ్ఞశర్మ పుత్రుడు, బప్పశర్మకును, శర్వశర్మకును మూడు గ్రామములు ఈయబడినవి. వీరిరువురకును బ్రాహ్మణదేయముగానొనర్చి ద్విజభోగము విడువబడినది. ఈ విషయము మీరాలించి నాయాజ్ఞ పాలింపుడు. వీనిలో శర్వశర్మకు రెండు వృత్తు(గ్రామము)లు. బప్పశర్మ కొకవృత్తి. (గ్రామము.) పైన పేర్కొనబడిన గ్రామీణులెల్లరును పుణ్యమునకై నా ధర్మమును పాలింపుడు. ఈ విషయమున శ్లోకములు గలవు. ఎవడు ధర్మసంయుక్తమగు క్రియను మనస్సుచే నభినందించునో వాడు శుక్లపక్షమున నంసుమంతుడు (చంద్రుడు)వలె కొమముల నంది వృద్ధి నొందును. అనేక రాజులచే ననేకముగ భూమిదానము చేయబడినది. అయిన నెవ్వ డెప్పుడు రాజ్యము పాలించునో, అప్పుడా పాలకునకే భూదానఫలము లభించును. మతిమంతులలో శ్రేష్ఠుడవగు యుధిష్ఠిర! పూర్వరాజులచే బ్రాహ్మణులకీయబడిన భూమిని మిక్కిలిప్రయత్నమున రక్షింపుము. తాను స్వయముగ నిచ్చుటకంటె నితరు లిచ్చినదానిని రక్షించుటే శ్రేయస్కరము. భూమి నిచ్చువాడరువది వేలయేండ్లు స్వర్గసౌఖ్యము లందును. ఆక్షేపించినవాడు, నపహరించినవాడును నంతకాలమే నరకమున వశించును. ఇట్లు లిఖింపబడినది తొమ్మిదవసంవత్సరమున ఆషాఢ మాసము దశమదివసమందు. దూతుడు (లేఖకుడో, ఆజ్ఞాకరుడో) వైద్యకృష్ణదత్తుడు.

# కోమటి శబ్ద మీమాంస

## శ్రీ జి. టి. అక్కులయ్య దీక్షితులు

భారతదేశమంతటను కైగారిక, వాణిజ్య, యుద్యోగ వృత్తిగల కులములందు ఆయా వ్యక్తి నాముముల చివరలో 'సెట్టి' అను పదమును చేర్చి వ్యవహరించుచుండుట గలదు. ఈమధ్య 'భారతి' పత్రిక 1955 మార్చి, ఏప్రెల్, జూన్ సంచికలలో 'కోమటి' శబ్దమనుసరించిన విమర్శనలలో కోమట్లకు సెట్టి యను పేరు గలదనియు దానినుండి కోమటి శబ్దమునకు యువరాజను అర్థము సూచింపుట, గాదనుట జరిగినవి.

### సెట్టి శబ్దార్థ మేమి?

సంస్కృత శబ్దమగు 'శ్రేష్ఠి' శబ్దముయొక్క ప్రాకృతరూపము 'సేఠ్' అనియు, దాని వికృత రూపము 'సెట్టి' అయినదని చి॥ వీరభద్రరావుగారు తెలిపినారు (ఆంధ్రుల చరిత్ర 1 భా 184 పే). ఈ శబ్దమునే తమిళనాడులో 'చెట్టియార్' అని వాడుచున్నారు. వీనినుండి శ్రేష్ఠి, సేఠ్, శెట్టి, సెట్టి, చెట్టి అనునవి ఏకపదమునకు పర్యాయపదము లనుట తెలియుచున్నది.

ఇప్పటికి షుమారు 3000 ఏండ్లనాడు రచింపబడినదని నిర్ణయింపబడిన (హిందూదేశ కథాసంగ్రహము 137 పే), 'ఐతరేయబ్రాహ్మణము' అను గ్రంథమున 'యూథాంశ్రేష్ఠి' అను పేరున్నది(ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము 2 సం—600 పే). 'సాధుసెట్లు' అని పిల్వబడువారే సాతవాహనుల వంశీయులనుటయు (భారతి 1954 నవంబర్ సంచిక), సాతవాహనులకు శాతకర్ణులనియు, శాలివాహనులనియు ఇతర పేర్లుండినవి. శాతకర్ణి అనునది 'చుటు' సంతతికి చేరిన వంశనామమై యుండినది...క్రీ॥ శ॥ 150 ప్రాంతమున 'చుటుకుల' శాతవాహనులుండిరని శాసనములవలన తెలియుచున్నది (కన్నడనాడిన చరిత్రె 1 భా 18—20 పే). చుటు శబ్దము చెట్టి శబ్దమునకు చాల సన్నిహితమై యుండుటే గాక సాతవాహనులే సాధుసెట్లనుటయు, సెట్టినామము గలవారి జాతులకు కులములు అను పేరుండుటయు 'చుటుకుల' 'సెట్టికుల' నామ రూపాంతరమనియే దలంపవలసియున్నది. వీనినుండి 2000 ఏండ్లనాడును, గౌతమ బుద్ధుని శిష్యులలో 'అనంతపిండసెట్టి' అను వాడుండుటయు చుల్లకవగ్గము (*I VOL* 4—1), ఖదిరంగార జాతకము(1—23), అద్దాన జాతకము, ఫలజాతకము లనెడి బౌద్ధవాఙ్మయ గ్రంథములలో 'సెట్టి' అనువారిని దెల్పియుండుటయు, బుద్ధుని కాలమగు ఇప్పటికి 2500 ఏండ్లనాడును, క్రీ॥ శ॥ 1065 (*EP.IND.VOL. IX P* 174—181), క్రీ॥ శ॥ 1094 (*Mysore Inscriptions*), క్రీ॥శ॥ 1154 (ఆం.చ 1 భా 320 పే),

క్రీ॥ శ॥ 1260 (*EP.IND-VOL XXI. P.*9 16), క్రీ॥ శ॥ 1308, క్రీ॥ శ॥ 15 శతాబ్దము (చౌడేశ్వరీ పురాణము, క్రీ॥ శ॥ 15 శతాబ్దపు శ్రీనాథకవి 'శివరాత్రి మాహాత్మ్యము, హరవిలాసము, రచనాకాలము దెలియనట్టి గౌరీపుత్ర పురాణము, బలిజవంశ పురాణము, కన్యకాపరమేశ్వరీ పురాణము, రేణుక విజయము, నిరంజన రత్నాకరము మొదలగు గ్రంథములందు శాసనములందు 'సెట్టి' అను పేరు చెప్పబడినది. నేటి లోకవ్యవహారమందును గలదు గనుక 'సెట్టి' (శ్రేష్ఠి)అను శబ్దము భారతభూమియందు అంతటను అతి ప్రాచీనకాలమునుండి నేటివరకు అవిచ్ఛిన్నముగా వచ్చు పేరైయున్నది.

కోమటి, బేరి, వీరబణిజ, బణిజ, బలిజ, నాటుకోట, కుమ్మర, సాలె, గాండ్ల, ఉప్పర, జనుప, తొగట, వడ్డె, మంగల మొదలగు కులముల(జాతుల) వారిలో సెట్టి అను పేరు వాడబడుచున్నది (సకలార్థ సాగరము 266 పే). ఉత్తర భారతమున మార్వాడి, ముస్లిం మొదలగువారిలో 'సేఠ్' అనియు తమిళనాడులో శెట్టియార్ యనియు వ్యవహరింపబడుచున్నది.

అమరుడు తెల్పుటలో సెట్టి 'శ్రేష్ఠి' శబ్దమునకు 'కుల'యను మరియొకవిశేషణమును చేర్చి 'కులశ్రేష్ఠి' అనినాడు (అమర నిఘంటువు). ఈ శబ్దమునకు లింగబట్టు 'కులశ్రేష్ఠత్వమస్యేతి కులశ్రేష్ఠి' కులమందు శ్రేష్ఠత్వము గలవాడు అని నిర్వచించినాడు (గురుబాల ప్రబోధిక 2 కాం 691 శ్లో). ఒక కులమున ఒకడు శ్రేష్ఠుడై యుండవలసినంతట శ్రేష్ఠాధమ భావము లుండవలయును. ఏ కులమందును అట్టి భావన లేదు. మరియు శ్రేష్ఠాధములే యుండినంతట యే యొక రిద్దరికో శ్రేష్ఠి యను పేరు పరిమితమై యుండవలసినది. అటులను లేదు సెట్టిపద ముపయోగించు కులములో ప్రతివాడును సెట్టి అనబడుచున్నాడు గనుక కులశ్రేష్ఠి శబ్దమందలి 'కుల'శబ్దము జాతిని గాక మరి దేనినో దెల్పు శబ్దమగుచున్నది. కులమనగా ఏమి?

ఇప్పటికి 2500 ఏండ్లనాడు రచింపబడినదని కాలనిర్ణయ మొనర్చినట్టి (13-11-1944 ఆంధ్రప్రభ) 'మనుస్మృతి' అను గ్రంథమున "దశకులంతు భుంజీత" (7 అధ్యా 119 శ్లో) అను శ్లోకమునకు వ్యాఖ్యానము వ్రాసిన కుల్లూకభట్టు "అష్టాంగవం......"ఇతి హారీత స్మరణాత్ షడ్గవం మధ్యమం హలమితి తథాచిన హలత్వేనేన గోయువక్ భూమిః వ్యాఖ్యాతే తత్కులమితి వదతి". పండ్రెండు నాగళ్ల(మడకల)తో నొక దినమున నెంత భూమిని దున్నగల్గుదురో ఆ భూవిస్తీర్ణమునకు 'కులము' అను పేరున్నట్టు దెల్పినాడు. ఇప్పుడు భూమియొక్క విస్తీర్ణము తెలుపుటకు సెంటు, ఎకరా అను పేరులవలె మిగుల ప్రాచీనకాలమందు 'కులము' అను పేరుండినదని తెలియుచున్నది. ఇప్పటికిని యొక పట్టాకు చేరిన భూమికి 'కుళ' మనియు, వీటిని దెల్పు ప్రభుత్వపు లెక్కలకు 'కుళవారి' అను పేరును గల్గియుండుట కుల్లూకభట్టు వ్యాఖ్యానమును దృఢపరచుచున్నది. దీనినుండి కులస్థుడు = వ్యవసాయ యోగ్యమగు భూమి గలవాడు కులశ్రేష్ఠి = ఉత్తమమైన భూమి గలవాడు. అను అర్థము గలుగుచున్నది. కులశబ్దము అటులనే యుండక వ్యవసాయవృత్తిని దెల్పు శబ్దమైనది. క్రమశః ప్రతి వృత్తిని దెల్పు శబ్దముగా పరిణమించినది (ఉదాహరణము. కుమ్మరకులం = కుండలనుచేయు వృత్తి మొదలగునవి) ఈవిధముగ కులశబ్దమునకు వృత్తి అర్థముండుటచే "కులశ్రేష్ఠి" వృత్తులలో ఉత్తమమైన వృత్తి నాచరించువాడని ఏర్పడును. ఇట్లేర్పడుటకు కారణమును యున్నది. "సోషియల్ అండ్ పొలిటికల్ లైఫ్ ఇన్ విజయనగర" అను గ్రంథమును రచించిన డా॥ బి. ఏ. సాలెతొరె. యం. ఏ. పి. హెచ్. డి. డి. ఎవి. యెల్. గారు తెల్పుటలో "ఈ కులములను రెండు ప్రముఖ విభాగములుగా విడదీసి వాటి ఉచ్ఛనీచతలను సూచించెడి 'కుడిచై', 'యెడమచై' యనెడు భేదములు బహుకాలమునుండి వచ్చుచున్నవి. షుమారు క్రీ॥ శ॥ 5 శతాబ్దమునందు ఈ భేదములు పొడచూపిన" వని వ్రాసినారు (11. P. 698). ఇట్లేర్పడిన కుడిచై సంఘము(సెట్టిపణము)న 18 కులములు గూడియున్నవి. ఈ కులములవారు చేయు వృత్తులు ఉత్తమమైనవగుటచే ఈ కులములవారికి సెట్టి(శ్రేష్ఠి) అను పేరు వాడబడినదని ఏర్పడుచున్నది.

కన్నడనాడిన చరిత్రకారులగు దేశాయి, పాండురంగరాయ ఎం. ఏ. గారు దెలుపుటలో "ఈ సంఘోప సంఘములకు విశిష్ట ఘటనలు ధ్వజ పతాక ఛత్ర చామరాది సాంకేతిక చిహ్నములు ఏర్పడియుండినవి. అచ్చటచ్చట ఈ సంఘమునకు స్థళీయాధికారు

లుండిరి... ఈ పదవులన్నిటికి గొప్పపదవికి 'పృథ్వి శ్రేష్ఠి' అనిపేరు......" అని వ్రాసినారు (కన్నడ నాడిన చరిత్రె 146 పే).

ఇందునుండి ఉత్తమ కైగారిక వృత్తులకే గాక ఉత్తమ ఉద్యోగవృత్తికి గూడా 'సెట్టి' అను పదము పయోగించియుండుట తెలియుచున్నది. అందు నుండియే పేటపై అధికారముగలవాడికి 'పేటసెట్టి' యనియు ఇటులనె సంతసెట్టి, గ్రామసెట్టి, పట్టణ సెట్టి, చివరకు 'పృథ్వీసెట్టి' అను పేర్లు గలిగియున్నవి. మహాశిల్పుల (కైగారిక వృత్తులు గలవారల)లో 'పృథ్వి' అనువాడుండినట్లు ఋగ్వేదమున గలదు (9-5.6; 10-70 6). జనమంతటికి యొక సెట్టి గలిగియుండలేదు. ఇక పృథ్వీసెట్టి అను పేరు వచ్చుటకు ఋగ్వేదమందలి మహాశిల్పియగు 'పృథ్వి' అను పేరు నుండియె పృథ్వీసెట్టి అను పేరు గల్గియుండును గనుక పృథ్వీసెట్టిగా వ్యవహరించుటయు మిగుల ప్రాచీనముగా ఏర్పడుచున్నది.

ఈవిధమైన ఆధారములు విశేషముగ లభ్యమగుచుండుటవలన 'సెట్టి' అను శబ్దమునకు 'ఉత్తమమైన వృత్తిగలవాడు' అను అర్థము సరియగుచున్నది. నిఘంటు రచయితలు ఇంకను తర్కించి సెట్టి శబ్దమునకు అర్థమును నెఱింగి నూతనముగా ముద్రించు కోశములలో జేర్తురని ఆసించుచున్నాడ.

## శ్రీ జటావల్లభుల పురుషోత్తము

గోవుయొక్క మతివంటి మతి కలవారు గోమతులు—(గోః మతిరివ మతిః యేషాం తే గోమతయః) గోమతి శబ్దభవము "కోమటి." గోవులకును వైశ్యులకును సామ్యము వేదములలో కూడ కన్పట్టుచున్నది. బ్రాహ్మణునితో బాటు మేక సృజింపబడెననియు, క్షత్రియునితో బాటు పొట్టేలు సృజింపబడెననియు, వైశ్యునితో బాటు గోవు సృజింపబడెననియు, శూద్రునితో బాటు అశ్వము సృజింపబడెననియు సాజాత్యముగల మనుష్యులకును జంతువులకును గుణసామ్యము కలదనియు తైత్తిరీయ సంహితలో చెప్పబడినది.

వైశ్యో మనుష్యాణాం గావః పశూనాం
(తై. సం. 7-1-1)

కృషి గోరక్ష వాణిజ్యములచేత వైశ్యుడును, క్షీరప్రదానముచేత గోవును లోకమున కాహార మొసగుటచే సామ్యము కూడ నుభయులకు సమానము. కోమట్ల సాధుత్వము అనాదినుండియు ప్రసిద్ధము. కావుననే కోమట్లు "సాధువు"లని వ్యవహరింపబడుచుండిరి. "సాహుకారు"లోని "సాహు" శబ్దము సాధు శబ్దభవమే. ఈరీతిగా కోమట్ల గోమతిత్వము సర్వాంగీకృతము.

# గ్రంథ విమర్శనము

## ఓరుగల్లు

పద్యరచన: రచయిత: శ్రీ పెమ్మరాజు వేణు గోపాలకృష్ణమూర్తిగారు. కళాకుటీరం. తిరువూరు; వెల 1-0-0

శ్రీ. శ్రీ. కొడాలి సుబ్బారావుగారి 'హంపీ క్షేత్రం'తో తులతూగగల వీర రసాత్మకమైన రచన. ఈ గ్రంథానికి పరిచయ వాక్యాలు వ్రాస్తూ శ్రీ కుమారరాఘవశాస్త్రిగారు ఇలా అన్నారు:

'హంపీక్షేత్రము చూచినా, ఓరుగల్లు చూచినా, హృదయం చరిత్ర లోతుల్లోకి చొచ్చుకొనిపోయి ఆంధ్రయువకుడు తన పూర్వపు ఔన్నత్యాన్ని, పరరాజులకు గుండె బెదురుపుట్టించిన తన పరాక్రమాన్ని పరదేశాలకు వెలుగునిచ్చిన తన విజ్ఞానాన్ని, సర్వాంగ శోభితమైన తన భాషా సరస్వతిని సందర్శించి హర్ష పులకితుడౌతాడు. క్రమశః ఆనాటి తేజః పుంజము కొవటానికి హేతుభూతము లైన పరిస్థితులను స్మరించి పరితపిస్తాడు. ఈ భావ శబలత కవికి తీవ్రంగా వుంటుంది. తన అనుభూతిని రసోచితంగా ప్రపంచానికి తిరిగి వినిపిస్తాడు. అంతే కాదు ఒక మెట్టు పైకి పోయి భవిష్యదభ్యుదయానికి తోటి వాని హృదయం సముచితములైన మార్గాల్ని అన్వేషించేటట్టు తగినంత ప్రబోధం చేస్తాడు. నిద్రాణములైన అంతశ్శక్తులకు మేలుకొలుపులు గానం చేస్తాడు. ఈ దృష్ట్యా శ్రీ కృష్ణమూర్తిగారిని ఓరుగల్లు వైతాళికులనాలి.

కళాకుశలులైన వీరి లేఖినిలో ఓరుగల్లు చరిత్ర సృష్టి స్థితిలయాత్మకమైన ఒక విశ్వకావ్యంలా రూపొందింది.'

పై వాక్యాలలో అతిశయోక్తి యేమాత్రమూ లేదు. శ్రీ గోపాలకృష్ణమూర్తిగారు ఈ కావ్యాన్ని అంత శక్తివంతంగానూ సంఘటించారు. తిక్కన సోమయాజి గణపతిదేవుని సందర్శించిన ఘట్టంలో ఒకటిరెండు పద్యాలను చవిచూదాం:

హనుమకొండను స్వర్ణ సింహాసనమున
నిండు పేరోలగంబుండె నిఖిల శత్రు
కంఠలుంఠన సమవర్తి కాకతీయ
సాంద్ర గుణకీర్తి గణపతి చక్రవర్తి

* * * *

శుష్క దేహంబుపై శుభ్ర తేజస్సులు
క్రేల్లుసూపుచు పరవళ్లు ద్రొక్క
ఆకర్ణముల్ ప్రాకి అతిశయితంబులౌ
నేత్రాల నైశిత్య నియతి వెలుగ
వల్లెవాటుగనున్న పచ్చడపున్ రుచి
అరుణ మరీచి నయ్యాటలాడ,
కులికిపోవు మకరకుండల దీధితీ
పరివేష్టనమ్మున శిరము చెలగ
నలువ దేడులు మించని కలితమూర్తి
ప్రథిత కవితా ప్రపంచ సామ్రాజ్యనేత
భవ్యభారత రచనా ప్రభావమూర్తి
ధీమనోజ్ఞుడు తిక్కనసోమయాజి

* * * *

తన గంటమున జారు తెలుగు కైతలలోన
అమృతమ్ము నొలికించునట్టి సుకవి
తనకత్తి తళతళల్ మొనసి దిగంతాల
వెలిగింపజేసిన వీరమూర్తి
తన రసనంబుపై ధ్వనియించు ప్రతివాక్కు
వైదికము గజేయు వేదవిదుడు

తన వర్తనమునందు తనరారు ధర్మముల్
    నెఱి పరిశీలించు నీతిపరుడు
కలము కత్తుల చేపట్ట గలుగు ఘనుడు
యజ్ఞ మొనరించినట్టి బ్రహ్మణ్యమూర్తి
ప్రబల కవిరాజు తెలుగు రా రాజుకడకు
నేగుదెంచగ రాజేంద్రు డెదురునడచి

*    *    *    *

సభాంగణానికి వస్తున్న రుద్రమదేవిమూర్తిని కవి ఇలా అభివర్ణించారు:

కచ్చుల్ వోసి మలంచినట్టి రుచిరాం
    కంబైన చేలంబుతో
చిచ్చుల్ దూకు సమస్త శత్రుభయదో
    త్సేకంపు నేత్రాలతో
అచ్చంబైన తెలుంగు పోడుములు చా
    యల్ చిందు మైఱీవితో
వచ్చెన్ రాణి సభాంగణంబునకు త్రో
    వల్ సూప వైతాళికుల్.

హృదయాన్ని స్పందింపజేయగల వీర రసాత్మక గంభీరరచన. తేజోవంతుడగుటకు ప్రతి ఆంధ్రుడూ చదువదగినది.

## పంచరాత్రము

మహాకవి భాసుని సంస్కృత సమున్నా కారానికి తెలుగుసేత; అనువాదకులు: శ్రీ గట్టి లక్ష్మీనరసింహ శాస్త్రి గారు.

ఈ రూపకంలోని పాత్రలు చాలావరకు అన్నీ భారతంలోనిపాత్రలే. కాని కథాఘటన యావత్తూ విచిత్రమైన స్వతంత్రకల్పన. రామాయణ భారత గాథలను వేటిని స్పృశించినా భాసుడు వాటిని సమగ్రంగా మార్చి ఆయా పౌరాణికపాత్రలకు మరింత శోభను తెచ్చాడు. దుర్యోధనునిపాత్రపట్ల భాసునకు ప్రత్యేకాభిమానం వుంది. 'ఊరుభంగం' లో నేమి ఈ రూపకంలో నేమి ఆపాత్రకు వన్నెలు తీర్చాడు.

కథాసంగ్రహం: దుర్యోధనుడు యజ్ఞం చేశాడు. అవభృథస్నానానంతరం అతను ఆచార్యద్రోణులకు గురుదక్షిణ ఇవ్వాలని కుతూహలపడతాడు. ఏదైనా కోరుకోమంటాడు. పాండవులకు అర్ధరాజ్యం పంచి యివ్వటం తనకు అభిమతమైన దక్షిణ అనీ అది యిస్తే స్వీకరించుతాననీ ద్రోణుడు అంటాడు. అయిదురాత్రులలోగా పాండవు లెక్కడున్నారో తెలుపగలిగితే అలానే అర్ధరాజ్య మిస్తానంటాడు దుర్యోధనుడు. అదేసమయానికి అక్కడికి కీచకవధా వృత్తాంతం తెలుస్తుంది. కీచకుణ్ణి చంపినవాడు తప్పక భీముడై వుంటాడని భీష్ముడు పసికడతాడు. సరే, అశేషరథుమీద దక్షిణ పుచ్చుకోమని ద్రోణాచార్యులను ప్రోత్సహించుతాడు. ద్రోణాచార్యులు పుచ్చుకుంటాడు.

విరాటనగరంలో పాండవులు వున్నట్టు రూఢిచేయడ మెలాగని యోచించి భీష్ముడు విరటుడు యజ్ఞానికి రాకుండా అస్నేహాన్ని ప్రకటించాడు గనుక అతన్ని శిక్ష చేయాలనీ అందుకు సైన్యంతో పోయి అతని గోవులను హరించుదామని దుర్యోధనుణ్ణి ప్రోత్సహించుతాడు. యజ్ఞం చూడ వచ్చిన అభిమన్యుడుకూడా భీష్మద్రోణాదులతో పాటు ఆసైన్యంతో కలిసి యుద్ధానికి బయలుదేరాడు.

ఇక్కడ ఉత్తర గోగ్రహణం కథ. కౌరవ సేనను చిదిమి గోగణాన్ని మరలించుకుపల్లె సంద ర్భంలో విరాట సైన్యంలోని ఒకడు (భీముడు) అభిమన్యుణ్ణి బందీగా పట్టుకుని విరాట నగరానికి తీసుకుపడతాడు.

గోవులను మరలించి తెచ్చింది తాను గాదనీ బృహన్నల రూపంలో వున్న ధనంజయుడని ఉత్తరుడు తెల్పడంతో పాండవుల రహస్యం బట్టబయలవుతుంది. విరాటుడు తన కుమార్తె ఉత్తరను అభిమన్యుడికిచ్చి వివాహం చేయటానికి నిశ్చయించాడు.

చెల్లాచెదరైన కౌరవసేనలు తిరిగి ఒక చోటికి కూడి విడిసివుంటాయి. "అభిమన్యుడికీ ఉత్తరకూ వివాహం జరగాలని పెద్దలు నిశ్చయించారు. మీరందరూ రావటానికి వీలుగా వివాహం యెక్కడ చేయమంటే అక్కడ చేస్తాం. మీ అభిప్రాయం తెలుపవలసిం"దని ధర్మరాజు కౌరవసేనావారానికి ఉత్తరుని దూతగా బంపుతాడు.

'అయిదురాత్రులూ గడవక మునుపే పాండవుల ఉనికి తెలుసుకున్నాం. గనుక అర్ధరాజ్యం యిచ్చి

వేయమని భీష్మద్రోణులు అడుగుతారు. దుర్యోధనుడు అర్ధరాజ్యమిచ్చి మాట నిలుపుకుంటాడు.

టూకీగా ఇదీ కథ. కాని సన్నివేశంనుంచి సన్నివేశాన్ని ఉద్భవింపజేయటంలో భాసుడు చూపిన చాకచక్యాన్ని వివరించటానికి ఈ వివరణ చాలదు. గ్రంథం ఆసాంతం చదువవలసిందే. సమవాకార శిల్పంలో మనకున్న రూపకాలే బహుతక్కువ. అందుచేత ఇది కేవలం సామాన్య పాఠకులకే గాక నాటక రచయితలుగా పెంపొందదలచిన ఔత్సాహికులకు కూడా పరిశీలనార్హమవుతున్నది.

భాసుని రచనకు అనువాదాన్ని ఘటించటం సామాన్య విషయం గాదు. శ్రీ లక్ష్మీనరసింహశాస్త్రి గారు ఇది అనువాదమా స్వతంత్ర రచనా? అనే అనుమానం కలిగేలాగు విజయవంతంగా ఈ రచనను నిర్వహించారు.

## మాఘ పురాణము

[స్కాందాంతర్గతము]

అనువాదకులు: శ్రీ పోతరాజు లక్ష్మీనరసింహ కవిగారు; ఏల్చూరు. వల: 5-0 0.

ఈ పురాణంలో జీవమణులవంటి గాథలు అనేకం వున్నయ్. శ్రీ లక్ష్మీనరసింహ కవిగారు ఈ గాథల నన్నిటినీ కేవల పురాణధోరణిలో కాక ఒకొక్క కథను సుందరతరమైన ఒక మహాకావ్యంగా సంఘటించారు. శ్రీ లక్ష్మీనరసింహ కవిగారు సంస్కృతాంధ్ర భాషలయందు విశేష పాండిత్యం కలవారు. రససిద్ధిని పొందిన కవితాసరస్వతి వీరి నాశ్రయించి వుంది. ఇలా ప్రతిభా వ్యుత్పత్తులు రెండూ ఒక్కచో సమ్మేళనం పొందివుండటం ఏ ఒక రిద్దరు మహామహులలోనో!

శబ్దార్థాలంకారాలను అప్రయత్న పూర్వకంగా పూలజల్లులుగా కురిపించుచూ ఉన్నతమైన శిల్పపథాన కవి పురోగమించటం అబ్బురపాటును కలిగించుతుంది.

కం॥ శ్రీకర హస్త ప్రపద బహు
భూదరముల నదుల దరుల బొల్చును శ్రేయ
స్సాధక శరణ్యమయి సుమ
నోదక గణ్యము నైమిశారణ్యమిలన్.

* * *

మందారద్రుమబృంద సత్ఫలరసాం
భఃపూర కాసార వా
కేందీమందిర గంధభృత్పవన ఘూ
తేశావలో కాగతా
మందాయాసము భాసమాన నిజథా
మచ్ఛిన్న రాజచ్ఛర
త్కాండోల్లాసము సౌధభాస
మెసఁగున్ గైలాస మావాసమై.

ఇలాంటి పద్యాలు ఈగ్రంథంలో కోకొల్లలు. ఆముఖములో శ్రీ మిన్నికంటి గురునాథశర్మ గారు సెలవిచ్చినట్లు లక్ష్మీనరసింహకవిగారు "'శబ్దం బనుసరించియు, అభిప్రాయంబు గుర్తించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబున' శ్రీనాథుంబోలె స్కాంద మాఘపురాణము నాంధ్రీకరించిరి". ఇంతే కాదు పద్యనిర్మాణశిల్పమంతా కూడా శ్రీనాథుని దక్షతకు ప్రతిమూర్తిగా వుంది. మచ్చుకు; సౌకపీచరిత్రఘట్టంలోని ఈ తటాకవర్ణనను పరిశీలించవచ్చు.

ఆ కమలాకరం బరుణాంశుకిరణ రో
ధి తరువితాన శోభితతటంబు
పుండరీకారుణాంభోజకైరవహల్ల
కేందీవరవ్రాత సుందరంబు
శ్రవణానుమోదక ఝంకారకారి మ
త్తాళి సందోహ సమావృతంబు

చంచలజ్జలచరాజస్ర నిర్భిన్నత
రంగ పరంపరా భ్రాజితంబు
శ్రోతృనివహ మనోహరరుతవిలాస
సంచరజ్జలపక్షి సముంచితంబు
మందగంధవహోర్భక మందిరంబు
విహరణాగతప్రాణి సంప్రీతిదంబు.

కేవల ముముక్షువులకే కాక, కావ్యరసపిపాసువులకుగూడా వందనీయమయేలాగు ఈ రచనను సంఘటించిన శ్రీ లక్ష్మీనరసింహకవి గారు చరితార్థులు.

## గీతాకదంబము

ప్రథమదళము; సాధన గ్రంథమండలి, తెనాలి. వెల రు 1-4 0.

'భగవద్గీత' మాత్రగాగానే ఇతర పురాణాల లోనూ ఉప పురాణాలలోనూ అనేక గీతలున్నయ్. అవి కపిలగీత, భరతగీత, గోపికా గీత, భ్రమర గీత, ప్రణతిగీత, అవధూతగీత, హంసగీత, భిక్షుగీత, ఐలగీత, శ్రీరామగీత, యమగీత, పింగళ గీత, శంపాక గీత, మంకిగీత, బోధ్యగీత, హారీత గీత, వృత్ర గీత, పరాశర గీత, అనుగీత, బ్రాహ్మణ గీత, ఈశ్వర గీత, హనుమద్గీత, అర్జున గీత, పాండవ గీత, అష్టావక్ర గీత, గణేశ గీత, ఉత్తరగీత, శ్రీదేవి గీత, బ్రహ్మగీత, శివగీత, వ్యాసగీత, సూతగీత, సూర్యగీత మొదలైనవి. ఈ గీతలనన్నిటినీ సమీకరించి గీతాకదంబము అనే పేర వేరువేరు దళసంపుటాలుగా ప్రచురించటానికి సాధనగ్రంథమండలివారు పూనుకున్నారు.

ఈ ప్రథమదళ సంపుటంలో 'గోపికాగీత', 'భ్రమరగీత' 'హంసగీత', 'భిక్షుగీత' 'అవధూతగీత' ఈ అయిదూ వున్నయ్. వాటిలో 'గోపికాగీతికలకు, భ్రమరగీతికలకు' పోతన అనువాదంతో ఆంధ్రప్రజలలో అత్యంత వ్యాప్తి కలిగింది.

కేవలం సంస్కృతమూలశ్లోకాలను సంపుటీకరించటమేగాక ఈ గీతలకు తెలుగు వచనానువాదాన్ని

## దేశదేశాల కథలు - I

అనువాదకులు: శ్రీ గద్దె లింగయ్య; ప్రచురణ: ఆదర్శ గ్రంథమండలి; విజయవాడ: వెల 1 0.0.

ఈ సంపుటిలోవున్న కథలు:—

(1) బహుమతి (అమెరికన్ కథ) ఓ హెన్రీ.

(2) విధవ పాతివ్రత్యం (చీనా కథ) అజ్ఞాత రచయిత.

(3) పురుషవ్యామోహం (ఇటాలియన్ కథ) జర్జరి కన్ట్రే.

(4) కనపడని గాయం (హంగేరియన్ కథ) కారోలీ.

(5) స్త్రీయా, సింహమా? (ఇంగ్లీషు కథ) ఫ్రాంక్ ఆర్. స్టాక్టన్.

(6) తారతమ్యము (జర్మన్ కథ) టామ్సన్.

(7) పందెం (రష్యన్ కథ) చెకోవ్.

(8) ప్రేమ, బతుకుతెరువు (స్వీడిష్ కథ) ఆగస్ట్ స్ట్రిండ్ బర్గ్.

శ్రీ లింగయ్యచౌదరి గారు చిరకాలంగా రచనావ్యాసంగం నెరపుతున్నవారు. అనువాదాలు హృద్యంగా వున్నాయి.

## రామాయణ రత్నాకరము

రచన: శ్రీ వంగీపురం రంగస్వామి అయ్యంగారు; మూడు భాగములు: మొదటి భాగం: రు 1 0 0; రెండవభాగం: రు 0 12 0; మూడవ భాగం: రు 0 12 0; ప్రాప్తిస్థానం: రచయిత, బ్రాహ్మణపేట, పాకాల, చిత్తూరు జిల్లా;

వాల్మీకి రామాయణాన్ని దృష్టిలో వుంచుకొని శ్రీ రంగస్వామి అయ్యంగారు శ్రీరాము చరిత్రనంతా వచన గ్రంథంగా రచించారు. శైలి అత్యంత సులభమైన గ్రాంధికం. ప్రవాహంలా సాగిపోతూవుంది. ఈ రచనలో శ్రీ అయ్యంగారి భక్తితత్పరత అడుగడుగునా మనకు గోచరమవుతూ వుంటుంది.

## కథా వాహిని

ఆదర్శ గ్రంథమండలివారు, ఆధునిక ఆంధ్ర కథకుల రచనలను సేకరించి సంపుటాలుగా ప్రచురిస్తున్నారు. ఆధునిక కథకుల కల్పనా వైచిత్రిని అవగతం చేసుకోవటానికి వీలుగా ఒక్కచోట ఆ

కథావాహిని I: పద్మరాజు కథలు
,, II: కొడవటిగంటి కథలు
,, III: భరద్వాజ కథలు 1 0 0
,, IV: సూర్యారావు కథలు 1-0-0
ప్రాప్తిస్థానము: ఆదర్శ గ్రంథమండలి, విజయ

Printed & Published For Nageswara Rao Estates Ltd., by S. Radhakrishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1.
Editor: S. Sambhu Prasad.

Bharathi, 7th July 1955 Regd. No. M. 1856